# కల్పన

(రచయిత్రుల కథల సంకలనం)




గౌరవ సంపాదకుడు

కీర్తిప్రియ



పద్మప్రియ ప్రచురణలు

విశాఖపట్నం-4.

# కల్పన—

తెలుగు కథానికా సాహిత్య సీమలో మగువలు పోషించి పెంచుతున్న పూల మొక్కల నుండి కొన్ని పూల నేర్చి కూర్చిన పూలమాలిక. పరిమితమైన శక్తి సామర్థ్యాలతో దానిని చక్కగా సమకూర్చాలని ప్రయత్నించాను. ఈ మాలిక తెలుగు పాఠక లోకానికి కొత్తది. దీని అంద చందాల నిర్ణయం సహృదయులైన పాఠకులకే విడిచి పెడుతున్నాను.

సేకరణ విషయంలో సహకరించిన ఆయా రచయిత్రులకు, దక్షిణ భారత పుస్తక ప్రచార సంస్థకు, మిత్రులకు నా కృతజ్ఞతలు తెల్పుకుంటున్నాను.

గౌరవ సంపాదకుడు.

విషయ సూచిక—

# అదృష్ట దేవత

కొమ్మూరి ఉషారాణి

ప్రియమైన సుందరంకి,

ఈమధ్య నువ్వు తరచుగా జ్ఞాపకం వస్తున్నావు. నువ్వు నా పక్కన లేకున్నా, నీ మూర్తి నా వెంటవుండి, ఈ దుఃఖ సమయంలో నన్ను వూరడిస్తున్నట్లేవుంది. నా మనసులో రగులుతున్న ఈ ఆవేదన, ఎన్నటికీ చల్లారదేమో అన్న ఈ అగ్ని, ఎలా సమసిపోవాలో నాకు పాలుపోవటంలేదు. నీకూ నాకూ మధ్య వున్న స్నేహం, ఆత్మీయత మామూలుకాదు. నా పరిస్థితి అర్థంచేసుకుని, నాకు సలహాయిస్తావనే ఆశతో ఈ ఉత్తరం రాస్తున్నాను.

“మా కుటుంబ పరిస్థితులు నానాటికి చాలా విచిత్రంగా రూపొందుతున్నాయి. డబ్బులేమి అను, మధ్యతరగతి కుటుంబీకులు సామాన్యంగా ఎదుర్కొనే అసంతృప్తి అను, సహజ అపేక్షలు లోపించటం అను, మాలో ఒకరిమధ్య ఒకరికి గోడలు ఏర్పడుతున్నాయి. జీవితంలోని ఒక్కో సంఘటనా, సుఖదుఃఖాలు ఒకర్ని ఒకరికి దగ్గరగా చేర్చటం పోయి అగాధాలు ఏర్పడుతున్నాయి. మాలో మాకు వున్న ఈ పొరపొచ్చాలకితోడు, అన్నయ్య ఈమధ్య ఒక కొత్త సమస్యని తీసుకువచ్చాడు మా మధ్యకి.

“ఎవరో అనాథబాలికట. చిన్నప్పుడే తల్లితండ్రుల్ని పోగొట్టుకుంది. పెత్తండ్రి పెంపకంలో అష్టకష్టాలుపడి, చివరకి జీవితం పెట్టే పరీక్షలో నెగ్గలేక, అధఃపాతాళానికి దిగజారిన పిల్లని యింట చేర్చాడు. పిల్ల బుద్ధిమంతురాలు. బ్రాహ్మణ కుటుంబంలో పుట్టింది. ఆ పిల్లని సంస్కరిద్దామనో, ఆశ్రయం కల్పిద్దామనో, అన్నయ్య

ఏ వుద్దేశంతో యింట చేర్చాడోగానీ వాటికి పరిణామాలు మటుకు చాలా దారుణంగా తయారయాయి ఆ పిల్లని వంట యింట్లో చేర్చరాదని బామ్మ గోల, కుర్చీలో కూర్చోరాదని వాదిన రూలు, దేవుడి గదిలో ప్రవేశిస్తే అంటు అని అమ్మ కేకలు. ఇంట్లో ఆడవాళ్లు ఆ పిల్ల బ్రతుకు భరింపరానిదిగా తయారుచేస్తున్నారు ఈ మాటలు, పోట్లు ఒకమూల ఇలా వుండగా. స్కూల్లో చేర్పిస్తామనీ, అనాధ స్త్రీ శరణాలయంలో రికమెండు చేస్తామనీ, రోజు కొకరు చొప్పున యింటి చుట్టూతిరిగిపోయే సంఘసంస్కర్తలు, పెద్దమనుష్యులు ఎక్కువయి పోతున్నారు. ఆ పిల్లదేనికీ ఉలకదు, పలకదు. తన భవిష్యత్తుని తానే నిర్ణయించుకో గలననే ఆత్మ విశ్వాసం, ధైర్యం, తుదకి తిట్లకీ సూటిపోటి మాటలకి చలించే ఉద్రేకం సయితం కోల్పోయిన ఆ రాతిబొమ్మని చూస్తే నా గుండె తరుక్కుపోతోంది.

"ఈ యింట్లో ఆ పిల్ల ఎలా అన్నం తింటోందో, నిద్రపోతోందో నాకు చాలా ఆశ్చర్యంగా వుంది. ఆ పిల్లకేసి చూస్తేనే పెద్ద అన్యాయం జరుగుతున్నట్లు బాధగా వుంది. ఈ నరకకూపం నుంచీ, వాతావరణంనుంచీ ఆమె నెలాగైనా రక్షించాలని వుంది. నేను యింకా చదువుకుంటున్నాను. అస్వతంత్రుణ్ణి. ఆ పిల్లకి సహాయపడాలనే కోరిక వుందిగానీ అది ఎలా నెరవేరగలదో తెలియని పరిస్థితిలో వున్నాను. నన్ను ఏంచేయమంటావు? నీ వేమయినా సహాయం చేయగలవా ?"

సుందరం స్నేహితుడి ఉత్తరం జేబులో పెట్టుకుని సిగరెట్ ముట్టించాడు. భాస్కరం ఎప్పుడూ ఇంతే. చిన్నప్పటినుంచీ ఉద్రేకం, సెంటిమెంట్లు గల వ్యక్తి. కొన్ని విషయాలను దులిపేసుకునే స్వభావంలేదు. చిన్న విషయాలనే పెద్ద విషయాలుగా ఊహిం

చుకుని కుమిలిపోయేరకం. లేనిపోనివన్నీ తనమీద వేసుకుని బాధ పడిపోతూ వుంటాడు. చదువుకుంటూ, హాయిగా, నిశ్చింతగా జీవితం గడపాల్సిన ఈ వయసులో ఈ గొడవ ఏమిటి? ఒక అనాధ బాలికని రక్షించబోవటం ఏమిటి? కొంపతీసి ఆ పిల్లను ఇతను ప్రేమించటం లేదు కదా!... ఇదీ ఒక సమస్యే?... సుందరం పడ క్కుర్చీలోంచి లేచి గడియారం చూసుకొన్నాడు. అప్పుడే తొమ్మి దయింది. ఇంకో అరగంటలో రైలు ప్లాటుఫారం మీదికి వస్తుంది. రంగడ్ని పిలిచి వెంటనే టాక్సీ పట్రమ్మన్నాడు.

అనుకున్నదానికంటే ఓ అరగంట ఆలస్యంగా వచ్చింది రైలు. సెకండు క్లాసు కంపార్టుమెంటులో అట్టే రద్దీలేదు. పరుపు పర్చు కుని, దినపత్రిక, శంకర్సు వీక్లీ, ఫిలింఫేరు ముందు వేసుకుని, కిటికీ లోంచి బైటికి చూశాడు సుందరం... అతని ఆలోచనలు ఆ పరిసర ప్రాంతాలనుంచీ, భాస్కరం ఉత్తరంనుంచీ కొన్నివందల మైళ్ళు దూరం పరుగెత్తింది.

పచ్చని పొలాలు, నీలాకాశం, నల్లనికొండలు, అక్కడక్కడా వైర్‌లెస్ తీగెలమీదుగా ఎగిరే రంగు రంగుల పిట్టలూ... ప్రకృతి సౌందర్యాన్ని తనివితీరా చూస్తూ, ఆ పొలాల మధ్య, రంగుల మధ్య తన జీవిత స్వప్నాన్ని చిత్రించుకున్నాడు సుందరం. మద్రాసులో ఓ చిన్న యిల్లు, ఆ యింటిముందు చక్కని పూలతోట, ఆ తోటకి నీళ్ళు పోస్తూ ఓ మాలీ, ఆఫీసునుంచి అలసి తిరిగివచ్చిన తనని చిరునవ్వుతో పలకరించే అర్ధాంగి.... జీవితంలోని ఒక్కో మధురఘట్టం కళ్ళ ముందు నాట్యమాడింది - రూపం, విద్య, సాంప్రదాయం గల చక్కని భార్య, మంచి ఉద్యోగం, కొండంత భవిష్యత్తు - ఏ వ్యక్తి అయినా ఇంతకంటే కోరుకునేది ఏముంది?......

పెళ్లిచూపులకి వెళ్ళినప్పుడే పార్వతి అంటే అమ్మ ఎంతో ఇష్ట పడింది. ఇక నాన్న సరేసరి! వెంటనే ముహూర్తం పెట్టించాలన్నాడు.

ఉభయపక్షాల పూర్తి అంగీకారంతో నిశ్చయమయింది సంబంధం... ఓ నెల తిరక్కముందే తనకి ఉద్యోగమయింది. అరె! పిల్ల అదృష్టమన్నారు అంతా... సుందరం ఖాళీ సిగరెట్ పెట్టె కిటికీలోంచి బైటికి విసిరేశాడు. కొత్త పెట్టె తెరిచాడు. ఆ క్షణంలో గాలిలో ఎగురుతున్న సెలుఫూన్ పేపరు ఎంతో అందంగా కనిపించింది సుందరం కళ్ళకి... తను వుద్యోగంలో చేరబోతున్నాడు...పార్వతికి అతి సన్నిహితంగా వెళుతున్నాడు... ఇక పెద్దల ఆశీర్వాదంకోరకు మాఘమాసంవరకూ వేచివుండాలి... అరె! రైలు ఇంత నిమ్మళంగా వెళుతోందేం? ఈవేళ పొద్దు ఎక్కువేమి చెప్మా! మద్రాసు మొత్తానికి చాలా దూరమే - ఇలాటి ఆలోచనలతోనే సతమతమయాడు సుందరం. అతనిలో రేగిన ఆతురత. ఉత్సాహం అలాటివి ఆ సమయంలో.

రాయపేటలో మేనమామగారింట్లో మకాం-కొత్త వుద్యోగం, సాయంత్రంపూట పార్వతి ఇంటికి పికార్లు, ఆదివారాలు సినిమాలు, బీచీ జీవితం మధురంగా, అతి మధురంగా గడచిపోతూంది సుందరానికి అప్పుడప్పుడూ పాంటు జేబుల్లోనూ, పెట్టె అడుగునా భాస్కరం ఉత్తరం అడ్డు వచ్చేది, ప్రియస్నేహితుడికి జవాబు రాయలేదనే బాధ మనసుని పీకేది. కాని దానికి తగిన మూడ్ లేదంటూ వాయిదా వేస్తున్నాడు.

• • • •

క్యాలెండరు పేజీలు గిరగిర తిరుగుతున్నాయి. మాఘమాసం దగ్గిర పడుతూంది పార్వతి సుందరరూపం, వంకర్లు తిరిగిన ఒత్తయిన జుత్తు, తీగెలాటి శరీరం, మత్తెక్కించే కళ్ళు. ఒళ్ళు పులకరింపజేసే చిరునవ్వు - వీటన్నిటితో బాటు పార్వతి హృదయం. ఆ హృదయం వెనుక దాగివున్న ఆలోచన పరంపరలు కొద్దికొద్దిగా అవగాహన అవుతున్నాయి సుందరానికి. ఆమెని రోజూ కలుస్తు

న్నాడు. షికారుకి వెళుతున్నాడు. రంగు రంగు చీరల్లో, అలంక రణలలో అందాలు ఒలకబోస్తూ ముగ్ధుణ్ణిచేస్తూ పార్వతి అతనికి మానసికంగా కూడా చాలా దగ్గరగా రాగలిగింది.

ఆమెయందు అతనికిగల ఆకర్షణ హెచ్చవుతూంది. కానీ దానితో పాటు అతని మనసులో ఏదో ఆందోళన, అర్థంకాని అసం తృప్తి అలముకుంటున్నాయి. అంతేకాదు; ఒక్కొక్కప్పుడు పార్వతి అతన్ని ఆశ్చర్యచకితుణ్ణిగా చేస్తుంది. "మా నాన్నగారు ముందే చెప్పారు. మీకు మంచి ఉద్యోగం దొరుకుతుందని. నేను ఎప్పుడూ- నా సెలెక్షనులో తప్పుచేయను. మీరు అందంగా ఉన్నారని నా స్నేహితులు ఎగ్రీఅయారు" అన్నది నవ్వుతూ. ఈవిషయాన్నే ఇంకో విధంగా, సున్నితంగా అనిఉంటే బాగుణ్ణు అనిపించింది సుందరానికి.

"నాకు మొదట్నుంచీ వివాహం గురించి యిదమిద్ధమని కొన్ని అభిప్రాయాలున్నాయి. అందం, డబ్బు హోదా యిలా నా మన సుకి అనువైంది ఏరుకుని, అవి వున్న వ్యక్తిని వివాహమాడాలని నిశ్చయించుకున్నాను. నా ఆశ నెరవేరింది" అన్నది యింకో రోజు. "ఏ ఆశ?" అని అడగాలనిపించింది సుందరానికి. కానీ వెంటనే మనసుని నిలద్రొక్కుకున్నాడు.

ఇంకోరోజు భాస్కరాన్ని గూర్చి ఉపోద్ఘాతమిచ్చి, అతని ప్రస్తుత సమస్యని విడమర్చి,

"ఏమంటావు?" అన్నాడు సుందరం ఆతురతతో.

"ఆ! అంతా ఒట్టి నాన్సెన్సు. ఈ మధ్య మన సొసయిటీలో యిలాటి కేసులు ఎక్కువయాయి. అనాథ శరణాలయాలు, సంక్షేమ కేంద్రాలూ ఉన్నాయి కదా అని ఇలాటివాళ్లు కొల్లలుగా తయారవుతున్నారు" అతి చులాగ్గా తేల్చేసింది పార్వతి. సుందరం మనస్సు ఎందుకో చివుక్కుమంది.

"ప్రేమా గీమా నాకు నమ్మకంలేదు. నేను చాలా ప్రాక్టికల్ మనిషిని" అన్నది యింకోరోజు మాటల సందర్భంలో. ఆ మాటతో సుందరం తల దిమ్మెక్కినట్లయింది. అతని చేతిలోంచి ఏ అదృష్ట దేవతో జారిపోతున్నట్లనిపించింది.

తన అభిప్రాయాల బరువు, దృక్పథం, సుందరంలో ఎలాటి ప్రతిభావం కలిగిస్తుందో, అతనిలో ఎలాంటి మార్పును కలిగిస్తున్నదో ఆగి ఆలోచించలేదు పార్వతి. తన చక్కదనంతో, ఎకాంప్లిషు మెంట్సుతో అతన్ని మంత్ర ముగ్ధుణ్ణి చేస్తున్నాననే నమ్మకతో ఆమె ముందుకి వెళ్ళిపోయింది. కానీ సుందరం తనకి చాలాగజాల వెనుక నిలబడిపోయాడని తెలుసుకోలేదు ఆమె.

సుందరంలో సంభ్రమాశ్చర్యాలులేవు యిప్పుడు. జీవితంపట్ల ఒక విధమైన నిర్లిప్తత, అసంతృప్తి కావు అవి. ఎవరికీ చెప్పుకోలేని, చెప్పరాని ఆవేదన అది. తన జీవిత స్వప్నం ఎలా ఎందుకు కూలిపో యిందో, ఎవరికీ అర్థంకాని ఒక భరింపరాని ఆవేశం ... మనసుని ముక్కలు ముక్కలుగాచేసే దిగులు. తను ఎక్కడ పొరబాటు చేశాడో, జీవితాన్ని ఈ భయంకరస్థితినుంచి ఎలా కాపాడుకోవాలో తెలియలేదు అతనికి.

సుందరం ఇప్పుడూ కలతనిద్రతో బాధపడుతున్నాడు. స్వప్నాలు కంటున్నాడు. ఆ కలల్లో పచ్చని పైరులూ, రంగురంగుల పిట్టలూ, అతిరూపవతి అయిన భార్యా లేరు. బీచీలో అలల వైపుగా నడచివస్తున్న పార్వతి, ఆమె చేతి వ్రేళ్ళ నాజూకుతనం అతన్ని ఉక్కిరిబిక్కిరి చేయటంలేదు. తన భావాలలో లీనమై, తన మనసు విశాలంలో ఓ పక్క పంచుకుని, తన ఉద్రేకాలపట్ల సానుభూతి చూపుతున్న ఒక స్త్రీ నిలచివుంది. ఆమె సౌందర్యం, లాలిత్యం అతని కళ్ళకి మసకమసకగా కనుపిస్తున్నాయి. కానీ ఆమె కళ్ళల్లో ప్రేమ జ్యోతి అఖండంగా వెలుగుతోంది. దయాకరుణలతో పొంగిన

ఆమె హృదయం అతనికి లీలగా గోచరించింది. ఎలాటి జీవిత సత్యాన్నయినా ఎదుర్కొనగలిగే మనస్థయిర్యం ఆమె మాటల్లో ప్రస్ఫుటమయ్యాయి... కల కరిగింది. సుందరం కళ్ళు తెరిచాడు. కానీ ఆ కలలమాటున దాగివున్న తీవ్రమైన వాంఛ అతన్ని ఉక్కిరిబిక్కిరి చేసింది.

"సుందరం! నువ్వు అదృష్టవంతుడివోయ్"

"సుందరం! మీ తల్లి నోము ఫలించింది"

"నీకేం తక్కువోయ్. అరచేతిలో స్వర్గం వుంది"

ఎక్కడికి వెళ్ళినా ఏవైపు తిరిగినా ఆతని చెవులకి హోరెత్తిం చేవి ఈ మాటలు. ఆ కాసేపు అతనికి ఆనందంగా వుండేది. "అవును కామోసు! ఎందుకు కాదు!" అనుకునేవాడు. కానీ ఆ ఆనందం తాత్కాలికమైనదే.' ప్రపంచం గుడ్డిది' అనిపించే సంఘటనలు అనేకం ఎదురయేవి అతనికి. ఆలా రోజులు, వారాలు బరువుగా తోస్తున్న సుందరానికి ఓ రోజు భాస్కరం దగ్గిర్నుంచి మళ్ళీ ఉత్తరం వచ్చింది.

"ప్రియమైన సుందరంకి,

నీ వుత్తరం అందినప్పటినుంచీ ఎప్పటికప్పుడు సమాధానం రాయాలని, కానీ సంకోచిస్తూ ఉండిపోయాను. లేనిపోని బాధ్యతలన్నీ పైన వేసుకుని బాధపడవద్దనీ. ఈ సమస్యని యింట్లో పెద్దలకే వదిలెయ్యమనీ రాశావు. నా క్షేమం కోరి, నామీద వుండే అభిమానంకొద్దీ నువ్వు యిచ్చిన సలహాకి కృతజ్ఞుణ్ణి. కానీ దాన్ని పాటించలేకపోయినందుకు చాలా విచారిస్తున్నాను. నేను రాయబోయే విషయాలు నీలో ఎలాటి అనుభూతులు కలిగిస్తాయో తెలియదు. తప్పో, ఒప్పో నన్ను అర్థం చేసుకోగలవాడివి నువ్వొక్కడివే అని నీకీ వుత్తరం రాస్తున్నాను.

"నీకు పోయినమాటు ఆ జాబు రాశాక, యింట్లో పరిస్థితులు చాలా విషమించాయి. ఆ పిల్ల జీవితం దినదినగండమయిపోయింది. తన స్కూలులో ఉచితంగా విద్య నేర్పుతాననే మిషమీద ఓ పెద్దమనిషి ఆమె జీవితాన్ని మరింత దుఃఖభాజనం చేయ ప్రయత్నించాడు. ఆ రాత్రికి రాత్రే ఆమె గోలుగోలున ఏడుస్తూ మా వాకిటముందు వాలింది. ఆమెని వివాహం చేసుకుని సంస్కరిస్తానని ఓ యాభై సంవత్సరాల "బాలుడు" అతి దయార్ద్ర హృదయంతో ముందుకు వచ్చాడు. ఇంట్లో అందరూ, చివరకి అన్నయ్యకూడా అంగీకరించేందుకు సిద్ధమయారు. కానీ నేను ఆ దారుణాన్ని జరగనివ్వలేను.

"నిండా ఇరవై సంవత్సరాలన్నా లేవు. ప్రతి కదలికలో, చూపులో, భయాందోళనలు ద్యోతకమవుతూ, జీవితంలో ఎదురైన దెబ్బలకి దైన్యంతో కుమిలిపోతున్న ముఖం - ఆమెచేసిన పాపం ఏమిటి? కొందరు స్వార్థపరులకి ఎరఅయి, సంఘం ఏర్పరచిన నియమాలను ఉల్లంఘించింది. అందరిచేతా అసహ్యించుకుని, జాలి పడవలసిన ఘోరస్థితికి వచ్చింది.

"కొన్ని సంఘటనలు ఎందుకు సంభవిస్తాయి? కొందరు వ్యక్తులు ఎందుకు అలా ప్రవర్తిస్తారు? అనే విషయాలని లోతుగా ఆలోచించే ధైర్యం, శక్తి లేవు మనలో. జరిగిపోయిన సంఘటనల తప్పొప్పులు నిర్ణయించి కాలయాపనచేసే బదులు భవిష్యత్తునిగూర్చి ఆలోచిస్తే మంచిది. దీనికి స్వచ్ఛంద హృదయం, కార్యదీక్ష, కరుణ ఎంతో అవసరం. ఒకర్ని మనం సంస్కరిస్తున్నామనే అహం. కాఠిన్యం ఏ కోశాన వున్నా మనం తలపెట్టే కార్యం సఫలంకాదు, నా ఉద్దేశం. యిలాటి చిక్కులు ముడిపడటంవల్లనే ఆ పిల్ల సమస్యని యిక్కడ ఎటూ తేల్చలేకపోతున్నారు. అంతేకాదు, సంస్కరణ పేరుతోవున్న స్థితిని మరింత దుర్భరంచేస్తున్నారు.

"ఈ పై ఆలోచనలతో కలతచెందుతున్న నేను ఒక దృఢ నిశ్చయానికి వచ్చాను. ఆమెను ఒక స్త్రీ సంక్షేమ కేంద్రంలో చేర్చే ఏర్పాట్లు చేశాను. రెండు సంవత్సరాలపాటు అక్కడ ఆమెకి కుట్లు చేతిపనులలో తర్ఫీదు యిస్తారు. కొద్దిగా చదువుకూడా చెబుతారు. వసతి, భోజనం ఉచితం. ఈ తర్ఫీదు పూర్తయాక ఆమెకు స్వతంత్ర జీవనోపాధి చేసుకునే అవకాశం ఏర్పడుతుంది. ఈ ఏర్పాట్లన్నీ చేసి ఆమె నక్కడ చేర్చేముందు యింటా బయటాకూడా నా మీద అక్షింతలు చల్లినవారే! పిల్లల్ని పట్టుకునే ఆయా కిందయినా వుండేది మధ్య నక్కడ ఎందుకు అనిమూతి విరిచింది ఒదిన. అంట్లు తోముతూ పైపనికి సహాయంగా ఉండేది అంటూ వాపోయింది అమ్మ. "మీవాడేమిటి? ఆ పిల్లనేసుకుని వీధులంట తెగతిరుగుతున్నాడు!" అని నాన్న చెవులుకొరికారు చుట్టాలు, స్నేహితులు.

చేతిగడియారం అమ్మేసి, ఆమెని తీసుకుని, విజయవాడ రైలు ఎక్కేసరికి నాకూ నా కుటుంబానికీ మధ్యవున్న సంబంధం పూర్తిగా తెగిపోయింది. ఆమెని లేవదీసుకు పోతున్నాననీ, తల్లి తండ్రులకి కృతఘ్నుడననీ, పెద్దలయందు భయభక్తులులేక చెడిపోయాననీ నిర్ణయించింది లోకం.

"నాకు ప్రస్తుతం ఇవేమీ అంటవు. ఈ వూళ్లోనే ప్రయివేటు కంపెనీలో చిన్న ఉద్యోగం సంపాయించాను. నా సంపాదనలో ఆమె పైఖర్చులకి నెలకి ఓ యిరవై రూపాయలు పంపుతున్నాను. సాయంకాలాలు ప్రయివేట్లు చెబుతున్నాను. వారానికి రెండు సార్లయినా ఆమెని వెళ్ళిచూసి వస్తూంటాను.

"నాకు ఈ వూళ్లో స్నేహితులనబడే ఘరానా పెద్దమనుష్యులు, చుట్టాలు బొత్తిగా లేరు. ఒకవేళ వున్నా వాళ్ళు నన్ను చూసి ముఖం తిప్పేసుకుంటారు. వాళ్ళ యిళ్ళల్లో నేను అడుగు పెట్టటం కాదుకదా, వీధిలో పలకరించేందుకే సిగ్గుపడతారు పాపం.

ఇలా తెగతెంపులు చేసుకు వచ్చేసినందుకు, మందలిస్తూ అన్నయ్య మటుకు ఓ ఉత్తరం రాశాడు. ఒక్క బరువైనా భుజాలనుంచి దిగి పోయినందుకు అన్నయ్య సంతోషం అన్నయ్యది. ఆ వుత్తరం మినహా మరి యింటి విషయాలు నాకేమీ తెలియవు.

"నాకు ఈజీవితంలో ఏ అసంతృప్తీ, దిగులూ లేదు. పైపెచ్చు బోలెడంత ఆత్మ విశ్వాసం, ధైర్యం చేకూరాయి. వీటితోబాటు ఓ మధురమైన అనుభూతికూడా నాజీవితాన్ని పునీతం చేసింది. నేను లలితని...ఆమెని...ప్రేమిస్తున్నాను. ఈ విషయం ఆమెకింకా తెలి యదు. ఈ రెండు సంవత్సరాలూ ఆమెకు ఆర్థికంగానూ, యితరత్రా సహాయపడే ఒక స్నేహితుణ్ణిమటుకే నేను. తరువాత నా భాగ్యం ఫలిస్తే ఆమెను అర్ధాంగిగా చేసుకోవాలని. నన్ను పూర్తిగా విశ్వ సించి, తన జీవిత పుటలని యావత్తు నా ముందుంచి, గౌరవాభి మానాలతో నన్ను పలకరించే లలిత — 'ప్రేమ' అనే పదానికిగల నిర్వచనం, విలువ యావత్తు, ఆమెలో చూడగలిగాను.

"ఇంతకంటే ప్రస్తుతం ఇంకేం రాయలేను. నీ సహకారం, ఆశీర్వాదం ఎల్లప్పుడూ లభిస్తుందనే ఆశతో - భాస్కరం".

చెమ్మగిల్లిన కళ్ళతో వుత్తరం మడిచాడు సుందరం. అవి ఆనంద బాష్పాలు. ప్రియ స్నేహితుడి సాహసానికి. మనోదారుఢ్యా నికీ, కరుణ హృదయానికీ మురిసిపోయింది మనసు, కానీ ఎందుకో కొద్దిగా కలతచెందిందికూడాను. లలిత... ఎవరు...? ఎలా వుంటుంది? "ప్రేమ" అనే పదానికి గల నిర్వచనం, విలువయావత్తు ప్రస్ఫుటం చేసే వ్యక్తి... సుందరం ఆ పంక్తిని పదేపదే చదువుకున్నాడు. తన చెయిజారిపోయిన అదృష్టదేవత... కాదుకాదు ప్రేమదేవత! స్నేహి తుణ్ణి దీవించింది... ఆ క్షణంలో భాస్కరంకంటే భాగ్యవంతుడు మరొ కడు కనిపించలేదు సుందరంకి.

# అవేద్యాలు

నిడదవోలు మాలతి.

తలొంచుకుని తండ్రి వ్రాసిన ఖండకావ్యం తాలూకు ప్రూఫు చూస్తోంది శారద. శారదని చూసి ఆగిపోయాడు చలపతి ఒక కాలు గుమ్మంలోనూ, ఒక కాలు గుమ్మంపైనా ఉంచి - రన్నింగ్ రేస్‌లో ఛాంపియన్‌లా.

కొనకంటిలో మనిషి మెదిలినట్లయితే 'ఎవరోలే' అనుకుని, కావలిస్తే వాళ్ళే పిలుస్తారు అన్నధోరణిలో దృష్టిమరల్చలేదు శారద.

చలపతి సందిగ్ధంగా ఓ నిముషం నిలబడి "మామయ్యలేరా ?" అని ప్రశ్నించాడు మందరస్వరంలో.

శారద తలెత్తి 'ఓహో' అంది కొత్తగా గుర్తుపట్టినట్టు. అలా అనడంలో కాస్త తడబడుతూ 'నువ్వా!' అనేసి చప్పున 'నాన్నగారు లేరు. ఇప్పుడేవస్తానని వెళ్ళి చాలాసేపయింది వచ్చేస్తారు' అంది గబగబ.

చలపతి "పోనీలే. మళ్ళీవస్తాను" అన్నాడు వెనక్కి తిరగబోతూ.

'కూర్చోకూడదూ - ఒక్క అయిదు నిముషాలు' అంది. కాని అతగాడ్ని అక్కడ అలా ఆకట్టడంలో తన ఒళ్ళో ఏమీ లక్షలు కురియవు. ఆ మాట అతను గ్రహించేలా, 'నాన్నగారు రాజమండ్రి వెళ్తున్నారు రాత్రికి, రెండు మూడు రోజుల దాకా రారు.' అంది.

చలపతి కూచోడానికే నిశ్చయించుకుని ఓ మూలపడి ఉన్న పాత పత్రిక ఒకటి తిరగేయసాగాడు. కొనకళ్ళలోంచి శారదరూపం లీలగా కనిపిస్తూంది. శారద అపరంజిబొమ్మ. పువ్వులాటి మనిషి.

'ఏదైనా పనిమీద వచ్చేవా?' శారద యాదృచ్ఛికంగా ప్రశ్నించింది. కాని అందులో వింతైన కౌతుకం వ్యక్తమౌతూంది.

అప్పుడే శారదకెలా తెలిసింది? ఆ మాటే అడుగుదామను కున్నాడు. కాని 'దొంగాడా! కరవకు' అన్నట్టుంటుంది.

'ఏమీలేదు' ఎంతనిర్లక్ష్యంగా అందామని ప్రయత్నం చేసినా ఏదో వెలితిగానే వినిపించింది.

'అంతేనా' అంది శారద గుండెమీంచి బండ దింపినవతుగా. "హేళన" అనుకున్నాడు చలపతి. అంతకన్నా 'ఆమాట చెప్పడానికి ఇంతదూరం రానక్కర్లేదు. ఇంతసేపు నిరీక్షించ నక్కర్లేదు ఇంకేదేనా పనుందా?' అనడిగితే బాగుండేది.

'మా తమ్ముడు దురదృష్టజీవి' అన్నాడు, గతం అప్పుడే జ్ఞాపకం వచ్చినట్టు. శారద పెదిమిలమీద లీలగా మెరిసిన నవ్వు ఆ వాక్యాన్ని నిరసించింది.

'నిర్ధారణేనా?' అంది శారద.

• • • •

శారదకి జ్ఞానం వచ్చినప్పుడే తనకి తల్లి లేదని తెలుసుకుంది. మెల్లిగా ఇల్లు చూసుకుంటూ ఫోర్తుఫారం వరకూ చదివింది. ఫోర్తు ఫారం చదువుతున్న రోజుల్లోనే, ఒక రోజు ఇంటికి రాగానే తండ్రితో 'నేనిక స్కూలికి వెళ్ళనండీ,' అంది. ఆయనకి అర్థంకాలేదు 'ఎవరైనా ఏదేనా అంటే చెప్పు. గుండేసి కొట్టేస్తాను.' అన్నారాయన.

శారద మాటాడలేదు. మర్నాడు స్కూలికెళ్ళలేదు. మూడో నాడూ వెళ్ళలేదు. వారం రోజులుపోయేక దశరధ రామ్మూర్తి గారు, 'పోనీ ప్రైవేటుగా మెట్రిక్‌కి కట్టు' అన్నారు. శారద అంగీకరించలేదు. మనుచరిత్రలో నాలుగు పద్యాలూ, మహాభారతంలో నాలుగు పద్యాలూ, కందుకూరివారి వ్యాసం ఒకటి - అందులో మళ్ళీ రెండు పద్యాలు 'అనింపార్టెంటు' ఎందుకొచ్చిన చదువది? ఇదీ సూక్ష్మంగా ఆ పిల్ల అభిప్రాయం. అంతకంటె ఒక క్రమంలో

ఇంట్లో చదువు కోడమే మేలు. అయితే ఆ క్రమం ఏమిటి అంటే అది ఆ అమ్మాయి బుర్రలో ఎప్పటికేది సరి అనిపిస్తే అది. శారద అడిగిన నిఘంటువూ, అమరకోశమూ ఏదడిగితే అది తెచ్చేవారు ఆయన. తనకి తోచినట్టు అర్థం చేసుకొనేది. అర్థం కాకపోతే వూరు కొనేది. కొన్నాళ్ళయేక మళ్ళీ తీసేది. ఆ విధంగా శారద ఆంధ్ర సాహిత్యంతో పరిచయం పృద్ధిచేసుకుంది.

అయినా చలపతీ, అతని తమ్ముడు సుందరం దృష్టిలోమటుకు శారద ఫోర్త్ ఫారం అయినా పాస్ కాలేని మూర్ఖురాలు!

శారదకి పదిహేడేళ్ళు వచ్చేక ఓరోజున దశరథ రామ్మూర్తి గారు 'తాంబూలాలిచ్చి' వచ్చినట్టు చెప్పారు. మరేమీ పై సంబంధం కాదు. చిన్నప్పట్నుంచి అనుకుంటున్న మేనరికమే - సుందరం. ఇహ శారదని విడిగా అడగవలసిన అవుసరమేమిటి? ఇప్పుడుమటుకు చెప్పవలసిన అవుసరం ఉండిగాదు, చెప్పింది. వూరికే యాదాలాపంగా చెప్పారు. చెప్పేక శారద ఏమంటుందో ఆయన ఎదురు చూడలేదు. శారద ఏమీఅనలేదు. మర్నాడు రెండిళ్ళలో ఇరవైనాలుగు గంటలు గడిచేసరికి నలభై ఎనిమిది గంటలుపట్టింది. లేదా ఆ రెండిళ్ళవాళ్ళకి అలాఅనిపించింది. ఒకటి పెళ్ళికొడుకువారిది. రెండోది పెళ్ళికూతురు వారిది. మూడోరోజు తెల్లవారలేదు. ఇంకో గంటకు తెల్లవారుతుం దనగా చలపతి వాళ్ళపక్కింటి కుర్రాడు సైకిల్‌మీద బాణంలా దూసుకుని వచ్చేడు.

చలపతి తండ్రి హఠాత్‌గా గుండెనొప్పివచ్చి కళ్లు మూశారు. విన్నవాళ్ళు, "ఒక్కొక్కరి జన్మ విశేషం, కోడలు గృహప్రవేశం, అత్తగారి అగ్నిప్రవేశం సామెత ఉండనే ఉంది కదా" అన్నారు. ఈ మాటలు శారద పరంగా అన్నవి.

"ఆ ఆస్పత్రి చల్లని ఆస్పత్రి. క్షేమంగా వెళ్ళి లాభంగా వస్తారు - డాక్టర్లు. జబ్బుతో లోపలికి వెళ్ళిన మనిషిమటుకు రెండు

కాళ్ళమీద నడిచి పైకిరావడం చూడలేదు," అని ఆస్పత్రిని దుమ్మెత్తి పోశారు కొందరు. మొత్తంమ్మీద శారదకి కావలసిన మావగారు ప్రపంచపు నాటకరంగంమీద తన పాత్రకి భరత వాక్యం పలికేసి వూరుకున్నారు. అయితే అది ఎట్టి అసమయంలో చేశారో దానివల్ల కలిగే ఫలితాలేమిటి అని ఆయన ఆలోచించినట్టు ఏ విధమైనా దాఖలా లేదు.

పెళ్ళిమాట మళ్ళీ ఎవరూ ఎత్తలేదు. చావింట్లో పెళ్ళి పనికి రాదు. కన్యాదానమైతే 'ఓపఞానికి అలోచించొచ్చు కాని పరిగ్రహ ణం అసలే పనికిరాదు - ఏడాది వరకూ.

శారద ఎట్టి దురదృష్ట జీవో - పుట్టగానే తల్లి పోవడం, చదు వొంటవట్టకపోవడం, తండ్రి కవిగా పైకి రాలేకపోవడం మొదలైన వన్నీ ఈ పెళ్ళి చెడడంతో పైకి వచ్చేయి. ఆ అమ్మాయి నష్టజాత కురాలు అన్నారు. ఏడాది అయేక దశరథ రామ్మూర్తిగారు కబురు పెట్టినప్పుడు చలపతికూడా ఇంచుమించు అదే భాషలో మా టాడి ఆఖరి మాటగా "అమ్మది అదోరకం; నమ్మకాలూ, అవీను. మనం చెప్పలేం" అన్నాడు.

ఆయన - శారద కన్నతండ్రి నిశ్చేష్టుడై నిలబడిపోయారు. ఇందులో ఎవరూ నిందార్హులు కారు. ఆయన వెను తిరిగి వెళ్ళిపో తూంటే చలపతి గేటుదాకా వచ్చి, "ఏమీ అనుకోకండి," అన్నాడు. దశరథ రామ్మూర్తిగారు ఆవేళ ఆలా భంగపడి ఇంటికొస్తూండగా చూసిన ఒక సంస్కృతం మేష్టరు - ఇందుకేగదూ హిమవంతుడు పార్వతిని పరిగ్రహించమని శివుణ్ణి కోరడానికంత సందేహించాడు - అనుకున్నారు. ఆ రోజు ఆయనని పలకరించడానికి శారద భయ పడింది. అ తరవాత వారం రోజులవరకూ ఆయన శారద మొహం చూడలేకపోయారు. ఆ తరవాత పెళ్ళి సంబంధాలు చూశారు.

కట్నం ఎంతిస్తారు? ఏమీలేదు. ఆస్తి అంతా మొత్తం వెయ్యి రూపాయలు అంతే.

పిల్ల చదువుకుందా? లేదు.

చూడ్డానికి చక్కగా ఉంటుంది. కాని ఆడపిల్లని పెళ్ళిచేసుకోడం చూడ్డానికి కాదే!

పనిపాటలు వచ్చు.

కాని పనీపాటలు రానివాళ్ళెవరూ ఈరోజుల్లో.

ఎవరో ఒక పెళ్ళికొడుకువచ్చి, "ఈఅమ్మాయి నేకదూ అప్పుడు సుందరానికి ఇద్దామనుకున్నారు," అనేసి వెళ్ళిపోయాడు. దశరథ రామ్మూర్తిగారికి ఏంచేయాలో తెలీలేదు.

• • • •

"రాజమండ్రి ఎందుకు వెళ్తున్నారు?" అన్నాడు చలపతి మార్చాలనో, ఎదుటి మనిషిని మంచి చేసుకోవాలనో. శారద అవ మానభారంతో కృంగిపోతూ. "ఏమో!" అంది. ఆ ఒక్కమాట, ఆమె వేపు ఒక్క చూపు, చాలు, సగటు మనిషికి - సంగతేమిటో అర్థం చేసుకోడానికి.

ఆయన ఏదో సంబంధం గురించి విచారించడానికి వెళ్తున్నారు.

చలపతికి శారదని ఆ క్షణంలో ఓదార్చాలనిపించింది. "విచా రించి మనసు పాడుచేసుకోకు శారదా! జరిగేవి ఎలాగా జరక్క మానవు." శారద కన్నులలో నీరు సుడులు తిరిగింది. తనపట్ల జరగ కూడనివి జరుగుతున్నాయి! ఆ క్షణంలోనే శారద చప్పున నోరు జారింది. "నాన్నగారు ఇంతక్షోభపడడానికి కారణం, ఉద్యోగంనుంచి రిటైర్ అయినా బాధ వదిలించుకో లేకపోవడానికి కారణం - మీ మూర్ఖత్వం" అంది, ఎటువంటి పరిస్థితుల్లోనూ మాటతూలని శారద.

చలపతికి మొహమ్మీద చురక వేసినట్లయింది. అతను లేచి వెళ్ళి, కూజాలో నీళ్ళు గ్లాసులో పోసుకుని, మళ్ళీవచ్చి కూర్చున్నాడు.

శారద ఈచర్య కనిపెట్టిందో, లేదో ఆమె హృద్గత భావాలేమిటో చెప్పడం కష్టం.

ఏదో తట్టి అక్కడ్నుంచి లేవబోయింది, కాని ఈలోపలే చలపతి అందుకున్నాడు.

"నీకు మీ నాన్నగారిమీద ఎంత గౌరవముందో, నాకు మానాన్న గారిమీద అంత గౌరవమూ ఉంది."

ఉంటే ఆయన ఇచ్చినమాట ఎందుకు నెరవేర్చాలో శారదకి అర్థం కాలేదు.

"మూఢనమ్మకమని నువ్వూ, నేనూ ఇక్కడ కూచుని కొట్టి పారెయ్యొచ్చు. హేళన చెయ్యొచ్చు. కాని తరతరాలుగా వస్తున్న సంప్రదాయాన్ని తోసిరాజనడం - కనీసం మన ముందుతరం వారికి అంత తేలికేం కాదు."

చలపతి ఒక్క క్షణం ఆగాడు.

శారద మాటాడలేదు. లేవాలని రెండోమారు చేసిన ప్రయత్నం కూడా విఫలమైంది. చలపతి మళ్ళీ అందుకున్నాడు.

"పోనీ నేను చేతకానివాడ్ని. అసమర్థుడ్ని. అమ్మ నీకు పరాయిది కాదుకదా! నువ్వే నచ్చచెప్పకూడదూ..."

"ఇప్పుడేవస్తా!" చలపతి మరోమాట అనేలోపల శారద అంతర్ధానమైపోయింది. అతను ఆడిన అవివేకపు మాట' అసందర్భపు సలహా శారదకి వెన్నులో పొడిచినట్టయింది. తనకన్నా విద్యావంతుడూ, అనుభవజ్ఞుడూ, పెద్దవాడూ అయిన చలపతి ఇటువంటి సలహా ఇవ్వగలడని తను అనుకోలేదు. ఇతడంటే తనకి ఒకానొకప్పుడు విపరీతమైన భయం.

"ఇప్పుడేవస్తాన"న్న శారద ఎప్పటికీ రాకపోవడంతో చలపతి వంటింటి గుమ్మంలోకి తనే వచ్చి 'మరినేవస్తా' అన్నాడు . శారద విందో, వినేవూరుకుందో తలెత్తలేదు.

చలపతి తటపటాయించి అన్నాడు, "నీకు అన్యాయం జరిగింది. ఆ విషయం నాకు తెలుసు. కాని అమ్మ ఎప్పుడూ అంటూ ఉంటుంది - పదహారు పళ్ళలో ఒక పల్లు విషం అని. నువ్వు ఏమన్నా నిన్ను క్షోభ పెట్టిన పాపం మమ్మల్ని కట్టి కుడపకమానదు. అంతే నే చెప్పదల్చుకున్నది. వస్తా."

శారద మనసులో మండింది. మొదటిమారు తగిలినప్పుడు కలిగినంత బాధ రెండో మారు తగిలినప్పుడుండదు.

"ఎందుకు బావా ! మిమ్మల్ని, మీ కుటుంబాన్ని దూషించి దుమ్మెత్తిపోసి నేనొల్లుకునేదేముంది?" అంది నిరామయంగా.

చలపతి రెండడుగులు వేసి మళ్ళీ ఆగిపోయాడు. తనొచ్చినపని? "నిన్నొకటి అర్థించడానికి వచ్చేను" అన్నాడు. శారద మాటాడలేదు. "అది నీవల్ల అవుతుంది." అన్నాడు మళ్ళీ.

"సంప్రదాయ విరుద్ధమైనది కాకపోతే..." ఎంత దాచినా మాట మొనవాడకుండా వచ్చింది. సూటిగా తగిలింది.

తీక్షణమైన ఎండదెబ్బ తిన్నవాడి మొహంలా ఉంది చలపతి మొహం. "ఇలాటి మాటలు ఎన్నైనా సహిస్తాను, ఒక్కగాని ఒక్క కొడుకోసం."

"కిష్టుడిమాటా! అంది శారద ఒకింత అక్కజపడుతూ.

"వాడిమాటే". మొదట్నుంచీ వాడెంత తెలివైనవాడో నీకూ తెలుసు. యూనివర్సిటీ ఫస్ట్ వస్తుందని ప్రాణాలు ధారపోసి చదివేడు - మూడేళ్ళూనూ. తీరా పరీక్షల వేళకి ఒళ్ళు చెడి వితుద్రా

అయేదు. ఈ ఏడు నా న్న గా రు పోవడంతో మతి చలించినంత పనైంది. శారద భావరహితమైన మొహంతో కూచుని వింటోంది.

"ఇప్పుడు ఫస్ట్‌క్లాస్ కాదుకదా సెకండ్ క్లాస్‌కి పద్నాలుగు మార్కులు వచ్చేయి. ఈ మాట తెలియగానే వాడు ఏంచేస్తాడో వూహించడానిక్కూడా భయంగా ఉంది." చలపతి దీనాతి దీనంగా అన్నాడీమాట.

"శారదకి అతని అర్థం బోధపడింది. కాని ఒకనాడు పొరుగింటిలో ఉండి ఆయన అభిమానానికి పాత్రురాలయిన తను-ఆ అభిమానాన్ని ఇలా మార్కులు అడిగి ఖర్చు రాయించవచ్చునా? ఇది తగిన పనేనా? ఈ పని తనవల్ల అయేమాట నిజమే. కాని హేయంగా లేదూ? "తరతరాలుగా వస్తున్న సంప్రదాయం కాదేమో కాని నీతి దూరమైన పనిగాలేదూ?"

చలపతికీమారు కోపమే వచ్చింది. ముక్కూ మొహం తెలీని పరాయివాడెవడో 'నీ కొడుకు ధీశక్తి గూర్చి నాకేంతెలుసు' అన్నట్టు మాట్లాడుతూంది మేనత్త కూతురు. అక్కడికీ తమాయించుకుని అన్నాడు "నేనేమీ కోరరాని కోరిక కోరడంలేదు. ఎంతో మందికి తగినవారు అని తోస్తే మార్కులుకలిపి క్లాస్ ఇవ్వడం నాకు తెలుసు." "అయితే ఇహ నేనెందుకు కలగజేసుకోవడం," - అంది శారద - నీ కొడుకు తగినవాడని తోస్తే నీకొడుక్కీ ఇస్తారు అన్న భావం వ్యక్తం చేస్తూ.

చలపతి ఆసంభాషణ పూర్తయినట్టు గ్రహించాడు. 'ది ఎండ్' అన్నట్టుంది ఆ స్వరం. 'వస్తా'నని చెప్పడంకూడా వెక్కిరించినట్టుంటుంది. ఇప్పటికి మూడు మార్లు చెప్పాడామాట. "నా జీవితంలో నేనెవర్నీ ఏదీ అడగలేదు - నోరువిప్పి. చిన్నదానివైనా నీచేత పడ్డట్టు ఇన్నిమాటలు ఎవరిచేతా పడలేదు. నువ్వింందాకా చెప్పావుకదూ,

మిమ్మల్ని శోభ పెట్టామని. అది అనుభవంలోకి రావడానికి ఇంతకన్నా మరేమీ ఉందనుకోను. నువ్వు మాకేమీసాయంచెయ్యక్కర్లేదు మనం ఇహం కష్టలు సాధించుకోడానికికూడా ఏమీలేదు. అదే నయం." అనేసి చరచర వెళ్ళిపోయాడు చలపతి. శారద రాత్రి వంట ప్రారంభించే సరికి ఏడయింది. శారద నిప్పు చేస్తుండగా దశరథరామ్మూర్తిగారు వచ్చేరు.

"మీకోసం చలపతి వావొచ్చాడు" అంది శారద.

"ఎందుకు?" అన్నారాయన. ఈ మధ్య ఆ రెండిళ్ళకీ మధ్య రాకపోకలులేవు.

'ఏమో' అంది కుంపట్లో చింత బొగ్గులు చిటపట్లాడుతుంటే వెనక్కు జరుగుతూ.

మర్నాడు సుందరం రోడ్డుమీద కనిపించినప్పుడు ఆయనేఅడిగారు చలపతి ఏదేనా పనిమీద వచ్చేడా? అని.

సుందరానికి అర్థంకాలేదు. శారదే చెప్పి ఉండవచ్చుకదా!

'ఏమీ పనిమీద వచ్చేడనుకోను' అన్నాడు సుందరం.

పదిరోజులయింది. సుందరానికీ, డిప్యూటీకలెక్టరుగా రమ్మాయి జానకికీ పెళ్ళి నిశ్చయమైనట్టే అందరూ ధృవపర్చుకున్నారు. ఆవేళ ఫెళ్ళున కాస్తున్న ఎండ ఒక్క మారుగా ఉరిమింది. అరె! చినుకులు పడుతున్నట్టున్నాయే అనుకునేలోపల వాన హోరున కురవసాగింది. జల్లు విసిరి కొడుతూంది. వస్త్రాదుల్లాటి మనుషులు వెనక్కి కొట్టుకుపోయేట్టున్నారు.

తండ్రి వీధిలోంచి ఇంకా రాలేదని భయపడుతూ శారద కిటికీ దగ్గర నిలబడింది. వరండాలో మనిషి అలికిడి అయి, 'ఎవరు?' అంది అనుమానంగా. వరండాలోవ్యక్తి క్షణం ఆలోచించి 'నేను' అన్నాడు.

శారద క్షణం సందిగ్ధంగావూరుకుని 'నువ్వా'అంది తలుపుతీస్తూ.

సుందరం వజవజ వణుకుతూ లోపలికి వచ్చాడు. పూర్తిగా తడిసిపోయాడు. శారద లోపట్నుంచి తువాలూ, లుంగీ తెచ్చి ఇచ్చింది. మళ్ళీ లోపలికి వెళ్ళి ఫ్లాస్కులో ఉన్న కాఫీ గ్లాసులోపోసి తీసుకొచ్చింది.

'మామయ్యలేరా?' అనడిగాడు సుందరం-అంతవరకూ తామి ద్దరిలోనూ ఏ ఒక్కరూ మాటాడలేదని జ్ఞాపకం తెచ్చుకుని.

'లేరు. ఎక్కడ చిక్కుపడిపోయారో - ఈ వానలో. రెండు రోజుల్నుంచి వంట్లోకూడా బాగుండడంలేదు' అంది శారద స్త్రీ సహజ మైన భయంతో.

అదన్నమాట మొహం వాడినట్టుండడానికి కారణం అనుకు న్నాడు. మళ్ళీ ఏంమాటాడాలో తెలీలేదు అతనికి. శారదకి అక్కడ ఉంటే బాగుంటుందో లోపలికి వెళ్ళిపోతే బాగుంటుందో తెలీలేదు.

'కిష్టుడికి క్లాస్ వచ్చింది - నీ ధర్మమా అని' అన్నాడు సుంద రం, కృతజ్ఞతాభావం వెల్లివిరియగా.

'నాదేముంది. విధినిర్ణయం అలాఉంది కాబోలు' అంది శారద.

సుందరానికి హఠాత్‌గా తాను శారదపట్ల అన్యాయంగా ప్రవ ర్తించానని, ఐనప్పటికీ సాక్షాత్తు భూదేవివంటి ఓరిమిగల శారద తమని మన్నించి, పైపెచ్చు వుపకారంచేసి తన హృదయ వైశాల్యాన్ని వ్యక్తీకరించిందనీ తట్టింది. ఆమాటే వెంటనే శారదతోచెప్పి, క్షమించ మని వేడుకుని జారిపోబోతున్న ఈ మాణిక్యాన్ని చేజిక్కించుకుంటే బాగుంటుందనుకున్నాడు. కాని ఈమాటలు చెప్పడం ఎలా ?

'మామయ్య రాజమండ్రి వెళ్ళి వచ్చేరు కాబోలు' అన్నాడు ప్రస్తావనగా.

శారద తనక్కడ్నుంచీ వెళ్ళిపోవడమే ఉత్తమమనే నిర్ణ

యానికొచ్చింది. 'ఆఁ వచ్చేరు' అనే ఒకే విరుపుమాటలో సమాధానం చెప్పేసి, లోపలికివెళ్ళిపోయింది. సుందరం వంటింటివేపు నడవడమా, వీధివేపు నడవడమా అన్న డైలమాలో క్షణం ఉండి, వంటింటివేపు రెండడుగులువేసి, 'నేవెళ్తున్నా 'అన్నాడు.

'ఆఁ' అంది శారద

'ఒకమాట. పొరపడి నిన్నేదో అన్నమాట నిజమే. నువ్వే ఆలోచించు' అన్నాడు.

శారద నిరసనగానవ్వింది.ఆ పెదిమవిరుపులోఎన్నిఅర్థాలయినా తీసుకోవచ్చు, "ఒకమారు ఒప్పుకున్నావు కాని ఎన్నిమార్లు ఒప్పుకుంటావు - విద్యాగంధంలేని పశువుని అని అనొచ్చు. ఇంత నిలకడ లేని మనిషివా అన్న అర్థం ఉండొచ్చు. ఏదైతేనేం శారద పెదిమ కదల్చకుండానే సుందరం అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు - మంచికో, చెడుకో...

♦ ♦ ♦ ♦

'సుందరం ఏమిటి? డిప్యూటీ కలెక్టరుగా రమ్మాయిని చేసుకోనంటున్నాడట?' ఎవరో దశరథ రామ్మూర్తిగారిని అడిగారు.

"ఆహా" అన్నారాయన.

"అలా 'ఆహా' అంటావేమిటోయ్, చుక్కల్లోకి చూస్తూను. మన శారదనే తప్ప ఇంకెవర్నీ చేపట్టనని శపథం పట్టేడని వూరు గగ్గోలెత్తుంటేనూ!" అన్నాడా శ్రేయోభిలాషి.

నిజానికి జరిగిన కథ ఇది. సుందరం ఆవేళ ఆ వానరాత్రి శారదని చూశాక తాను పొరబడ్డానని, ఆ పొరపాటు దిద్దుకోవాలనీ గట్టిగా రూఢిచేసుకున్నాడు. ఆపైన ఇంటికి వెళ్ళేక జానకిని చేసుకోననీ, శారదని చేసుకుంటాననీ, వివరాలు అడగవద్దనీ ఒకే వాక్యంలో చెప్పి వూరుకున్నాడు. చలపతి కసిరిచూసినా లాభం కనిపించలేదు

పోగా చలపతి ఏమొహంతో మామయ్యగారింటికి వెళ్ళడమా అని ఆలో చిస్తుండగానే పూరివారే పూనుకుని ఈవార్త ఆయనదగ్గరికి మోశారు.

దశరథ రామ్మూర్తిగారు ఈవార్త విని పూరుకున్నారు తర వాత శారదతో అని చూశారు, "చూశావా? సుందరం చేసిన పొర పాటు దిద్దుకోవాలనుకుంటున్నాడట."

"కలెక్టరుగారూ వాళ్ళూ తాంబూలాలు కూడా ఇచ్చు కున్నారు." అంది శారద, తండ్రికి తన అభిప్రాయం సూటిగా చెప్ప లేక. తండ్రి మొహంలోకి సూటిగా చెప్పలేకపోతూంది. తననుంచి ఆయన ఎట్టి మనస్తాపానికి గురిఅవుతున్నారో చూస్తోన్నా తనేమీ చేయలేకపోతూంది. ఏం జన్మ? అనిపిస్తూంది.

"తాంబూలాలకేమిటి? మనం ఇచ్చిన తాంబూలాలు పుచ్చు కున్నారు, వేసుకున్నారు." హేళనగా నవ్వేరు ఆయన.

ఈయనకి మతిగాని పోతుందేమో! శారద రివటాకులా కం పించింది.

"నన్నోడి తన్నోడెనా? తన్నోడి నన్నోడెనా? అని ద్రౌపది ప్రశ్నించిందట."

"కాఫీ తీసుకొస్తా నుండండి." అంది శారద లోపలికి వెళ్తూ.

దశరథ రామ్మూర్తిగారు, తన మనోవేదనకి కారణమైన కూతురు ఎదుట్నుంచి తొలగిపోగానే, తన కలవాటయిన భగవద్గీతా పఠనంలో మునిగిపోయారు.

ఆయనకి మరి కాఫీ రానేలేదు.

అదేరోజు మునిమాపువేళ అప్పలమ్మ కొడుకు సుందరం చేతిలో చిన్న చీటీ పెట్టి వెళ్ళిపోయాడు.

"పొరపాటు దిద్దుకుంటానంటూ అదే పొరపాటు చేయడం తెలివైన పనికాదని నాకు తోస్తోంది. ఇంతదాకా రావడమే పొర పాటు. జానకిని క్షమాపణ వేడుకోడం సమంజసం."

సుందరానికి ఈ బులెటిన్ ఎవరు పంపేరో అర్థం అయింది. అతను నిర్ఘాంతపోయాడు.

• • • •

సుందరానికీ జానకికీ అట్టహాసంగా పెళ్ళి అయింది. పెళ్ళికి దశరథరామ్మూర్తిగారినీ, శారదనీ రమ్మని నొక్కి నొక్కి చెప్పారు, చలపతి దంపతులు.

వూరునుంచి వూరికి వెళ్ళడంకనక పెళ్ళికి వెళ్ళలేదు కానీ, మగపెళ్ళివారింట్లో గృహప్రవేశానికీ, సత్యనారాయణ వ్రతానికీ వెళ్ళి, పెళ్ళికొడుక్కి కట్నం చదివించి వచ్చారు. ఆర్భాటం, హోరు గాలీ అంతా ముగిశాక పెళ్ళికొడుకు పీలుచిక్కగానే పెళ్ళికూతుర్ని అడిగిన మొదటి ప్రశ్న:

'అయితే నీకు శారదని ఎలా తెలుసు?' అని.

దీనికి వధువు జవాబు అయోమయపు చూపులు.

'శారదెవరూ?' అంది.

'తెలీదన్నమాట'అని ఆశ్చర్యపడి, 'ఎందుకలా అడిగానా?'అని విచారపడి సుందరం నాలిక్కొరుక్కున్నాడు.

'అదే తెనాలిలో సర్వర్‌గా పనిచేస్తూ చచ్చిపోయాడే, నటరాజన్,' అనేసి, మరే ప్రశ్నకి సైమివ్వకుండా,

'మీకు ఇంటర్మీడియేట్‌లో ఏ డ్రామా ఉండేది'? అని అడిగాడు.

• • • •

"ఒకసారి పత్నీ సమేతుడవై మాయింటికిరా" అని శారద సుందరాన్ని ఎప్పుడూ ఆహ్వానించలేదు.

"ఇదీ జరిగిన సంగతి. ఈమే శారద."అని సుందరం ఎప్పుడూ జానకికి చెప్పలేదు.

తన చుట్టూ రోజూ కనిపిస్తున్న వందలాది ప్రజల్లో "శారద" ఎవరో, సుందరం అడిగిన కారణం ఏమిటో జానకి తెలుసుకోలేదు. ●

# అంతంలేని పంతం

మందరపు పద్మ, లలిత

"చూడండీ! మొన్న ప్రక్కింటావిడ పేరంటానికి కట్టుకొచ్చిందండీ చక్కటి జరీ చీర! కెంపులాంటి ఎఱ్ఱటి రంగు! దానిమీద జరీ కళ్లు చెదిరేట్టు ఎలా మెరుస్తున్నదనుకున్నారూ? అట్టే ఖరీదు కూడా లేదండీ! పాతిక రూపాయలేనట! నా కలాంటిది ఒకటి కొనియ్యరూ?" మెల్లగా గోముగా జంకుతూ అడిగింది వనజ.

సురేష్ వనజకేసి తీవ్రంగా చూశాడు. "మీ ఆడవాళ్ళకు ఎంతసేపూ ఇదే పని! ఆ అచ్చమ్మ మంచి చీర కట్టుకుని రావడం భయం ఈ పిచ్చమ్మ కొత్తనగ వేసుకోవటం భయం మా మొగవాళ్లమీదికి వచ్చి విఱుచుకు పడతారు మొగవాళ్లను వేధించటం తప్ప మీకేం పనిలేదు! పాతిక రూపాయలు నీ కంటికి మహా చవగ్గా కన్పిస్తున్నాయి కాబోలు, నా దగ్గఱ ఇప్పుడు కానీకూడా లేదు-నేనిప్పట్లో ఏ చీరా కొనను, కొనదలుచుకోలేదు!" అని సిగరెట్టునుసి దులుపుతూ సురేష్ ఖచ్చితంగా చెప్పాడు.

వనజ చిన్నబోయింది అభిమానంతో, రోషంతో కళ్లంట నీళ్లు తిరిగాయి. తనేమంత పట్టుచీరలు కొనమన్నదని? వందలుపెట్టి కొనమన్నదా, వేలు పెట్టి కొనమన్నదా విసుక్కోటానికి? అడుగులకు మడుగులొత్తుతున్నా, మగవాళ్ళు అధికారం చెలాయించి, ఈసడించి కొడుతూనే వుంటారు! తన సరదాలను తీర్చమని భర్తను కాకపోతే మరెవరినడుగుతుంది? వాళ్ళకిష్టమైన వాటి కన్నిటికి బాగానే ఖర్చు పెట్టుకుంటారు! ఇవతలవాళ్లక్కూడా వాళ్లలానే సరదాలుంటాయని ఎందుకనుకోరో మరి! ఆర్థిక స్వాతంత్ర్యం లేకపోబట్టేగా ఆడదానికిన్ని తిప్పలూ, మొగవాళ్లు కసిరికొట్టటమూనూ – ప్రతి చిన్న విషయానికి చేతులు సాచవలసి రావటంవల్లనేగా మగవాళ్ళ కింత అలుసు! చదువుకుని ఉద్యోగం చేసుకుంటే బాగుండిపోను!

వనజ కళ్ళంట నీళ్ళు పెట్టుకుంటూ గిరుక్కున ఇంట్లోకి వెళ్ళిపోయింది. మంచంమీద బోర్లాపడుకుని మనస్సుకు శాంతి లభించేంత వరకూ కన్నీళ్ళు కార్చింది. వ్యథాపూరితమైన మనస్సుతో అలా ఎంతసేపు ఏడుస్తూ పడుకుందో! అత్తగారి కేకవిని వనజ త్రుళ్ళిపడి లేచింది.

"బాగుందమ్మా! ఇలా నువ్విక్కడ మంచం ఎక్కి కూర్చుంటే అవతల వంటంతా ఎవరుచేస్తారనుకున్నావు తల్లీ? నాజూకులు మా యింటి దగ్గర పనికిరావమ్మా లే లే!"

వనజ మనసు తిరుగుబాటు చేసింది. మాట్లాడకుండా లేచి తన పెట్టె గబగబా సర్దుకుని వీధిగుమ్మంలోకి వెళ్ళి రిక్షాను పిలిచింది. అత్తగారు తెల్లబోయి చూస్తూ నించుంది కాస్సేపటికి తెప్పరిల్లి "అబ్బాయి! చూశావురా, కోడలు ఎంతవరకు తెగించిందో!" అంది. సురేష్ తన గదిలోంచి బయటికొచ్చాడు. వనజ ప్రయాణ సన్నాహం చూసి విస్మితుడయ్యాడు. "ఇప్పుడు నేనేం అన్నానని ఆగ్రహంతో పుట్టింటికి వెళ్ళాలని చూస్తున్నావు వనజా!" అందా మనుకున్నాడు కాని, అంతట్లోనే అభిమానం ముంచుకొచ్చింది! ఈ ఆడవాళ్ళు సామాన్యులా? కనికరిస్తే కంట్లో వేళ్ళు బెడదామని చూస్తారు.

"వెళితే వెళ్ళనియ్యమ్మా! ఆవిడ ఇక్కడవుండి మనల్నేం ఉద్ధరించాలిగనుక!" అంటూ గిరుక్కునతిరిగి తన గదిలోకి వెళ్ళిపోయాడు.

వనజ పుబికివస్తున్న కళ్ళనీళ్ళ నాపుకుంటూ వెళ్ళి రిక్షాలో కూర్చున్నది. రైల్లో ప్రయాణం చేస్తున్నంతసేపూ సురేష్ మాటలు జ్ఞాపకం వచ్చి వనజకు గుండెల్లో సూదులు పొడుస్తున్నట్టనిపించింది.

ఇంటికివెళ్ళాక వనజ తండ్రినిచూసి బావురుమని ఏడ్చింది. "నాతోటి వాళ్ళంతా చక్కగా చదువుకుని సుఖపడుతుంటే పథ్నాలు

గేళ్లకే ఏం కొంపమునుంచుకు పోయిందని పెళ్ళిచేశావు నాన్నా? ఈ మూండేళ్ల కాపురంలో నేను సుఖపడ్డదేంలేదు. అత్తగారి దెప్పులూ, అయ్యగారి ఆగ్రహం తప్ప మరేం లేదు నాన్నా!" అంది.

భూషణం వనజ ఏకరువుపెట్టిన కష్టాలన్నిటిని ఆత్రుతగా విన్నాడు. కోపంతో కళ్లు ఎర్రగా చింతనిప్పుల్లా అయిపోయాయి. "ఏమిటీ! నీచేత యింటెడు చాకిరీ చేయిస్తూ పైగా నిన్ను నానా మాటలూ అంటున్నారా? ఇంత డబ్బు ముఖానపోసి వాడికంట గట్టిన దెందుకూ, ఒక చీరా కొనక, ఒకనగా చేయించక పోయాక! బుద్ధి గడ్డితిని నీకు పెళ్ళిచేసానమ్మా! యిప్పటికైనా మించిపోయింది లేదు! నువ్వు ఎంతవరకు చదువుకుంటానంటే అంతవరకూ చెప్పిస్తా, ఆదరిద్రుడి ముఖం మాత్రం చూడకు!" అన్నాడు.

వనజ కలకబారిన మనస్సుతో చాలాసేపు ఆ విషయమే ఆలోచించుకుంటూ కూర్చున్నది.

◆ ◆ ◆ ◆

రోజులు గడుస్తున్నకొద్దీ వనజ ఆగ్రహం మెల్లమెల్లగా చల్లారుతూ వచ్చింది. ఏ క్షణంలోనైనా సురేష్ తనను తీసుకెళ్ళటానికి వస్తాడేమోనని వళ్లంతా కళ్ళుచేసుకుని చూడసాగింది. కానీ... లొంగినకొద్దీ మొత్తుతూనే వుంటారు మొగవాళ్లు! తను బింకంగా ఉండకపోతే లాభంలేదు మరి! వనజ మనస్సు మాత్రం సురేష్‌కోసం తహతహలాడసాగింది. "ఏమోపాపం! నిజంగానే చేతిలో డబ్బు లేదేమో; వుంటే ఎందుకు కొనివ్వరూ?" అనుకుంది ప్రేమగా! తనను నవ్విస్తూ కవ్విస్తూ ఎంత సరదాగా ఉండేవాడు! మళ్ళా సురేష్ దగ్గరకు వెళ్లగలిగితే బాగుండును! ఆ తీయని వాక్కులకోసం తన మనస్సు పలవరిస్తున్నది - అయినా అంతలోనే అభిమానం అడ్డుతగిలింది! ఇన్నాళ్ళై పుట్టింటిలోవున్నా ఒకసారైనా వచ్చాడా?

తనేమంత అనరాని మాటలు అనేసిందని అంతకోపం రావటానికిం తనను వచ్చి తీసుకెళితే అతని సొమ్మేంపోయింది? తనతో అతనికంత! అవసరంలేనప్పుడు తనెందుకు 'నువ్వు తప్ప నాకు గతిలేదు' అంటూ పరుగెత్తుకుని అక్కడికి పోవాలీ అని రోషం తెచ్చుకుని వూరుకుంది.

సురేష్‌కూడా వనజమీదికి మనస్సు పోసాగింది. "పాపం! మన స్సుండబట్టలేక కావాలని నోరుతెరిచి అడిగితే కశిరేశాను. ఇంకెప్పు డైనా కొంటానని మెల్లిగా చెప్పాల్సింది!" అనుకున్నాడు జాలిగా పశ్చాత్తాపంతో.

వనజలేనిదే ఏం తోచటంలేదు, వెళ్ళి తీసుకొస్తే బాగుండును!" అనుకుని మళ్లాఅంతలోనే "ఆడదానికేఅంత తలబిరుసుగావుంటే డబ్బు గడించే మొగవాడిని నా కెంత వుండాలి?"అని బిగిసి కూర్చున్నాడు. పుట్టింటికి వెళ్ళింది వెళ్ళినట్టు తిరిగిరాలేదూ ? తను అక్కడ దిగబెట్టాడు గనుకనా, మళ్ళీ వచ్చి తీసుకురావటానికి? ఆవిడ అలకలు తీర్చి, భుజాన్నెక్కించుకొని తీసుకొచ్చేంత అవసరం తనకేంలేదు. వచ్చి నప్పుడే వస్తుంది. రాకపోతే అక్కడే వుంటుంది! "నా అవసరం ఆవిడకు లేనప్పుడు ఆవిడతోనేనా నా కవసరం?" అంటూ కోపంతో బింకంగా కూర్చున్నాడు సురేష్.

రోజులు గడుస్తున్నకొద్దీ ఇద్దరికీ కోపంఎంత చల్లారుతున్నదో పట్టుదలా అంత పెరుగుతున్నది. సురేష్‌ను తల్లి అప్పుడప్పుడు మంద లిస్తూనే ఉన్నది. "పోయి కోడల్ని తీసుకురారా? ఎన్నాళ్లు దాన్ని అక్కడే ఆట్టేపెడతావ్? మొగుడూ పెళ్ళాలన్న తర్వాత పోట్లాటలు రాకుండా పోతాయా? మెల్లగా సర్దేసుకునిపోవాలిగాని ఇలా కాపు రాలు మానుకుంటారటరా ? ముసలిదాన్నయిపోయానా, ఇంటి పనంతా ఎన్నాళ్ళని నేను సవరించుకుని రాగలనురా? కోడలుమీద భారంవేసి హాయిగా రామా, కృష్ణా అంటూ కూర్చోపలసినదాన్ని!"

కాని సురేష్ తన పంతం మానలేదు. ఈ పంతాల మధ్యా, పౌరుషాల మధ్యా ఒక ఏడాది యిట్టే గడిచిపోయింది. ఇరుపక్షాల నుంచీ సంధి ప్రయత్నాలేం జరుగలేదు!

వనజ మనస్సు రాయిచేసుకుని చదువులో పడ్డది. ఉన్నట్టుండి హఠాత్‌గా ఒకరోజు సురేష్ తల్లి బండిలోంచి దిగింది. వనజ తండ్రి భూషణం ఆవిడను చూసి ముఖం ముడుచుకున్నాడు. వనజ మనస్సులో మాత్రం చిన్న ఆశారేఖ మెరిసింది! సురేష్ తల్లి నవ్వుతూ "బాగున్నావా అమ్మా వనజా" అంటూ పలకరించి దగ్గరకొచ్చి కూర్చున్నది. "నిన్ను తీసుకెళ్ళాలని వచ్చానమ్మా!" అంది వనజను పరికించిచూస్తూ. వనజ మాట్లాడే అవకాశం యివ్వకుండానే భూషణం ''అమ్మాయిని తీసుకెళ్ళటానికి నువ్వు వస్తావటమ్మా? అమ్మాయి మీద అంత అభిమానం ఏడిస్తే మీ అబ్బాయే వచ్చునుగా? సుఖంగా వున్నదాన్ని ఆ నరకంలోకి ఈడ్చుకెళ్లాలనా మీ తాపత్రయం? ఆలనా పాలనాలేని కొంపలో అదేం సుఖపడుతుంది? నా యింట్లోనే వుంటుంది - నాతోనే తింటుంది'' అన్నాడు దురుసుగా.

సురేష్ తల్లి తెల్లబోతూ "పెద్దవారు మీరుకూడా అలా అంటే ఎలా అన్నయ్యగారూ? చిన్న వాళ్ళు పట్టుదలకూ పంతాలకూ, పోయికూర్చుంటే, పెద్దవాళ్లు మనం వాళ్ళకు సర్దిచెప్పి కాపురం నిలబెట్టాలంటారా, లేదంటారా?" అంది.

''ఇంతకీ నేను కాపురం చెడగొట్టేవాడినీ, మీరు నిలబెట్టేవారూనా? సురేష్‌నేవచ్చి తీసుకెళ్ళమనండి! ఆ పంతం ఏమిటో నేను చూస్తాను! వాడు వస్తేనేగాని అమ్మాయిని పంపేదిలేదు!" అన్నాడు ఖచ్చితంగా.

సురేష్ తల్లి చాపమీదనుంచి లేస్తూ ''వనజా నీకు కాపురం నిలబెట్టుకోవాలంటే పంతానికి పోకుండా నీ అంతట నీవైనా వచ్చేయమ్మా'' అంది.

భూషణం మండిపడ్డాడు "బాగా నూరిపొయ్యాండి! దాని జీవితాన్ని సరిదిద్దే వాడిని నేనుండగా మీరెందుకు మధ్యలో కలుగజేసుకోవటం?" అని వనజవేపు తిరిగి వనజా! అగడప త్రొక్కావా మళ్లీ జన్మలో నా ముఖం చూసేదిలేదు!" అన్నాడు.

వనజ అత్తగారితోపాటు వెళ్ళిపోవాలనేఅనుకుంది. అయినా ఆగ్రహంతో మండిపడుతున్న తండ్రి ముఖం చూసి అంతపని చేయటానికి సాహసించలేకపోయింది.

తర్వాత కొన్నాళ్ళుగడిచాక తండ్రితో మెల్లిగా ఆ విషయం కదిపింది.

"నీ చదువు మధ్యలో పాడుచేయటానికమ్మా ఈ ఎత్తంతా! అటు నిన్ను చదువుకూ కాకుండా, ఇటు కాపురానికీ కాకుండా చేయ లని వాళ్ళ సంకల్పం! నామాట విని వాడిపేరెత్తక చక్కగా చదువు పూర్తిచేసుకో! ఏదో ఒకటి నిశ్చయం చేసుకో. అక్కడికి వెళ్ళావా ఎలాగోలా నీ కాపురం నీవే చక్కబెట్టుకుని అక్కడ పడుండు. లేదా హాయిగా చదువు చెప్పిస్తాను, వుద్యోగం చేసుకో! ఆ దరిద్రుడి పేరెత్తితేనే నాకు వళ్ళు మండుతున్నది. ఏడాదై పుట్టింటిలో వుంటే ఒకసారైనా చచ్చిందీ, బ్రతికిందీ కనుక్కున్నాడా? అలాంటి వాడింటికిపోయి ఏం సుఖపడతావు చెప్పు" అని భూషణం వనజతో అన్నాడు - నచ్చజెప్పే ధోరణిలో.

వనజ తండ్రిమాట కాదని తెగించి సురేష్ దగ్గఱ కెళ్ళటానికి జంకింది. ఇదమిద్ధంగా ఏదీ తేల్చుకోలేక గాఢంగా నిట్టూర్చింది. ఆ క్షణంలో సురేష్ దగ్గఱకు పరుగెత్తుకునిపోయి అతని పాదాలకు ప్రణమిల్లితే బాగుండుననిపించింది వనజకు. తండ్రికి అసలే పట్టుదల! తను ఈ ఊబిలోనుంచి ఎప్పటికీ బయట పడలేకపోతేనో?

♦ ♦ ♦ ♦

సురేష్ మామగారింటిలో తల్లికి జరిగిన గౌరవ మర్యాదల గురించి విన్నాడు. ఆడపిల్లనుకన్న అభాగ్యుడికే అంత పట్టుదలైతే తనేనా తక్కువవాడు? వనజను తను స్వయంగా ఎందుకు తీసుకు రావాలి? తప్పుచేసివుంటే క్షమార్పణ కోరినా అందం! డబ్బుంటే మాత్రం అంత అహంకారమా? తన కూతుర్ని తను దిగబెట్టి వెళ్ళ లేఢా? పొరపాటున చేసుకున్నాడీ సంబంధం!

సురేష్‌కు ఆలోచిస్తున్నకొద్దీ వనజ తండ్రిమీదా తత్ఫలితంగా వనజమీదా బాగా ద్వేషం పెరిగిపోయింది. చివరకు ఆద్వేషం వనజ మీద కూడా విడాకులకోసం దావా వేయటంవరకూ వచ్చింది. వనజ ఈ సంగతి విని చాలా గాబరా పడింది. ఏడుస్తూ మూటాముల్లె కట్టుకుని ప్రయాణానికి సిద్ధమయ్యింది. రిక్షా బయల్దేరే సమయంలో భూషణంకూడా వనజతో ప్రయాణం అయ్యాడు. వనజను బుజ్జగిస్తూ విడాకులిస్తే పీడా వదిలిందనుకోమ్మా! నీకేం భయంలేదు! నీకు ఇంకో పెళ్ళిచేస్తాను చూస్తూండు" అన్నాడు.

వనజ అదిరిపడి చూసిందేతప్ప ఏమనలేకపోయింది. ఇంటికి పోదాం పదమ్మా! వాడికసలే నీమీదకోపం! నువ్వు ఇప్పుడు అక్కడకు వెళ్ళావంటే పీకపిసికి చంపుతాడుకూడా! మరేం భయం లేదమ్మా! నీజీవితాన్ని సరియైన దారిలో నేను పెడతానుకదా తల్లీ! అంటూ సముదాయించాడు.

రిక్షా వెనక్కు మళ్ళింది. వనజ ఏదోమాట్లాడాలని గింజుకుంది. కాని ఒక్కమాటా పెదిమలు దాటిరాలేదు. కన్నీరు కారుస్తూ నిరాశగా, నిస్పృహగా రిక్షాకు నీరసంగా జారగిలబడింది వనజ.

• • • • •

వనజ ఎం. బి. బి. యస్. పూర్తిచేసింది. తండ్రి భూషణం వనజ దగ్గరే వుంటున్నాడు. వనజకు మళ్ళా పెళ్ళిచేసుకోవాలనే

వుద్దేశ్యం వుందో, లేదో కాని తండ్రి మాత్రం వనజకు మళ్ళా పెళ్ళి చెయ్యాలని శతవిధాలా ప్రయత్నం చేస్తున్నాడు. భూషణం ఎక్కని గుమ్మంలేకుండా పోయింది. ఎక్కడ చూసినా నిరాశే ఎదురౌతున్నది గానీ ఫలితం లేకపోతున్నది. ఆడపిల్లకు పెళ్ళి చేయటమే బ్రహ్మాండం! అందులో రెండో పెళ్ళి, మూడు నాలుగేళ్ళు కాపురం చేసినదానిని పెళ్ళి చేసుకునేంత ఉదారులు విదేశాల్లో తప్ప మన దేశాల్లో లేరేమో!

ఎవరో ఇంజనీర్ గారికి పెళ్ళికుమార్తెకోసం గాలిస్తున్నారు! వాళ్ళది ఆదర్శ కుటుంబమని పేరు. ఇంజనీర్ అన్నగారు వితంతు వివాహం చేసుకున్నారు. భూషణం ఆశతో వాళ్ళింటికి వెళ్ళాడు. ఆ ఇంజనీర్ గారి తండ్రి భూషణం సంగతి ఇదివరకే విన్నాడు. విడాకులు జరిగిన తర్వాత భూషణం పేరు నలుగురి నోట్లోకి బాగా ప్రాకిపోయింది. కూతురు కాపురం చేజేతులా చెడగొట్టాడని నలుగురూ నానామాటలు ఆడారు. అయినా భూషణం లోకానికేం వెఱువలేదు!

ఇంజనీర్ తండ్రి సంగతంతా విని "బాబూ! అయితే వారికి విడాకులిచ్చినట్టే మాకుమాత్రం మీరు విడాకులివ్వరని ఏం నమ్మకం? మీతో పేచీలు పడటానికి మాకేం ఓపిక లేదండి?" అన్నాడు.

దాంతో భూషణం తలవంచుకుని బైటికి చక్కగా వచ్చేశాడు. ఈ సంగతి చూచాయగా తెలిసి వనజ కంటికీ, మంటికీ ఏకధారగా ఏడ్చింది. అనుకోకుండా ఎంత పొరబాటు పనిచేసింది తనూ ?

ఇంకో పెళ్ళికొడుకు "రెండో పెళ్ళంటున్నారు కదా! పది వేలు కట్నమైనా ఇవ్వరా?" అనడిగాడు.

వనజ మనస్సులో ఎంతో బాధపడింది. ఆడదాని బ్రతుకెంత నికృష్టం.

కల్పన...

వనజకు లేడీ డాక్టరుగా వైజాగ్‌లో పోస్టింగు వచ్చింది. ఉన్నది ఇద్దరే కాబట్టి, తోడుకోసం ఒకరి ఇంట్లో భాగం అద్దెకు తీసుకున్నది. ఆ ఇల్లుగలావిడ శకుంతల చాలా మంచి మనిషి. వనజతో ఆప్యాయంగా మనసువిప్పి మాట్లాడుతుంది. వనజ శకుంతలతో మాట్లాడుతుంటే మనసులోని బరువూ, వేదనా తగ్గినట్టు వుంటుంది. తీరిక చిక్కినప్పుడల్లా శకుంతల వనజ దగ్గఱకెళ్ళి ఏవేవో మనస్సు కుల్లాసం కలిగించే కబుర్లు చెబుతూవుంటుంది.

ఒక రోజు వనజ డ్రాయింగ్ రూమ్‌లో కూర్చుని ఇద్దరూ మాట్లాడుకుంటున్నారు. ఇంతలో చెప్పుల సవ్వడి వినిపించి వనజ తలెత్తి చూసింది. "ఇక్కడున్నావా శకుంతలక్కా?" అంటూ నవ్వుతూ ఓ అందమైన ఆవిడ పాపాయినెత్తుకుని లోపలికి కాలు పెట్టింది

శకుంతల "రా, రా! మంచి సమయానికే వచ్చావు సరోజా! నీకిన్నాళ్ళనుంచీ వీరిని పరిచయం చేయాలంటే ఎప్పుడూ తటస్థపడనే లేదు. వీరే సరోజా, డాక్టర్ వనజాదేవి!" అంది.

సరోజా ఆప్యాయంగా చిరునవ్వు చిందిస్తూ "మిమ్మల్ని కలుసుకోగల్గటం నా అదృష్టం!" అంది. చేతిలోని కుంకుమ బరిణె తెరిచి వనజకు బొట్టుపెడుతూ "రేపు మా అబ్బాయి పుట్టినరోజు పండుగ! మీరు తప్పక రావాలండీ! మీరు రాకపోతే నేనే స్వయంగా వచ్చి మిమ్మల్ని తీసుకెళతాను! ఏం శకుంతలక్కా? నువ్వు వీరిని నీతో తీసుకురాకపోవాలీ, అప్పుడుంటుందిలే నీ పని!'' అంది సరోజ కోమలంగా దరహాస చంద్రికలు ప్రసరింపచేస్తూ.

శకుంతలతోనూ, వనజతోనూ మరీ మరీ చెప్పి సరోజ యింటికి వెళ్ళిపోయింది. సన్నగా, నాజూగ్గా అందమైన కోలముఖంతో కల కల లాడుతున్న సరోజ రూపం వనజ మనస్సులో చాలా సేపటివరకూ తారట్లాడుతూనే ఉంది.

మర్నాడు వనజ వీలుచేసుకుని శకుంతలతో సరోజ ఇంటికి పేరంటానికి వెళ్ళింది. సరోజ ఆప్యాయంగావచ్చి పలకరించింది. పేరంటాళ్ళంతా సందడిగా కూర్చుని మాట్లాడుకుంటున్నారు. సరోజ చంటి పిల్లాడిని ఎత్తుకునే అన్నీ సవరించుకుంటున్నది. మిగతా ముగ్గురు పిల్లలూ అటూ, ఇటూ తిరుగుతూ అల్లరిచేస్తున్నారు. సరోజ ఒక్కొక్కరినే దగ్గరకు పిలిచి చూపించింది. వనజకు వాళ్ళందరనూ చూస్తుంటే ఏదో మధురమైన వింత అనుభూతి కలిగింది. చటుక్కున సరోజ చేతిలో పిల్లాడిని తీసుకుని ముద్దుపెట్టుకున్నది. అందరూ వెళ్ళాకకుండా సరోజ వనజను ఇంటికి వెళ్ళనిచ్చింది కాదు. "మీరు రావటానికే కుదరదు. వచ్చినప్పుడైనా మరోగంట కూర్చోకుండా వెళితే ఎలా?" అని బలవంతంచేసి శకుంతలనూ, వనజనూ కూర్చోపెట్టేసింది.

వనజ లేచి గోడమీది ఫోటోలు చూడసాగింది. సరోజ వనజ ప్రక్కనే నించుని ఒక్కొక్క ఫోటో గురించి చెప్పసాగింది.

ఉన్నట్టుండి వనజ ఫులిక్కిపడింది. సురేష్, సరోజా, పిల్లలూ తీయించుకున్న ఫోటో అది! సరోజ ముఖంలో సిగ్గు దొంతరలు సన్నగా నాట్యం చేశాయి. "నేనూ, మావారూ, పిల్లలూ" అంది మెల్లగా సరోజ! సరోజ వదనంలోని ప్రఫుల్లత, అనురాగంచూసి వనజ మనస్సెంతో చిన్నబుచ్చుకుంది. కాస్తదూరంలో చిన్నప్పుడు, సురేష్, తనూ తీయించుకున్న ఫోటో తగిలించిఉంది. సరోజ ఆ ఫోటోకేసి చూపిస్తూ ఈవిడ వారి మొదటి భార్య! మహా గయ్యాళి అట లెండి! అయినదానికి, కానిదానికీ పోట్లాటలు పెట్టేసి పుట్టింటికి వెళ్ళిపోయేదట! వారసలు ఎంతో శాంతంగా సరదాగా వుంటారుకదా! అలాంటిది వారితోనే ఆవిడకు పడలేదట! చిత్రమైన మనుష్యులుంటారండీ! వీరికి విడాకులిచ్చేసి ఏదో చదువు వెలగబెట్టిందట! పెళ్ళికూడా చేసుకుందేమోలెండి, మళ్ళా ఎవడికొంపో తియ్యటానికి! అలాంటి

వాళ్ళ ముఖం చూసినా పాపమే సుమండీ! నీతీ నిజాయితీ లేక పోయాక ఎందుకొచ్చిన బ్రతుకు చెప్పండి?" అంది సరోజ.

వనజకు కాళ్ళక్రింద భూమి కదులుతున్నట్టనిపించింది. తల దిమ్మెక్కినట్టయింది. వనజనుచూసి సరోజ గాబరాపడింది. "ఏమండీ! అలా వున్నారేం?" అంది. వనజ కాస్త తెప్పరిల్లి "మరేంలేదు! తల తిరుగుతున్నట్టుంది. ఇంటికివెళ్ళి కాస్సేపు విశ్రాంతి తీసుకుంటే అదే పోతుంది!" అంటూ శకుంతలతో హడావుడిగా ఇంటికి బయల్దేరింది. వనజా, శకుంతలా గుమ్మంలోకి వచ్చేసరికల్లా ఎవరో గేటు తలుపు తీసుకుని లోపలకు వస్తున్నారు. చేతిలో మల్లెపూల వాసన అమడ దూరందాకా వేస్తున్నది. వనజ ఆ వ్యక్తిని తేరిపారచూసి మనస్సు లోనే నిట్టూర్చింది. స్నేహపూర్వమైన ఆ సుందర వదనంలోని ప్రశాంతత, ప్రసన్నతచూసి వనజ ఆవేదనకు లోనయ్యింది. ఆనాడు తను అంత పొరపాటుపని చేయకపోతే సరోజలాగే తనూ పిల్లలతో, భర్త అనురాగంతో కలకలలాడుతూ జీవించేదేకదా?

ఇంటికి వెళ్తూండగా త్రోవలో "మల్లెపూలు కొంటారమ్మా?" అనడిగాడు ఒక కుర్రాడు పూలతట్ట నెత్తిని పెట్టుకుని వస్తూ. వనజ తుళ్ళిపడి చూసింది! ఎందుకో హఠాత్తుగా సురేష్ చేతిలోని మల్లె పూలు జ్ఞాపకం వచ్చాయి. ఈపాటికి అవి సరోజ జడను అలంకరించే వుంటాయేమో! ఈనాడు తనూ ఎవ్వరినీ అడక్కుండా అన్నీ తనే కొనుక్కోగలదు! అయితే సాటిలేని అనురాగం కొందామనుకున్నా ఎక్కడ దొరుకుతుంది? తన తండ్రి తనను ఎందుకూ కొరగానిదానిగా చేశాడు! ఇంటికి వెళ్ళాక కూడా వనజ మనస్సు ఏం బాగుండలేదు.

రాత్రంతా వనజ వికలమైన మనస్సుతో అపరిమితంగా బాధ పడింది. తెల్లవారిన తర్వాత డ్యూటీకి వెళ్ళలేక శెలవు పెట్టేసింది. సరోజ తనను అన్నమాటలు శూలాల్లా గ్రుచ్చుకున్నట్టుగా కలత చెందింది వనజ.

సాయంకాలం తండ్రి తనతో పదిమందిని వెంట వేసుకుని వచ్చాడు. సంతోషంతో పురకలు వేసుకుంటూవచ్చి "వనజా! ఆ కాల్టెక్స్ కంపెనీలో పనిచేసే ఆయన పెళ్ళికి వప్పుకున్నాడు. వాళ్ళు నిన్ను చూడ్డానికి వచ్చారు! త్వరగా సిద్ధంకా" అన్నాడు.

వనజ మౌనంగా ఆలోచిస్తూ నించున్నది. ఆర్థిక స్వాతంత్ర్యం ఉంటే మరేం అక్కర్లేదనుకున్నది తను ఒకనాడు! కాని యీనాడు తను లెక్కలేనంత డబ్బు గడిస్తున్నా చెప్పలేని వెలితి! ఈ శూన్యాన్ని ఎవరూ పూరించలేరు. ఆ సంగతి తనకు తెలియనే తెలుసు! 'నిత్య కళ్యాణం పచ్చతోరణంలా' ఉండాల్సిన తన జీవితాన్ని ఎడారిలా మార్చుకుంది. జీవితంలో అమూల్యమైనదాన్ని 'ఏదో' తను పోగొట్టుకున్నది! ముప్పై ఏళ్ళ వయస్సులో తను పెళ్ళిచేసుకుని ఏం సుఖపడుతుంది? అతన్నేం సుఖపెడుతుంది? యౌవనమంతా వ్యర్థంగా శోకంతోనే గడచిపోయింది. ఇంకమరి ... ఇప్పుడు పెళ్ళిదేనికి? సరోజ మాటలు తనను శూలాల్లా పొడుస్తున్నాయి! తను చేసింది పొరపాటే! అయినా ఎప్పటి కప్పుడు దిద్దుకోవాలనుకున్నా తండ్రి కఠినుడై కఠోరంగా అడ్డు నిలిచాడు! తనింకేంచేయగలదు మరి! చూస్తూ చూస్తూ తన జీవితాన్ని పాడుచేసుకోవటం తప్ప మరేం చేయలేకపోయింది.

"త్వరగా తెమిలిరా వనజా! అవతల వాళ్ళొచ్చి అప్పుడే అరగంట పైనఅయ్యింది."అంటూ భూషణం మరోసారి లోపలికొచ్చాడు.

వనజ సంతత ధారాపాతంగా కారుతున్న కన్నీళ్ళను తుడుచుకుంటూ "నా జీవితాన్ని నిర్దయగా నలిపేశావు నాన్నా! ఈ మిగిలిన శుష్క జీవితానికి కూడా శాంతి లేకుండా చెయ్యకు! వాళ్ళని వెళ్ళిపొమ్మని చెప్పు నాన్నా! నాకు ఈ జన్మలోచేసే వుపకారమేదైనా వుంటే, ఇదొక్కటేనాన్నా!'' అంటూ గబగబా తన గదిలోకి వెళ్ళిపోయింది, తెల్లబోతూనించున్న భూషణాన్ని నిర్లక్ష్యంచేసి ●

# ఆరుగురు పిల్లల శాంతమ్మ

కె. రామలక్ష్మి.

పురాణాల్లో స్త్రీలే పతివ్రతలు. పురాణ పురుషులే పుణ్య పురుషులు అంటూ దీర్ఘాలు తీసేవారిని చూస్తే గమ్మత్తుగా వుంటుంది యీ రోజుల్లో.

'నువ్వు మరీను లక్ష్మీ నిప్పు చేతపడితే చెయ్యి బొబ్బలెక్కి పోతుంది. నీళ్ళల్లో మునిగితే యిట్టే అట్టడుగుకి మునిగిపోతాం. మనం పతివ్రతల మేమిటి?' అంటుంది అనసూయ.

''కాదు. యీ రోజుల్లోనూ మహాతల్లులు - సీతా అనసూయా సావిత్రులను మించినవాళ్ళు వున్నారు. కానీ నీ దృక్పథం మార్చుకుని వాళ్ళని చూడవు నువ్వు. ఆ తప్పు నీది'' అంటాను నేను.

'నీ ముఖంలా ఉంది పద్నాలుగేళ్ళు అడవులట్టి తిరిగితే వెంట తిప్పుకున్నాడు భార్యని. ఈ రోజుల్లో ఏ మగవాడు చేస్తాడు? పది రోజులు ఒంట్లో బాగుండకపోతే పెళ్ళానికి పుట్టినిల్లేగతి! నువ్వెన్ని చెప్పు-సీతంటే మాటలా-ఎన్ని కష్టాలుపడి అలా పతివెంట తిరిగింది?' అతిభక్తితో అర్థనిమీలిత నేత్రాలతో అనసూయ గట్టిగా అంటూంటే ఏం సమాధానం చెప్పలేక చూస్తూవున్నాను. కాని నా మెదడు వూరుకోలేదు. ఆలోచనల అలలలో వూహల చేపలు ఒరసుకు వురికి పడుతున్నాయి. ఆసీత కేం కష్టాలొచ్చాయి? ఆ వచ్చినవి కష్టాలా? అన్న ఆలోచన, నాలో నాఎదుట మసలే ఎందరి కష్టాలనో అద్దంలో చూపెట్టింది: శ్రీరాములవారికి ఉద్యోగం బాధలేదు. వెనుక బలగానికి లోటులేదు. సీతమ్మవారికి ఆర్థిక కష్టాలులేవు. వీళ్ళ చదువు సంధ్యలు ఎలాగా అని బెంగపెట్టుకుందుకు పిల్లలులేరు. రేపెలా గడుస్తుందన్న

చింతలేదు. ఇన్ని లేని కష్టాలు కష్టాలా? డబ్బు ఖర్చు తగ్గడంకోసం, ఉద్యోగరీత్యా ఎందరెందరు భార్యాభర్తలు విడివడి బ్రతకటంలేదు! సీతామ్మవారికి కల్గిన అనుకూలత ఎంతమందికి కల్గుతుంది? పద్నాలుగేళ్ళు భర్తనివిడిచి వుండక్కరలేనిది; పద్నాలుగేళ్ళూ కట్టిన బట్టా, చేసుకున్న అలంకారం నలిగి చెరిగిపోకుండా నిత్య శృంగారపు ఛాన్సు ఎన్ని కష్టాలుపడ్డా మనకి లభిస్తుందా?

...ఆలోచనలదారి ఆలోచనలు చూసుకుంటున్నాయి. నా కళ్ళముందు శాంత సంసారం కట్టినట్టు కన్పిస్తూంది. ఓర్పుకీ. నేర్పుకీ ఏపతివ్రతకీ తీసికట్టు కాని యీ శాంతని, ఎన్నికష్టాలనైనా నవ్వుతూ ఎదుర్కొని ఒక పరిష్కారం ఆలోచించే యీ శాంతని గురించి ఎవరూ ఎందుకు చెప్పుకోరు అంటూ మూగగా ఎలుగెత్తి అరిచింది నా హృదయం. 'సీతా, సావిత్రి, అనసూయ ఎవరైతేనేం? ఏఒక్కరికీ తీసికట్టుకాదు శాంత, అనసూయ యీసంగతి నీకు తెలుసు, నువ్వెందుకు ఒప్పుకోవు' అంటూ ప్రశ్నించింది నా హృదయం.

కొందరి జీవితాల్లో కష్టాలనుంచి గట్టెక్కడం అంటూఉండదు. అవి జీవితంలో ఒక భాగంగానే నిలచిపోతూ వుంటాయి. ఒకదాని నుంచి యింకొకదానికి ఉస్సురనుకుంటూనే సాగిపోయే ప్రాణులకి ఎంతఓర్పు ఉండాలి. యీ జీవితంలో ఎప్పుడో అప్పుడు హాయిగా బ్రతుకుదాం అన్న ఆశలు చిగురించడానికి!

శాంత పేరు చెప్తేచాలు అనసూయకి హేళన. శాంతఅంటే ఎందుకో అందరికీకూడ అంతచులకన. నిజమే. భర్తని త్యజించి అష్ట కష్టాలుపడి వాటికి ఆహుతి అయిపోయిన భార్యలని ఆదరించినట్టు, వాటినుండి ఏదోవిధంగా తప్పించుకొని పిల్లల భవిష్యత్తుకోసం, తను మానసిక విశ్రాంతికోసం, శారీరక సౌఖ్యంకోసం దారులున్నాయా అని వెదికేవారిని హర్షించదు సంఘం. నిరాశా నిస్పృహలతో కాలం వెళ్ళదీస్తూ బ్రతికే ప్రజ ప్రజాస్వామ్యం అయినట్టు, వాటిని దూరంగా

నెట్టి ప్రచండంగా విజృంభించిన ప్రజ అరాజకం అయినట్టు—వ్యక్తులు కూడా. కష్టపడుతూంటే అయ్యో అనేవాళ్ళ వాటినుండి విముక్తి పొందడానికి ఏ ప్రయత్నం చేయకపోతే తెలివితక్కువంటారు-చెప్తే అతి తెలివి క్రింద జమకడతారు.

'ఆర్చి తీర్చి అన్నం పెట్టనివాళ్ళు ఏమన్నా నాకు లెక్కలేదు, లక్ష్మి. సం కసలు ఎవరేమన్నా లెక్కలేదు.' అంటూ శాంత అనడం జ్ఞాపకంవచ్చింది నాకు. ఆక్షణంలోనే అనసూయ చీదరించుకోవడం-నలుగురూ హేళనచేసేలా బ్రతికేకంటే చావడం మేలు అనడం-జ్ఞాపకం వచ్చింది. నీకు తెలియదు అనసూయా ఆరుగురు పిల్లల తల్లి ఎవరో ఏదో అన్నారనీ అంటారని ఏనూతిలోనో ఉరకడం చాలా కష్టం' అని అక్కణ్ణుంచి శాంత లేచి వెళ్ళిపోవడమూ జ్ఞాపకం వచ్చింది...

శాంతని చిన్నప్పటినుంచీ తెలిసిన వాళ్ళుకూడ యీరోజు శాంతతో మాట్లాడరు. ముఖావంగానైనా పలుకరించరు. దీనికీ కారణం లేకపోలేదు. ఈనాడు శాంత సంఘానికి దూరంగా వుండ వలసిన వ్యక్తి. అయ్యో! పతిత, అని అందరి సానుభూతికీ ఎదురు చూడవలసిన వ్యక్తి.

కాని, అందరూ అనుకున్నట్లు శాంత పతితని అనుకోలేదు. ఎవరి సానుభూతికోసం ఎదురుచూడలేదు. తనబ్రతుకేదో తను బ్రతుకు తూంది; పిల్లల్ని చదివించుతూంది.

• • • •

కొద్దిసంవత్సరాలక్రితందాకా శాంత చలాకిఅయినఅమ్మాయి. దేనికీ భయపడని తత్వం. తండ్రీ తల్లీ అష్టకష్టాలుపడి పిల్లని పెంచారు. 'మహారాజభోగాలు అనుభవింపతగ్గ నువ్వు ఈ దరిద్రురాలి కడుపున తప్పపుట్టావు తల్లీ' అంటూ ఏచిన్న కోర్కె తీర్చలేకపోయినా శాంత

తల్లి వలవల ఏడిచేది. ఏం చెయ్యడానికీ చేతకాక గోడకి తల బాదు కుని ఏడిచేది. శాంత కిది నచ్చేదికాదు. అందుచే తన కేంకావాలన్నా మాట్లాడక వూరుకునేది శాంత. అమ్మా నాన్నా చెయ్యలేరని తెలిసీ తన చపలతని బైటపెట్టుకోడం ఎందుకు?

పెద్ద చదువులకి రాకుండానే చదువు మానేసింది. అత్తవా రింటి కెడితే అక్కడేనా సుఖపడకపోతానూ అని శాంత ఆశ. బీద వాళ్ళ పిల్లకి పెళ్ళి అవడం మాటలా? కాళ్ళకి బలపాలు కట్టుకుని తిరిగాడు శాంత తండ్రి. పెళ్ళికొడుకులైతేవున్నారు. వాళ్ళకీ విలువ వుంది. శాంత తండ్రికి కట్నం యిచ్చే స్తోమతులేదు; శాంతకి ఎదుటి వారిని గుమ్మెత్తించే అందచందాలు లేవు; చదువూలేదు.

పెళ్ళికొడుకులు ఒక సమస్య కావడంతో పదహారోఏట పెళ్ళి చేద్దాం అనుకున్న శాంతకి ఇరవైనాలుగేళ్ళు వచ్చేదాక సంబంధమే కుదరలేదు... అప్పటిదాకా నాకూ శాంతకీ చాలా స్నేహం. ఏదో ఒక లోకాభిరామాయణంతో మొదలెట్టి యీ మనుషులమీద తనకున్న వూహాలన్నీ ఏకరువు పెడుతూండేది. అప్పటికి నాకు పెళ్ళయి ఏడాది అయింది. వారి చదువు పూర్తికానిదే కాపరానికి తీసుకు వెళ్ళమన్నది ముందుగానే అనుకోడంవల్ల అమ్మగారింట్లోనే వుం టున్న నాకు శాంత స్నేహపాత్రురాలైంది. యువతుల హృదయాలకి సన్నిహితం అయిన ఎన్నో తీయని వూహాలని కలలని మేం కలబోసు కునేవాళ్లం. అమ్మకి అస్తమానూ శాంత యింటికి వచ్చిపోతూవుండడం యిష్టం వుండేదికాదు. ఉన్నవాళ్లు లేనివాళ్ళతో తిరగడం నామోషీ అని యెంచే తత్వం అమ్మది. అందుకే చాటుమాటుగా నన్ను కేకలు వేస్తూండేది...

నేను అత్తవారింటికి వెళ్ళిపోయాను. రెండు మూడేళ్ళు గడిచి పోవడం పెద్ద ఘనత వహించిన విషయంకాదు. ఈ రెండేళ్లలో అమ్మపోయింది. అన్నయ్యకి పెళ్ళయింది. నాన్నగార్ని చూసుకుందుకు

ఒదిన వచ్చింది నాకు పుట్టింటి ఆశకి ఆవిడే ఆస్కారం అయింది... దేవుడి దయవల్ల మా ఆయనకి పెద్ద వుద్యోగం అయింది. ముందే అత్తగారులేరు. మామగారు పోయారు. మాది ఒకవిధంగా పెద్ద దిక్కులేని సంసారం అయింది... రెండేళ్ళు చూడ్డానికి లెక్కలోకి రావు. కాని... వ్యక్తుల జీవితాలలో అవి ఎన్నెన్ని మార్పులని తెస్తాయి!

ఈ రెండేళ్ళూ శాంత జీవితంలోనూ వెన్నెల కురిపించాయని తెలిసి ఎంతో సంతోషించాను. నేను పురిటికి అమ్మగారింటికి వచ్చాక గాని శాంతని కలుసుకుని కబుర్లు చెప్పుకునే అవకాశం చిక్కలేదు. చిక్కిన అవకాశాన్ని నేను చెయ్యిజారి పోనివ్వలేదు.

శాంతను మా యింటికి రమ్మన్నాను. శాంత వచ్చాక కాని మా వదినకి ఆ అమ్మాయిమీద యెంత 'చిన్న' అభిప్రాయంవుందో తెలియలేదు నాకు. "ఏం శాంతా కులాసాగా వుంటున్నావా?" అని కుశల ప్రశ్నతో ఎదురు వెళ్ళిన నన్ను అమాంతం కౌగిలించుకొని ఏడ్చింది శాంత.

"నువ్వు వెళ్ళిపోయాకగాని అర్థంకాలేదు లక్ష్మీ, ఆప్తులన్న వాళ్ళు వుండడం ఎంత అదృష్టం!"

"దానికేంగాని మీఆయన్నిగురించి చెప్పు"అన్నాను. క్షణంలో రంగుమారిపోయింది శాంత ముఖం.

"నువ్వెళ్ళిననెలకే పెళ్ళిచేసుకున్నాను" అంది నెమ్మదిగా. నాన్న గారికి ఇష్టంలేదు. అమ్మకి అంతకంటేనూ, అయితేనేం? వాళ్ళ సంబంధాలకోసం తిరిగి తిరిగి అలసిపోయారు లక్ష్మీ. వాళ్లనింకా కష్ట పెట్టడం నాకు భావ్యంకాదనితోచింది. అందుకే ఎవరూలేని శేఖ రాన్ని స్వంత బాధ్యతమీద పెళ్ళిచేసుకున్నాను." చిన్నగా నవ్వింది శాంత. ఆనవ్వులో ఏవేవో అర్థంకాని భావాలు కోకొల్లలుగా ధ్వనించాయి నాకు.

"పెళ్ళి బాధ్యతలు యిద్దరూ పంచుకుంటున్నారటగా?" అన్నాను.

"అవును. డాక్టరు ఇంటికి తిరగడం నావంతు. డబ్బుంటే టాక్సీల్లో తిరగడం ఆయనవంతు. నా సంగతికేంగాని లక్ష్మి హాయిగా వుంటూందా నీ జీవితం?" అమాయికంగా ధ్వనించిన ఈ ప్రశ్నకి ఏం సమాధానం చెప్పను? చిలిపికజ్జాలు పెంచుకుంటామనీ, వాటిఫలితం నాకు రెండు పూటలు వుపవాసం అనీ! యేమని చెప్పడం. నా మౌనాన్ని బాగానే అర్థం చేసుకుంది శాంత.

"లక్ష్మి జీవితంలో యితమితంగా యిది కావలసి నిర్ణయించుకున్నానేగాని ఏడారీ పట్టకూడదు. ఒకసారి ఒకదారివ పడ్డామా అది అంతమయ్యేకనే వేరేదారి! మళ్ళీ కలుసుకుంటాను లక్ష్మి. కుర్రాడికి వంట్లో బాగులేదు." అంటూ లేచింది శాంత. అప్పుడు జ్ఞాపకం వచ్చింది. మావదిన అనసూయ ఒక్క మాటేనా మాట్లాడలేదని. శాంతని సాగనంపివస్తూంటే అనసూయ అడిగింది. "స్నేహితురాల్ని పంపించేశావా?" అని "చూస్తూనే అడుగుతావెందుకూ? అవునుకాని అనసూయా-యింటికి వచ్చిందికదా ఒక్కసారైనా పలకరించలేదేం?" అడిగాను యిక వుండబట్టలేక. "ఇంకానయం, మీ అన్న వుండగా రప్పించావుకాదు... నీకు తెలియదు లక్ష్మి శాంతని గురించి చాలా అసహ్యంగా చెప్పుకుంటున్నారు. ఆశేఖరాన్ని పెళ్ళాడిందా. వాడికి ఉద్యోగంలేదు సద్యోగంలేదు. కాని యీావిడమట్టుకు చక్కని చీరలు, ఖరీదైన నగలు-రోజూ డాక్టరే అదేమిటోమరి" అంటూ చేతులు తిప్పుతూ అనసూయచెప్తూంటే ఎంత ఒదిన అయినా అదలించకుండా వుండలేకపోయాను. అదేమిటనసూయా, అందరూ అనుకుంటే మనకేం - మనకి శాంత యివాళే తెలుసా?"

"ఆలా అనకు లక్ష్మి, మనుషులు మారతారు అది సహజం-" యింక మాట్లాడవలసినది లేదన్నట్లు వంటింట్లోకి వెళ్ళిపోయింది.

మళ్ళీ రెండు నెలలుదాటేదాకా శాంత కన్పించలేదు. నేను పురిటికి ఆస్పత్రికి వెడితే అక్కడికి ఓసారి చూడవచ్చింది. ఆ సమయంలో ఎవరూ అక్కడ లేకపోవడంవల్ల హృదయంలోని ఆవేదనంతా వెళ్ళకక్కుకుంది శాంత.

చూడులక్ష్మీ. శేఖరం వ్యక్తిగతంగా చాలా మంచివాడు. కాని అతని చుట్టూ వాతావరణం కలుషపూరితం. ఈ రెండు నెలలూ ఎందుకు నిన్ను చూడరాలేదనుకున్నావు? నాకు మూడో నెల. పగలంతా పనిలో అలసిన నన్ను రాత్రి ఆయన చితకగొట్టారు. కారణం అడక్కు లక్ష్మీ. నిషాలోవున్న మనిషికి కారణాలకి కొదవేమిటి? "నిషా ఏమిటి? శేఖరం తాగుతాడా?" విషాదంగానేనవ్వింది శాంత. అవును లక్ష్మీ,గవర్నమెంటుకిప్రొహిబిషన్‌గానిమనుషులకిగాదనిశేఖరంవాదన. ఈబాధకంటే మించినవి చాలావున్నాయి లక్ష్మీ. అందుకే యిదంతా నన్ను పీడించగు. ఏమో యింకోపదేళ్ళతరవాత నాజీవితం ఎలా వుంటుందోవూహించలేను" అంటూ అందేకాని శాంత ఏడవలేదు. కష్టాలతో కరడుకట్టిన హృదయాలలో కన్నీళ్ళెక్కడ వుంటాయి?

• • • • •

సంవత్సరాల రేకులని త్రిప్పుకుంటూ కాల చక్రాన్ని ఎంత త్వరగా దొర్లిస్తే అంత సరదాకాబోలు దేవుళ్ళకి!

నాన్నగారు పోవటంతో పుట్టింటిఆశ చాలామటుకు పోయింది నాలో. నాకూ సంసారం పెరగడంతో బాధ్యతలు ఎక్కువ అయినాలోనూ ఒకరకపు సంకుచితత్వం ఒక పరిధిదాటని దృక్పథం పేరుకు పోయాయి. అందుకే పదేళ్ళ తరవాత శాంతని గురించి అనసూయ సుదీర్ఘంఅయిన ఉత్తరంరాసినా నన్ను కదల్పలేదు: మనస్సులో ఏదో తెలియని భావాలురేగి బాధపెట్టాయేగాని యింకేం అనిపించలేదు...

జీవన ప్రవాహాన్ని అడ్డుతగిలి ఎక్కడికక్కడే గట్టెక్కడానికి ప్రయత్నిస్తాయి మానవహృదయాలు. చిత్రం ఏమిటంటే ఆ అడ్డంకులే

ఆపదల వెనుభూతాలై వెర్రిమనుషుల ప్రాణాలని బలికొంటూ వుంటాయి.

అతితాగుడికిఅలవాటుపడ్డ శేఖరం సుఖంగానేకన్నుమూశాడు. కాని శాంత! శాంత పేరు చదివేసరికి నాలో ఆశక్తి కల్గింది. చిన్న నాటి స్నేహితురాలు శాంత! సహృదయ శాంత! నా కళ్ళముందు కట్టినట్టయింది.

శేఖరం చనిపోయి శాంతనీ ఆరుగురు పిల్లలనీ యీ ప్రపం చంలో ఎలాగోఅలాగ బ్రతకమని వదలివెళ్ళిపోయాడు, శాంత 'ఉద్యో గం చేస్తుందా? ఊళ్ళేలుతుందా!' అనసూయ హేళనగా రాసిన యీ ప్రశ్నకి నాకెంతో చిన్నతనంవేసింది. "ఊరే ఏల నిశ్చయించుకుని మీ శాంత శేఖరంగారి ఆఫీసరుగారి యింట్లోనే వుంటూంది. నీకు తెలుసుగా నరసింహంగారు, ఏభై దాటినవారు! పిల్లలందరినీ స్కూల్లో వేసింది. యిప్పుడు శాంతపని బాగానేవుంది!" ఛ ఏమి అనసూయ, అదృష్టం తన పక్షంఅయిన వ్యక్తి అనసూయ, అది వక్రిస్తే ఎలా వుం టుందో తెలియని అసూయ.

ఆరుగురు పిల్లలనీ ఎలా పోషిస్తుంది. ఏవంటపనో చెయ్య కూడదా? అనేస్తారు. ఎన్నివంటపాట్లుపడితే పిల్లల చదువుసంధ్యలూ అవసరాలూ గడుస్తాయి? శాంతపట్ల తెలియని సానుభూతితో ఆప్యా యతతో నా హృదయం నిండింది. అనసూయ రాసిన ఉత్తరం చింపి ముక్కలుచేసి పారేస్తేగాని తృప్తి కలుగలేదు.... కాని ఎప్పుడో శాంతవేసిన ప్రశ్న యీనాటికి నా చెవులలో రింగుమంటూనే వుంది. ఆరుగురు పిల్లలనీ ఆర్థిక కష్టాలనీ ఒదిలిపెట్టి ఆ రాములవారు కాస్తా తనదారి తను చూసుకుంటే ఆ సీతమ్మ తల్లి ఏం చేసేదో.?

నిజమే. ఎలాగవూహించడం అది పురాణకాలం ఇది మనుషుల కాలం. అది లోటుఎరుగని రామరాజ్యం. ఇది లోటేసర్వస్వంఅయిన ప్రజారాజ్యం. ఈరోజుల్లో రేపునిగురించి వూహించలేని మనం ఆనాటి సంఘటనలని సమస్యలని వూహించి పరిష్కరించగలమా? కల్ల. ●

# తండ్రి పోలిక

ఇల్లిందల సరస్వతీదేవి.

రాత్రి పదిగంటలవేళ. అనంతరావు చేతులు రెండూ వెనక్కు పెట్టుకుని వాకిట వరండాలో పచారుచేస్తున్నాడు.

ఉదయము పదుగంటలకు కాఫీత్రాగి ఇంటినుంచి బయటికి వెళ్ళిన కొడుకు అంతవరకూ ఇంటికి రాకపోవటము అనంతరావు మనసును కలచివేస్తున్నది. కొడుకుమీది కోపము పుట్లకొద్దీ పెరిగిపో తున్నది. తలచుకున్నకొద్దీ ముఖము జేవురించిపోతున్నది. ఒళ్ళంతా ఆవేశముతో ఒణికిపోతున్నది. ఎంతరాత్రికయినాసరే - అడగదలచిన నాలుగు మాటలూ ముఖముమీదనే అడిగివేయాలన్న నిశ్చయానికి వచ్చి మరింత వేగముతో పచారుచేయటము మొదలు పెట్టాడు.

పదకొండు గంటలు కొట్టినచప్పుడు వినబడ్డది. ఇక ఆనాటికి కొడుకురాడేమోననుకుని, విసుగుదలతో వీధితలుపులన్నీ భద్రముగా వేసి, అనంతరావు తన గదిలోకి వెళ్ళుతుండగా- పెరటిత్రోవనఎప్పుడు వచ్చాడో కొడుకు - తల్లిచేత అన్నము పెట్టించుకుని తింటున్నాడు.

కొడుకు ప్రవర్తనవల్ల అనంతరావు మనసంతాచెదరిపోయింది. దానికితోడు తండ్రి కంటబడకుండా ఉండాలని చడీచప్పుడు లేకుండా పెరటిత్రోవన వచ్చి, తల్లిచేత అన్నం పెట్టించుకుని తింటున్నాడు కొడుకు. దీనితో తన రక్తమే తనపట్ల అంత శతృత్వము చూపుతున్న దన్న అనుమానము రూఢి అయింది. అతడి మనసంతా మంచువలె నీళ్ళుకారటము మొదలుపెట్టింది. జీవితములో ఓటమి ప్రారంభ మయినదేమోనన్న శంక కలిగినవెంటనే ఆవేశమెక్కువయింది.

"శేఖరమ్! నీవు పగలంతా ముఖము తప్పించి తిరిగావు. అయినా నా ప్రశ్నకు జవాబు ఇవ్వవలసిన బాధ్యత నీమీద అట్లాగే ఉన్నదిసుమా! విద్యావంతుడ వయినందుకు ఇంతో అంతో విజ్ఞానాన్ని కూడా ఆర్జించావనుకున్నాను. అయితే నా ఊహ పొరబాటేనా?" అంటూ తన మనసులో రేగిన కలతనూ, కొడుకుమీద కలిగిన వ్యామోహాన్నీ వ్యంగ్యార్థములో బైటికిఅనేసి, అనంతరావు తన మనసును తేలికపరచుకోవటానికి ప్రయత్నించాడు.

ఇంతలో తల్లి కూరవడ్డించబోయింది. శేఖరము చెయ్యి అడ్డం పెడుతూ, మంచినీళ్ళ గ్లాసు అందుకున్నాడు. "కూర రుచిగా ఉంది నాయనా!" అంటూ తల్లి అట్లాగే నిలబడి వెయ్యబోయింది. "వీటి రుచి నాకు తెలిసేసమయమా ఇది!" అంటూ శేఖరమ్ తల్లి కళ్ళల్లోకి చూశాడు.

"ఏమారా మాట్లాడవేం?" అంటూ పొడిచినట్టు ప్రశ్నించాడు అంతలోనే అనంతరావు.

"నాన్నా! మీరు చెప్పినమాట నేను ఎప్పుడు వినలేదు. ఇప్పుడయినా వినటానికి సిద్ధంగా ఉన్నాను కాని... ఈ ఒక్క విషయములో మన్నించండి. నేను బాగా ఆలోచించుకొనే జవాబు యిస్తున్నాను." అన్నాడు శేఖరము తలవంచుకుని.

"కాదురా బాబూ! మేము కట్నంకోసము ఆశపడుతున్నామనుకుంటావేమో! ఇతరుల ధనము నాకు తృణప్రాయము మేము చూపించిన సంబంధము విషయములో అభిప్రాయపడిన దేమిటంటే గౌరవముగల కుటుంబమనీ - వంశమర్యాదలు మంచివనీను... తెలిసిందా? పెద్దవాళ్ళు ఇంతదూరము ఎందుకు చెప్తున్నారో కాస్త గ్రహించుకో-" అన్నాడు కొద్దిగా హెచ్చించిన కంఠంతో.

"నేను బాగానే ఆలోచించాను నాన్నా! మనసులుకలియనిదే పెళ్ళి అనిపించుకోదని మీరు ఎంతమంది విషయంలో అనలేదు? ఆ

పిల్ల నాకిష్టంలేదోఅని నేను వెయ్యిసార్లు చెప్పాను. అయినా మీరు మళ్ళీ బలవంతం చేస్తున్నారంటే నన్ను జీవిత పర్యంతమూ బాధపడ మనేగా మీ ఉద్దేశ్యం? ఈ కాలంలోకూడా బలవంతపు వివాహాలు జరుగుతాయంటే మనకేకాదు - మన దేశానికికూడా అప్రతిష్ట. ఈ విషయంలో ఇంతకంటె ఎక్కువ నన్ను వాగించరనుకుంటాను-" తలవంచుకొని భోజన పళ్ళెములో వేలితో గీతలుగీస్తూ ఉదాసీనంగా పక్కకు జరిగాడు.

"అయితే నీవు స్వతంత్రుడవని ప్రకటించావన్నమాట. నిన్ను పెంచి పెద్దవాడిని చేసినందుకు మంచి బుద్ధిచెప్పావు. ఇంకా నీకు పెద్దచదువు చెప్పించి, ఏమిటేమిటో చేద్దామని కలలుగంటున్నాను?" భుజంమీద వేసుకున్న తువాలనుతీసి రెండుసార్లు దులిపి మళ్ళా వేసు కున్నాడు అనంతరావు. గదిచివరివరకూ వెళ్ళి మళ్ళీ వచ్చాడు. అప్ప టికి కొడుకు ఇంకా పీటమీదనే కూర్చుని ఉన్నాడు. తల్లి మాత్రం గోడకానుకుని నిలబడ్డది.

"అయితే నీవు స్వతంత్రుడవుగానే ఉండు-" అంటూ గబగబా అడుగులువేసుకుంటూ వెళ్ళి, అనంతరావు తనగదిలో మంచముమీది పరుపు దులుపుకొని పడుకున్నాడు. శేఖరమ్‌మీది కోపాన్ని ఎన్ని మాటల్లో వెలిగ్రక్కినా అతడి మనసు తేలికపడలేదు. కాగా మరింత భారంగాతోచింది; అనేకవిధాలుగా బాధించటము మొదలుపెట్టింది.

పెద్దకొడుకు - చేతికి ఎదిగినవాడు! అందులో - చదువంతా ముగించుకొని సంపాదనకు సిద్ధంగా ఉన్నవాడు. వీడిని ఆదర్శంగా పెట్టుకొని మిగతా పిల్లలంతా ఈ బాటన నడవాలని అనంతరావు ఆశించాడు. పెద్దకొడుకు వంశానికి తల్లివేరువంటివాడని భావించి ఏ చిన్న లోపమూ లేకుండా పెంచాడు. శేఖరమ్‌లో ఉన్న ఉత్తమ గుణా లను చూసి పొంగిపోయేవాడు. ఒక్కొక్కసారి అతడి సంతోషము మేరలుదాటేది.

అనంతరావు మంచముమీదినుంచిలేచి పడకకుర్చీలో కూర్చు న్నాడు. మిగతా పిల్లల గతేమిటని నొసలు కొట్టుకున్నాడు. "తన కష్టము - ఇరవై రెండేళ్లు పడ్డకష్టమూ వృథా అవుతుందా? అయితే గతేమిటి" జుట్టుపీక్కున్నాడు; కళ్ళు నులుపుకున్నాడు. కుర్చీమీది నుంచిలేని బల్లమీద పడివున్న పుస్తకాలన్నీ సర్దిపెట్టుకున్నాడు. క్యాలెండరులో తేదీమార్చి కొత్తదిపెట్టాడు.

అంతలో ఇంట్లో దీపాలన్నీ ఆర్పి కాంతమ్మ వచ్చింది. ఆమె మొదటినుంచీ బలహీనురాలు. అయినా వేళకుపనిచేసుకొని మంచము మీద పడుకుంటుంది. యథావిధిగా వంటచేసి పిల్లలకూ పెనిమిటికీ వడ్డిస్తుంది. కొడుకు అటు వెళ్ళగానే తన మంచము దగ్గరికివచ్చి పడుకోబోయింది. ఆమెను చూడగానే అనంతరావుకు ఆవేశమెక్కు వయింది.

"అటువంటి పనికిమాలిన వెధవకు నేను చూడకుండా అన్నం పెడుతున్నావా? అయితే నీకూ వాడు చేసేపని ఇష్టమన్నమాట. నీవుకూడా మిగతా పిల్లలగతి ఆలోచించవన్నమాటేగా! మన గతేమి టని ఎన్నడయినా ప్రశ్నించుకున్నావా? వాడినొక్కడినీ చూసు కుంటే నీకు రేపటి సంగతి అక్కర్లేదూ?" ఈ మాటలన్నీ విసురుగా అనేసి మళ్ళీ గదిలో దీపం పెట్టాడు అనంతరావు.

కాంతమ్మ నిర్ఘాంతపోయింది. అయినా తొందరపడదలచుకో లేదు. తను జవాబియ్యకపోతే ఆయన తగ్గుతాడనుకుని అప్పటినుంచీ నోరు కట్టేసుకునే ఉంది.

"మాట్లాడవేం" అన్నాడు అనంతరావు ఆమె ముఖంలోకి చూస్తూ.

"మాటపట్టింపులకూ భోజనానికీ సంబంధములేదనుకుని అన్నం పెట్టాను" అని దుప్పటి కప్పుకుంటూ పక్కకు తిరిగింది. "వాడు

తెగేవరకూ లాగకూడదనుకొని రారానాయనా! అన్నాను" అంటూ కళ్లు మూసుకున్నది.

అనంతరావు విసుగుగా తన మంచముదగ్గరికి వెళ్ళాడు. దిండ్లన్నీ సర్దుకున్నాడు. ఒక మఫ్లరు తెచ్చి తలకుచుట్టుకొని పడుకున్నాడు. అంత మెత్తగా ఉన్న పరుపుమీదకూడా అతడి దేహము ఆనలేదు. ఏవో గుచ్చుకుంటునే ఉన్నది. ఎక్కడినుంచో పొగలూ సెగలూ ఒంటికి తాకుతున్నాయి. ఆ బాధకొద్దీ కళ్ళుమూసుకునే తనలో తాను మాట్లాడుకోవటం మొదలుపెట్టాడు. "నాజీవితంలోనే నెన్ని కష్టాలు పడ్డాను! నా స్థితికిమించి పిల్లలను పెంచాను. ఒకడు పైకివస్తే మిగతా వాళ్ళను వాడే సంరక్షిస్తాడనుకున్నాను. ఈ శేఖరాన్ని కిందికి దించకుండా కంటిలో పాపమాదిరిగా కాపాడేనే! అటువంటివాడు కాస్తా భ్రష్టుడయిపోతున్నాడు. ప్రణయమూ ప్రేమా అని వల్లిస్తున్నాడు. ఏపిల్లను పెళ్ళిచేసుకున్నా రంభలా కనపడుతుంది. ప్రేమకూడా దానంతట అదే పుట్టుకొస్తుంది. ఎంతయినా శేఖరమ్ అనుభవము లేనివాడు. అయినా ఇతరులు చెప్పినప్పుడు వింటే ఎంత బాగుంటుంది? తండ్రి అనుభవాన్ని ఆదర్శంగా పెట్టుకునే సదవకాశము లోకంలో ఎందరు కొడుకులకు లభిస్తుంది? తెలివిగలవాడు కాని వినియోగించుకోలేడు. ఈ పెళ్ళివల్ల శేఖరానికేకాదు-కుటుంబానికంతా నష్టము. ఈ నష్టానికి పరిహారము ఉండదు" అనుకుంటూ దొర్లటము మొదలుపెట్టాడు. ఆ దొర్లడములో అతడికి ప్రస్తుతావస్థ అడుగునపడి నలభై అయిదుసంవత్సరాలనాటిచరిత్ర పైకితేలి కళ్ళకు కట్టినట్లయింది.

• • • •

అనంతరావు కప్పుడు సరిగ్గా శేఖరమ్ వయసే ఉంటుంది. బి. ఏ. చదువుతున్నాడు. ఎక్కడయినా ఉద్యోగములో ప్రవేశించి తమకు కాస్త ఆధారమవుతాడని తండ్రి సీతయ్యగారు గంపెడాశతో

ఉన్నాడు. ఆడపిల్లల పెళ్ళిళ్ళవరకు, ఎదిగిన కుమారుడివల్ల సహకారము లభిస్తుందని ఆయన పొంగిపోయాడు.

అనంతరావు రెండవ సంవత్సరము బి.ఎ.లో ఉండగా వితంతు శరణాలయం మేనేజరు అప్పుడప్పుడు అతడిని పలకరిస్తూ ఉండేవాడు. మేనేజింగు కమిటీలో ఉన్నవారి నందరినీ పరిచయము చేశాడు. అనంతరావు తన తీరిక సమయాల్లో వాళ్ళలో చేరి కబుర్లు చెప్పుతూ ఉండేవాడు.

ఆ శరణాలయపు సహాయకార్యదర్శి వయోవృద్ధుడు. అనంతరావు కనబడినప్పుడల్లా బాలవితంతువుల బాధలను గురించి కళ్ళకు కట్టినట్టుగా హృదయం కరగిపోయేటట్లు వర్ణించి-యువకులే వాళ్లను రక్షించాలని ఉద్బోధించేవాడు. అవన్నీ వినగా వినగా అనంతరావుకు ఆశ్రమములో ఉన్న వితంతువును వివాహమాడాలని హృదయము ఉరకలు వేస్తూ ఉండేది. అతడి ఎదలో దేశభక్తి సంఘ సంస్కారమూ పొంగిపొర్లిపోయేవి. తానొక్కడేకాదు-తన కాలేజిలో ఉన్న విద్యార్థులందరూ ఆ వితంతువులను వివాహమాడి సంఘాన్నీ దేశాన్నీ ఉద్ధరించకూడదా అన్న ఆవేశము కలిగేది.

అనంతరావు హృదయము సంస్కరణ కోసమని గంతులు వేసేది గాని ఆ శరణాలయములో ఉన్న వితంతువులలో కంటికి నచ్చిన పిల్లనైనా వివాహమాడా లనిపించేదికాదు. మేనేజరు 'నీ కంటికి నచ్చిన పిల్లను చూసుకోవయ్యా' అని అంటున్నకొద్దీ "ఎవరయితేనేమి" అనేవాడు. ఆరోజుల్లో అతడు ఎవరితో మాట్లాడినా వితంతువుల దుర్దశను గురించే-వితంతూద్వాహాలను గురించే.

తరువాత శీఘ్రకాలములోనే అనేకమంది సంస్కర్తల సమక్షములో గౌరవనీయులైనఅధికారుల సాన్నిధ్యములో, కొన్ని వందల మంది ప్రేక్షకులు ఆదర్శ వివాహమని కరతాళధ్వనులు చేస్తుండగా, అనంతరావు కాంతమ్మ అనే వితంతువును వివాహమాడాడు. వివా

హము ఆ శరణాలయములోనే అతివైభవంగా జరిగింది అనంతరావు ధైర్యసాహసాదులను గురించి శబ్దవైచిత్రితో పెద్దలనేకులు గంభీరోపన్యాసాలు చేశారు. ఎన్ని కబుర్లయినా చెప్పవచ్చుగాని-కార్యాచరణకు పూనుకోవటము సామాన్యమా మరి! మొదట అన్నిటికీ సమ్మతించిన యువకులెందరో ముహూర్తము రేపనగా మన స్థైర్యము సడలి-పలాయనము చేసేవారు. అనంతరావు నిశ్చలమయిన దీక్షగలవాడు కనుక కార్యము సఫలమయిందని సంభ్రమాశ్చర్యాలను ప్రకటించారు. అనంతరావు దంపతులను చాలామంది అభినందించారు; సన్మానించారు, గౌరవించారు; ప్రశంసించారు

కాంతమ్మా అనంతరావుల వివాహాన్ని గురించి పొగడని పత్రిక లేదు. ఈ వార్త వాయు ప్రసారమువలె పట్టణాలకూ పల్లెలకూ పాకిపోయింది

అనంతరావు పట్టభద్రుడయి సెలవులలో వస్తున్నాడని ఇంటి దగ్గర తండ్రి ఎదురు తెన్నులు చూస్తున్నాడు. చాలా రోజులనుంచీ అనుకుంటున్న సంబంధాలను కూతుళ్ళిద్దరికీ నిశ్చయించ వచ్చును అనుకున్నాడు. వాళ్ళ పెళ్ళిళ్ళు కాగానే కొడుక్కు-కూడా ఒక అయినింటి పిల్లను చూసి ముడిపెడదామనుకున్నాడు.

ఆ ఉదయము-రైతులతో మాట్లాడి వాళ్ళను సాగనంపి లోపలికి వస్తుండగా-పెద్దపెద్ద అక్షరాలతో అనంతరావు వివాహాన్నిగురించి ప్రకటించిన పత్రికను ఎవరో ఆయన చేతికి అందించారు. "ఫొటోలు కూడా ఉన్నాయి పూలహారాలతో" అంటూ వివరాలు చదువుదామని కళ్ళజోడు పెట్టుకొని చూస్తూనే గోడకు చేరగిలబడిపోయాడు. నిలువునా నీరయిపోయాడు.

ఈ వివాహ ఫలితంగా సీతయ్యగారి సంసారములో అనేక మార్పులు జరిగాయి. మాటయిచ్చిన సంబంధాలు రెండూ తప్పి

పోయాయి. బంధువు లందరూ బహిష్కరించారు. వృద్ధాప్యములో కలిగిన మనస్తాపమువల్ల సీతయ్యగారి ఆరోగ్యము చెడిపోయింది.

ఆ కాలంలో ప్రౌఢవివాహాలు ఆచారములోలేవు. కుమార్తెల వివాహ సమస్య వృద్ధుడిని పీడించటము మొదలు పెట్టింది. అనంత రావు చేసుకున్న వివాహంవల్ల కలిగిన లోపాన్ని కప్పిపుచ్చగలిగిన పెద్ద మొత్తాన్ని కట్నంగా ఆయన ఇవ్వగలిగి ఉంటే సీతయ్యగారికి మంచి సంబంధాలు దొరికేవేమో! ఒకచేత్తో కన్నీరు తుడుచు కుంటూ-వివాహ యోగ్యతలేని ముదుసళ్లకు తన ముద్దుకూతుళ్ళను కట్టబెట్టవలసి వచ్చింది. తండ్రి దుఃఖాన్నీ తమ దురవస్థనూ తలచు కొని తల్లిలేని ఆ ఆడపిల్లలిద్దరూ ఎంత వ్యసనపడ్డారో దురూహ్యము.

వృద్ధాప్యములో తనకు మానసికాందోళన కలిగించిన కుమా రుడిమీద వృద్ధుడికి మమకారము నశించలేదు. సంక్షోభజనితమయిన కోపములో-ఏ దురుసు మాటలతోనయినా జాబువ్రాస్తే క్షమించ మనీ, ఒక్కసారి వచ్చి కంటికి కనబడమనీ, అదే తనకు ప్రాణ వాయువనీ బ్రతిమిలాడుతూ సీతయ్యగారు అనంతరావుకు జాబులు వ్రాశాడు. నిత్యమూ తపాలావాడు వచ్చేవరకూ వాకిట్లో కర్ర నానుకొని నిలువబడి, వాడు తమ యింటిని దాటిపోగానే, లోపలికి వచ్చి కళ్లు తుడుచుకునేవాడు.

అంతలో వృద్ధులకిచ్చిన కుమార్తెలలో రెండవ ఆమె వితంతువై తిరిగి తండ్రి దగ్గరికి చేరుకున్నది. కుమారుడికొరకు ఏడ్చి ఏడ్చి దృష్టి మాంద్య మేర్పడిన సీతయ్యగారికి కుమార్తె వైధవ్యము కరవులో అధికమాస మయింది. స్థితిగతులు వివరించి ఎన్ని జాబులు వ్రాసినా అనంతరావు హృదయము కరుగలేదు.

తన సంతానపు వైఖరి తలచుకొని వృద్ధుడు కుమిలిపోయే వాడు. చివరికి సీతయ్యగారు తన జీవితములో అనంతరావును తిరిగి చూడలేకపోయాడు.

తన తండ్రి ఎంత గుణవంతుడు!

తనమీద ఆయన కెంత మమకారము!

వృద్ధాప్యములో తాను ఆయన నెంత దుఃఖ పెట్టాడు?

అనంతరావుకు తండ్రిమాట తలపుకు రాగానే కళ్ళవెంబడి నీళ్ళు రాలేయి. తానెంత కఠినుడు కాకపోతే తనయెడల అమిత వాత్సల్యముచూపిన తండ్రి హృదయాన్ని బ్రద్దలు చేస్తాడు?

ఈ ఆలోచనతో అనంతరావుకు మరిగిన నూనెచుక్క ఒంటి మీద పడినట్టుగా చురుక్కుమన్నది. ఈ బాధలో మరొక భయంకర మయిన ఆలోచన స్మృతిపథాన మెరిసింది 'కొంపతీసి... తండ్రిని దుఃఖపెట్టటములో శేఖరానికి తన పోలిక రాలేదుకదా!'

పుండుమీద కారము చల్లితే మండినట్టు అనంతరావు హృదయము భగభగ మండిపోయింది.

# బామ్మ రూపాయి

చాగంటి తులసి

'ఏమర్రోయి యిల్లు జాగ్రత్త' అని బామ్మ మూడోసారి హెచ్చరించింది.

"వేగిరమే వచ్చేస్తాం. అంతగా కాకపోతే మీ ముగ్గురూ అన్నాలు తినండి. అన్నీ నట్టింట్లోనే పెట్టేను. మజ్జిగ పెద్దసత్తెప్పేలాలో ఉంది. తలుపులు తీసేసి యింట్లో కుక్కని మాత్రం పెట్టకండి" అంది అమ్మ,

"అబ్బ అలాగేనే బాబూ. వెళ్ళిరండి" అని విసుక్కుంది అక్కయ్య.

"రావేమరి పొద్దెక్కిపోతోంది", అని చేతిలోవున్న కొబ్బరి కాయని ఆడించింది బామ్మ.

"పదండి" అని అరటిపళ్ళనీ, ఊదొత్తులనీ పట్టుకుని అమ్మ బయల్దేరింది. వీధిగుమ్మం వరకూ వెళ్ళి 'జాగ్రత్తర్రోయి' అని మళ్ళా కేకేసి అమ్మా బామ్మా శివకోవిలకి దారితీసేరు. ఆవేళ శివరాత్రి.

"ముగ్గురం ఉన్నాం! జాగ్రత్త జాగ్రత్త అని చెప్పేదేవిఁటి? వీళ్ళతోవచ్చిన చిక్కేయిదీ" అన్నాదక్కయ్య.

"ఇంకా గుంటలంకదా అని వాళ్ళలా చెప్తారు". అన్నాడు తమ్ముడు.

"మీరంతే గుంటలు నేనులేనూ?" అని సాగదీసుకుంది అక్కయ్య. దానికీ బామ్మా వాళ్ళతో కోవిలకి వెళ్ళాలని ఉంది. ఇంట్లో ఎవరూ లేరని దాన్ని వదిలేసి మరీ వెళ్ళేరు.

"ఇంతకీ జాగరం మాటర్రా?" అన్నాను,

"నేనుంటాను. మీరొద్దన్నా మానను. మీతోటే ఉందేవిటి? తెల్లవార్లూ లెక్కలు చేసేస్తాను" అన్నాడు తమ్ముడు.

"ఆ చేసేస్తావు! ఏం శ్రద్ధా కుర్రాడికీ! లెక్కలే చేస్తే ఓగంటకే కుక్క ముట్టుకుంటుందిలే" అన్నాదక్కయ్య.

"పాపం అబ్బాయిగారికి నిరుడూ అంతే అయింది" అన్నాను

"ఆఁ ఆఁ మహాచెడ్డ మిమ్మల్ని మట్టుకి కుక్క ముట్టుకోలేదూ? నన్ను పొద్దున్నే ముట్టుకుంటే మిమ్మల్ని సాయంత్రం ముట్టుకుంది. మర్నాడు రాత్రి ఎనిమిదింటివరకూ ఉంటేనే ఉన్నట్టు తెల్సా ? అని తమ్ముడు కళ్ళెగరేసేడు. నిజమే నిరుడు అక్కయ్యా నేనూ సాయంత్రం ఐదింటికే పడకేసీసేం."

"పడిసేప్ మమ్మల్నేం ముట్టుకోలేదు నేనీమాటు అమ్మా వాళ్ళతో పేకాడతాను" అంది అక్కయ్య.

"వెధవ్వేషం మమ్మల్నిద్దర్నీ వదిలేసి పెద్దవాళ్ళతో చేరి పోదువుగాని, అలా వీల్లేదు నువ్వూ మాతోటే ఉండాలి" అన్నాను.

"పోనీలే వెళ్ళమను. పేకే ఆడమను. శివరాత్రినాడు పేకాడితే ఫలంపమిటి? నాబుర్ర!" అన్నాడు తమ్ముడు. వీడొకొక్కప్పుడు నాన్న అనే మాటల్ని టప్పాదించేస్తూ ఉంటాడు. నాన్నకి ఉపోషాలు ఉప్పెట్లూ, పూజలూ పునస్కారాలూ అక్కర్లేదు. అమ్మనీ బామ్మనీ వెక్కిరిస్తూ ఉంటాడు. "మీ ఉపోషాలు బంగారంగానూ! పొద్దున్న తిండి మానేసి దానికి డబుల్‌గా పిండివంటలతో రాత్రి కొట్టేడమా?" అంటాడు నాన్న. శివరాత్రినాడు స్మార్తుల్లో కటికి ఉపవాసం ఉంటారు కాని మా ఆరాధ్యుల్లో అంతే! శివరాత్రీ కార్తీక సోమవారం పద్ధతినే. ఇంక రాత్రి జాగరం అమ్మా పొరుగింటి పిన్నమ్మా మరో

ముగ్గురూకూడి తెల్లవారేవరకూ "ఎత్తడం" దమ్మిడీలువేసి ఆడే స్తారు. అందుకే నాన్న వాళ్ళని వెక్కిరిస్తూ ఉంటాడు.

"లెక్కలు చేసేస్తే వచ్చేస్తుంది పుణ్యం" అని చేతులాడించింది అక్కయ్య. దానికి దేముడూ, దెయ్యం, పూజా పునస్కారాలమీద చచ్చేటంత నమ్మకం.

"పుణ్యం వాడికీ అక్కర్లేదు. నాకూ అక్కర్లేదు. అదేం కడుపు నిండే వస్తువా? కళ్ళకక్కనపడే వస్తువా? లెక్కలుచేస్తే బాగా మార్కులన్నా వస్తాయి." అన్నాను.

"అవునే చిన్నక్కా పెద్దపరీక్షల్లో ఫస్టుమార్కు నాదేచూసుకో" అన్నాడు చూపుడు వేలు ఆడిస్తూ. తమ్ముడికి లెక్కలంటే యిష్టం.

"చేసుకోండి చేసుకోండి లెక్కలే చేసుకోండి నాకేం? నేను పేకే ఆడతాను" అంది అక్కయ్య.

"ఆబ్బే నువ్వు పేకాడకూడదు. ఓం నమశ్శివాయ అని జపం చేస్తూ జాగరం చెయ్యాలి. పుణ్యం వస్తుంది పుణ్యం" అని వెక్కి రించేడు తమ్ముడు.

"వెధవా తాపులు తినగలవు" అని అక్కయ్య కోపంగా చూసింది. ముగ్గురమూ చీడీమీదకొచ్చిన ఎండలోకెళ్ళి కూర్చున్నాం. తొమ్మిది గంటలైంది. ఎండ వేడేక్కుతోంది. శివరాత్రితోగాని చలి శివ శివా అని పోదు.

"అదెవత్తది యింట్లో కొచ్చేస్తోంది?" అని అక్కయ్య వీధి గుమ్మంవేపు చూసింది. ఓ ముసలమ్మ చాలీ చాలని పంచకట్టుకుని ఓ చేత్తో కర్ర పట్టుకుని రెండో చెయ్యి ఓపిల్లాడి భుజంమీద వేసి వస్తోంది. కుర్రాడూ చిన్నవాడే. సరిగ్గా తమ్ముడంతే ఉన్నాడు.

"ముష్టిముండలా ఉంది. వెళ్ళి తలుపు గడియవేసిరా" అని అరిచిందక్కయ్య. తమ్ముడు కదల్లేదు. వాడు పరిశీలనగా ఆకుర్రాడి వేపు చూస్తున్నాడు.

"వెధవ్వి నువ్వెళ్ళకపోతే ఉండిపోతుం దనుకున్నా వేమిటి?" అని అక్కయ్య ఛటీమనిలేచి వెళ్ళబోయింది. అది వెళ్ళేసమయానికి కర్రతో టక్ టక్ మని చప్పుడు చేసుకుంటూ ముసలమ్మా కుర్రాడూ సావిడి దాటి చీడీమీద కొచ్చేసేరు.

"ఇంట్లో కొచ్చేస్తున్నా వేమిటి? అక్కడేఉండు" అని అక్కయ్య కసిరింది.

"మేమూ బ్రాహ్మలమేనమ్మా మీ బామ్మగారికోసం వచ్చేం" అని జవాబు చెప్పింది ముసలమ్మ. నూతిలో మాటల్లా ఆవిడ గొంతుక లోంచీ ఆమాట లివతలకొచ్చేయి. ఆ కుర్రాడు బిక్కమొహం వేసేడు.

కూర్చున్న తమ్ముడు దభీమనిలేచి "నీపేరు రామారావుకదూ?" అని ఆ కుర్రాణ్ణి అడిగేడు. బుర్రూపేడా అబ్బాయి.

"రారా అక్కడే నిల్చున్నా వేమిటి? రండి బామ్మగారూ బామ్మగారూ రండి" అని తమ్ముడు వాళ్ళని ఆహ్వానించేడు. అక్కయ్య మొహం కోపంతో నిండిపోయింది. ఎవరో వెధవల్ని పెద్దవాడిలా మర్యాద చేస్తున్నాడు. గుంటవెధవ యింతున్నాడో లేడో తమ్ముడికి పెత్తనం లావూ! ఆ ముసలమ్మ ఎర్రని సైనుపంచె- పంచెకూడా కాదు సైను గుడ్డముక్క ఒంటికి చుట్టబెట్టుకుంది. ముసుగు బుర్రని సహం వరకే మూసింది. మిగతా సహం ఒత్తుగా ఉన్న పండు వెంట్రుకలతో అసహ్యంగా కనపడుతోంది. కళ్ళూ దవడలూ లోతుకు కూరుకుపోయి ముక్కు ఒక్కటే మొహంలో పైకితేచి కనపడుతోంది. కర్రని కిందపడేసి, పంచని పాదాలవరకూ లాక్కుంటూ ముడిచి పెట్టుకొని ఎండలో కూర్చుంది. కుర్రాడూ ఆవిడ

పక్కనే కూర్చున్నాడు. చిరిగిపోయిన కాకీచొక్కా, పొట్టిగా ఉన్న లాగూ వేసుకున్నాడు. మొహం డోక్కుపోయున్నా కళ్ళు తేటగా కనపడుతున్నాయి.

'అక్కయ్యా ఈ అబ్బాయి ఫుట్‌బాలెంత బాగా ఆడతాడనుకున్నావ్? మొన్న మా స్కూలుకీ వీళ్ళ స్కూలుకీ అయిన పోటీలో ఈఅబ్బాయి చాలాబాగాఆడేడు' అన్నాడుతమ్ముడు. ఆ అబ్బాయి కళ్ళు మిలమిల్లాడేయి. డోక్కుపోయిన మొహంలోకి కళొచ్చింది. అక్కయ్య తమ్ముడు చెప్పేమాటలు వినిపించుకోలేదు. దానికి వీళ్ళని చూస్తే కడుపులో గాబరా పుట్టింది.

"మా బొమ్మ కోవిల కెళ్ళేరండీ" అని చెప్పింది. వాళ్ళని పంపించడానికి చూస్తూ.

"అవును. శివరాత్రికదూ? కోవిల కెళ్ళేరన్నమాట. నాకు దేవుడూ కోవిలాకూడా ఎక్కడ ? వెధవరాత ! తిరిగేసరికే తెల్లారిపోతోంది. ఇలా తిరుగుతూనే వాడికి మొరపెడుతూ ఉంటాను. ఏం చేస్తాను? ఆ ఈశ్వరుడు నన్ను సరిగ్గా చూట్టంలేదు" అని ఉసూరుమంది ముసలమ్మ. కుర్రాడి మొహంలో మళ్ళా దిగులు కనపడ్డాది.

"నువ్వా సెకండ్ ఫారమే కదూ చదువుతున్నావ్?" ఆ అబ్బాయిని తమ్ముడడిగేడు.

"అవును" అని బుర్ర తిప్పేడా అబ్బాయి.

"మా మేష్టారు చెప్పేరు. ఈ అబ్బాయి హైస్కూల్లో చదువుతున్నా నాకీ కుర్రాణ్ణి అందుకే తెల్సు". అన్నాడు తమ్ముడు.

"ఆ మేష్టర్లే నాయినా, ఒడ్డు లాక్కురావడానికి కాస్త చెయ్యేస్తున్నారు. లేకపోతే ఈ గుడుగుడు ప్రాణాన్ని నేనూ వదిలేద్దును." అన్నాది ముసలమ్మ. తమ్ముడూ నేనూ ఆవిడ చెప్పే మాటల్ని జాగ్రత్తగా వింటున్నాం. వీళ్ళ నెలా పంపించడమా అని చూస్తోందక్కయ్య.





"మీ అమ్మగారు పంటొండుతున్నారా?

"మా అమ్మకూడా కోవిల కెళ్ళింది. మేమే ఉన్నాం" వెంటనే చెప్పేసిందక్కయ్య.

"ఇప్పుడప్పుడేరారా?" అని ఆ అబ్బాయి ఆతృతగా అడిగేడు.

"అబ్బే ఇప్పుడెక్క డొస్తారు? వాళ్ళిప్పుడే వెళ్ళేరు. ఐనా మా బామ్మ ముక్కార్తి దీపం వెలిగించాలి. అమ్మవారిపూజ చేయించాలి. చాలా సేపే అవుతుంది" అన్నాదక్కయ్య.

"వెర్రి నాగమ్మవి. కోవిలికెళ్ళింతర్వాత వెంటనే ఎలా వచ్చేస్తారాఁ? అందులోనూ ఇవాళ పర్వదినం. దర్శనం అవడమే కష్టమైపోతుంది." అన్నాది ముసలమ్మ.

"అయితే బామ్మా..." అని సహంలో ఆపీసేడు రామారావు. ముసలమ్మ కుర్రాడి నెత్తిమీద చెయ్యివేసి "ఉండరా నాయనా, కాస్సేపు కూర్చుని అలసటన్నా తీర్చుకోనీ మీ బామ్మగారూ నేనూ స్నేహితులమేనమ్మా. మూడు కోవిల్లలో పురాణం ఒకచోట కూర్చునే వింటాం. మీ బామ్మ పెద్ద జ్ఞాని. నాకన్నీ బోధపరుస్తూ ఉంటారు. ఆవిడున్నారనుకొని వచ్చేను" అన్నాది.

"ఏమండీ బామ్మగారూ, మావాళ్ళొచ్చే వరకూ ఉండండి. లేకపోతే ఏమిటో మాతోచెపితే మా బామ్మకి చెపుతాం" అన్నాను. అక్కయ్య నావేపు ఉరిమినట్టు చూసింది. దానికి నన్నూ తమ్ముణ్ణీ మింగేయాలని ఉంది.

"ఏం చెప్పమంటావమ్మా. నా ప్రారబ్ధం. మీ బామ్మగారికంతా తెల్సును. అందుకే వచ్చేను. ముసిలికాలానికి ముప్పతిప్పలూ పడు ముండా అని దేవుడు నాకూపిరిపోసేడు? బొడ్డూడని గుంటడు ఏం చేస్తాడు? వెనకాతలే వెళ్ళి నలుగురుతో చెప్పుకురాండే ఎలా

కుదురుతుంది'' వాడికి అమ్మనీ, అబ్బనీ అందర్నీ నేనే" అని విచారంగా చెప్పింది ముసలమ్మ.

"అవును మామేష్టారు చెప్పేరు. పాపం రామారావుకి అమ్మా నాన్నా లేరుట!" అని తమ్ముడు జాలిగా బుర్రూపేడు.

"అయ్యో పాపం అలాగా!'' అన్నాను. అక్కయ్యంత కోపంలోనూ కుర్రాడివేపు తేరిపారిచూసింది. రామారావుకు వాళ్ళమ్మానాన్నా జ్ఞాపకం వచ్చి గుడ్లలో నీళ్ళు తిరిగేయి.

"వాడెళ్ళిపోయేడు. తొక్కని నేనుండిపోయేను. కాటికాళ్ళు జాచుకున్న నన్నొదిలేసి ఆ దిక్కుమాలిన దేవుడు వాణ్ణి తన్నుకుపోయేడు. పెద్ద జబ్బన్నాలేదు. ఈ మంగళారం ఊష్టం వచ్చింది. మళ్లా బుధవారం కొట్టేసింది. మాయదారి ఊష్టం. ఆ డాక్టరు వచ్చి పోయేవరకూ ఫర్వాలేదనే అన్నాడు. వాడి మొహం ఈడ్వా! ఏం లేదనే అన్నాడు. వెధవ్వొష్టం నాబాబుని నాబంగారు తండ్రిని పట్టుకుపోయింది. చెట్టంత బాబునీ కడుపున పెట్టుకున్నాను"అని ముసలమ్మ రెండు బెక్కులు బెక్కి కళ్లు తుడుచుకుందికి పంచెని లాక్కుంది. బుర్రమీదున్న సహాంముసుగు జారిపోయి బుర్ర అంతా అసహ్యంగా కనపడుతోంది.

రామారావు చొక్కాతో కళ్ళు తుడుచుకున్నాడు. తమ్ముడు బిక్కమొగమేసేడు. ఆవిడ ఏడుస్తూంటే నాక్కళ్ళంటా నీళ్లు తిరిగేయి. అక్కయ్య బుర్రొంచు కుక్కుర్చుంది.

"ముసిలి ముండని బుద్ధిలేకుండా మీతోచెప్పి మిమ్మల్ని బేజారెత్తించినట్టున్నాను. నా కొడుకు జ్ఞాపకంవచ్చి నేనెవరితో చెప్తున్నానో కూడా మర్చిపోయేనమ్మా. వీడు పుట్టి తల్లిని చంపేడు. పెరిగి తండ్రిని చంపేడు. వాడు దిక్కులేని వాడయ్యేడు. నన్ను నట్టేట్లో ముంచేసేడు. ఇంకా ఏదో అందరూ దయతలుస్తున్నారు

కాబట్టి ఏదో ఇలా నెట్టుకొస్తున్నాను. పీడి కదృష్టం లేకపోయింది నాయనా, వాళ్ళ నాన్న బతికుంటే ఈ ఖర్మంలేకపోయేది. పువ్వు లమ్మిన ఊళ్ళో కట్టెలమ్మవలసి వచ్చింది. ఎంత గౌరవంగా బతికే వాళ్ళం? నిక్షేపంలాంటి ఉద్యోగం. నా కొడుకు కలక్టరాఫీసులో గుమాస్తా! రాజాఅయిన బతుకు. నాకీగతుంటే వాడెలా బతుకుతాడూ? వాడి పిల్లాడికి అన్నం లేకుండా ఉంది" రామారావు వాళ్ళ బామ్మ న్నంటిపెట్టుకుని ముణుకుల్లో తలదూర్చుకున్నాడు. వాడి బుర్ర కొబ్బరిపీచులా ఎగురుతోంది.

"ఎక్కడన్నా చాకిరీచేద్దామన్నా ముసిలితొక్కనైపోయేను. కళ్ళు కనపడవు. మూడు కాళ్ళ మనిషిని ఏంచేస్తాను? పీడికి తెలివి తేటలతోపాటు ఆకలీ ఎక్కువే. ఎంత పెట్టినా చాలదు. అందరూ తలోరూపాయీ, అర్ధాయిచ్చి దయతలిస్తేనే వాడీ పరీక్షలు గట్టెక్కు తాడు'' అన్నాది ముసలమ్మ, చెటంత కొడుకు చచ్చిపోయి ఈ మన వణ్ణి సాకవలసి వచ్చింది. ముసిలి కాలంలో యిలాంటవస్తాస్తే ఏం దారి?

తమ్ముడు ఒక్కదుటున లేచి యింట్లోకి పరిగెట్టేడు అక్క య్యా నేనూ వాడు వెళ్ళినవేపు చూస్తూ ఉండిపోయేం. లోపల పెట్టెలుఈడ్చి డబడబమని చప్పుడు చేస్తున్నాడు తమ్ముడు. 'ఒరేయి' అని ఓగావు కేక పెట్టింది అక్కయ్య. వాడేం చేస్తున్నాడో అది కనిపెట్టేసింది. దానికేకని వాడు లక్ష్యపెట్టలేదు. ఓ చొక్కా, లాగూ పట్టుకుని యివతలకి వచ్చేడు. చొక్కా లాగూవేపు ఆశగా చూస్తూ అక్కయ్య మొహాన్ని తేరిపారి చూసేడు రామారావు.

తమ్ముణ్ణి చూస్తూనే మళ్ళా అరిచిందక్కయ్య 'ఒరేయి' అని 'ఏమేఁ'

'అమ్మ తన్నిగల్డు'

"నా చొక్కా నాలాగా నాయిష్టం. ఎంతుకు తంతుంది?" తమ్ముడు బురల్రి ఝాడించేడు.

"రామారావ్ తీసుకోరా" అని ఆ అబ్బాయి చేతిలో పెట్టేసేడు.

"మీ అమ్మనడిగే యియ్యి నాయనా" అంది ముసలమ్మ.

"ఫర్వాలేదండీ. మా అమ్మేమీ అందు" అన్నాను. అక్కయ్య నా వేపు కొరకొరా చూసింది. దానికి మొదట్నుంచీ వాళ్ళని పంపించేయాలని ఉంది. ఆవిడని కూచోపెట్టి ఆవిడ చెప్పిందంతా విని, యిప్పుడు మేంచేసిన పనికి దానికి ఒళ్ళు మండింది. అక్కయ్యంటే నాకూ తమ్ముడికీకూడా భయంలేదు.

"చిన్నక్కా బామ్మకి నాన్న రూపాయి లిచ్చేసేడుకదూ?" తమ్ముడడిగేడు ప్రతీ నెలా బామ్మకి ఐదురూపాయిలు నాన్న యిస్తూ ఉంటాడు. ఒత్తికి, పత్తికీ బ్రాహ్మడికిచ్చుకోడానికీ, మారాముచేస్తే మాకివ్వడానికీ బామ్మ ఆడబ్బు ఉపయోగిస్తూ ఉంటుంది.

"అవునోర్రియి మాబాగా జ్ఞాపకం చేసేవు. భాగవతంలో మూడు రూపాయిలు పెట్టింది." అన్నాను

"అవి మాత్రం తియ్యకండి బామ్మ బురల్రి బద్దలుకొట్టేస్తుంది" అని అక్కయ్య లేచి నిల్చుంది.

"నా బుర్రేమీ బద్దలు కొట్టదు. నేనెవరి ననుకుంటున్నావ్? నాపేరు తాతయ్యపేరు తెల్సా? బామ్మ నాకు పెళ్ళాం అవుతుంది. మరేం ఫర్వాలేదు" అన్నాడు తమ్ముడు.

"అలా అనకూడదు. తప్పు నాయనా" అంది ముసలమ్మ.

"మా బామ్మే అలా అంటుందండీ" అన్నాడు తమ్ముడు.

"నా మాటవిని అవి ముట్టుకోకు. నీది తాతయ్య పేరైనా బాముల్మారుకోదు" అన్నాదక్కయ్య.

"నన్ను దెబ్బలాడదన్నానా? పోనీ నన్ను దెబ్బలాడితే నీకేం?" అన్నాడు తమ్ముడు.

"మీతోపాటు నన్నూ దెబ్బలాడతారు. చేసేది మీరూ, తిట్లు తినేది నేనూనూ" అన్నాదక్కయ్య.

"నిన్ను తిట్టనివ్వంలే. అమ్మా వాళ్ళూ యిప్పుడప్పుడేరారు. పిళ్ళంతసేపు కూర్చుంటారు?" లోపలకెళ్ళేను అక్కయ్య నా వెనకా తలే వచ్చి మీద పడ్డాది

"ఆగుంటవెధవకి బుద్ధిలేకపోతే పెద్దదానివి నీకూలేదూ?"

"మరే మాయిద్దరికీలేదు మాయిష్టం మేం యిచ్చుకుంటాం" అని భాగవతంలోంది ఓరూపాయితీసుకొచ్చి ముసలమ్మచేతిలో పెట్టేను. అక్కయ్య మిడుతూ మిడుతూ చూడ్డం తప్పించి మమ్మల్నింకేం చెయ్యలేకపోయింది.

"నాతల్లే నాతల్లే మీ అమ్మ కడుపు చల్లగా మంచి మొగుడొచ్చి..." అని దీవిస్తూ "వద్దమ్మా వద్దు. పెద్దవాళ్ళకి చెప్పకుండా యివ్వకూడదు. తప్పు మీబామ్మొచ్చేక అడిగేయిద్దువుగాని. ఆవిడేనా వద్దనరు. ఎక్కడ తీసేవో మళ్ళా అక్కడే పెట్టి" అని రూపాయి పుచ్చుకోకుండా పెట్టేసింది ముసలమ్మ.

"తీసుకోండి. మరేంతఖర్లేదు" అన్నాను.

"నీకు తెలీదమ్మా" అన్నాదావిడ. రామారావు తమ్ముడిచ్చిన చొక్కా లాగునీ కింద పరచి జాగ్రత్తగా మడతపెట్టుకున్నాడు. అవి కూడా పుచ్చుకోవడమా మానీడమా అని సందేహంతో భయపడుతూ ముసలమ్మ పక్క చూసేడు.

"వాటికేం ఫర్వాలేదు. అని నేనిచ్చేనుతీసుకో" అని ధైర్యంగా చెప్పేడు తమ్ముడు.

"మళ్ళా వస్తాం సాయినా మీవాళ్ళతో చెప్పి యిద్దువుగాని" అన్నాది ముసలమ్మ. రామారావు పక్కనున్న కర్రతీసేడు. ముసలమ్మ పెద్ద ప్రయత్నంతో లేచి నిల్చుని కర్రి పుచ్చుకుంది రామారావుకి బట్టలు వదిలేసి వెళ్ళడం యిష్టంగాలేదు. వాటిమీంచి వాడు దృష్టి మరల్చలేకుండా ఉన్నాడు. ముసలమ్మ మాత్రం వొణుకుతున్న కాళ్లూ చేతుల్తోటి కర్రిని తణువుకుంటు గడపదాటి వెళ్ళిపోతున్నాది.

"ఇక్కడే కూర్చోకూడదా?" అన్నాడు రామారావు.

"ఈ పక్కనే మాలక్షుమ్మగారింటికెళ్ళి మళ్ళా వస్తాం" అన్నది ముసలమ్మ.

"వెళ్ళండి వెళ్ళండి మాలక్షుమ్మగారు బాగా యిస్తారు" అని పళ్లు కొరుక్కుంది అక్కయ్య. ముసలమ్మ వీధిగుమ్మంలోకి వెళ్ళిపోయింది గాని రామారావు మాత్రం జాలిగా వెనక్కి తిరిగి చొక్కా లాగూ వేపు మరోసారి చూసుకున్నాడు.

"ఒరేయి రామారావ్ యిలారా" అని మెల్లిగా పిల్చేడు తమ్ముడు.

"యీ చొక్కా లాగూ, రూపాయి తీసుకుపో. మా వాళ్ళతో మేం చెప్పుకుంటాంలే మళ్ళా ఎన్నిసార్లు తిరిగి చస్తావు. ఫో" అని తమ్ముడు చొక్కా లాగూ. రూపాయికూడా వాడిచేతికిచ్చిసేడు. చొక్కా లాగూ చంకలోపెట్టేసుకుని పిడికిట్లో గట్టిగా రూపాయి పట్టుకుని రామారావు ఎక్కడి వాడక్కడే నిల్చుండిపోయేడు. పుచ్చుకోవడమో మానడమో వాడికింకా సందేహంగానే ఉంది.

"పట్టుకు పొమ్మన్నానా? నాతో మాటంటే అంతే. పట్టుకుపో. చిన్న జెల్లకాయమాత్రం యిచ్చుకో." అని వాడి నెత్తిమీద చిన్న జెల్లకాయ కొట్టి గెంటేసేడు తమ్ముడు. రామారావు అవి పట్టుకుని ముసలమ్మ వెనకాతల పరిగెత్తేడు.

మరో అరగంటకల్లా "అమ్మయ్య పంజనం, పంజనం" అంటూ వచ్చిందమ్మ చేతిలో కొబ్బరికాయ చెక్కా, చెక్కనిండా పత్రీ పువ్వులూ కుంకం పొట్లాం పట్టుకొని. కోతిలా అమ్మ చేతిలో ఉన్న కొబ్బరికాయ చెక్క లాక్కున్నాడు తమ్ముడు.

'ఉండరా కోట్టి తలో ముక్కా యిస్తాను' అంది అమ్మ.

"గర్భగుడిలో ఊపిరాతేలేదు. ఏంతోపుళ్ళు ఏంతోపుళ్ళు. దర్శనం అవడమే కష్టమైపోయింది. ఇవతల కొచ్చేసరికి ఈగల్లా చుట్టుకున్నారా ముష్టివెధవలు. వాళ్ళని తప్పించు కొచ్చేసరికి తలప్రాణం తోక్కొచ్చింది హుస్సు. హా పరమేశ్వరా." అంటూ బామ్మ చతికిల్లా పడ్డాది. దభీధభీమని కొబ్బరికాయ చెక్కని నేలనేసి కొట్టి తిండం మొదలెట్టేడు తమ్ముడు.

"అంతా నువ్వు తినీడంకాదు. ఆ ముక్క యిలా యిచ్చెయ్యి" అన్నాదక్కయ్య.

'నీలా అనుకున్నావేమిటి? మీరూ తినండి" అని చెక్క విసిరేసేడు తమ్ముడు.

"అవును నీకు ధర్మబుద్ధి చాలా పెరిగిపోయిం దన్నా దక్కయ్య. అక్కయ్యకొబ్బరిముక్క ప్రసాదం తిని అమ్మ దగ్గిరున్న పువ్వుల్ని కళ్ళకద్దుకొని తల్లో పెట్టుకుంది. కుంకం తీసుకొని బొట్టు పెట్టుకుంది.

"నువ్వూ పెట్టుకోవే" అని నాకూ పువ్వులిచ్చిందమ్మ.

"వాడూ చిన్నదీ నీ మొగుణ్ణి పుణికి పుచ్చుకున్నారు. దేప డనేసరికి మీద పడ్తారు. వాడి చెవులోనూ ఓ పువ్వు పెట్టు" అంది బామ్మ.

"పెట్టుకుంటాను బామ్మా పెట్టుకుంటాను" అని తమ్ముడు చెవిలో పువ్వు పెట్టుకున్నాడు.

"ఏం యివాళ అంత బుద్ధొచ్చింది?" అడిగింది బామ్మ.

"బుద్ధే ఈ వెధవేమొ..." అని ప్రారంభించి ముసలమ్మ రావడం, ఆవిడ కబుర్లూ, చొక్కా లాగూ యిచ్చిన సంగతీ చెప్పేసిం దక్కయ్య.

"అయ్యో అయ్యో ఏచొక్కా లాగేవ్?" అమ్మ అడిగింది.

"నిరుడు పుట్టిన రోజుకి కుట్టించిన జత. చిరుగు పట్టడానికి సిద్ధంగానే ఉన్నాయి" అన్నాడు తమ్ముడు.

"చిరుగు పట్టడానికి సిద్ధంగా ఉన్నాయా? ఏంమాట్రా నాయినా, నిక్షేపంలాంటి బట్టలు ఎవడ్రా యిమ్మన్నాడూ? నీకేం పోయి కాలంరా? తిన్నగా ఉండలేవూ? ఇదెక్కడి పిల్లల్రా బాబూ" అని నెత్తీ నోరూ కొట్టుకుందమ్మ.

"అవేం నిక్షేపంలాలేవు. రెండూ పొట్టయిపోయేయి. నేనవి కట్టుకుని బళ్ళో కెళ్ళడమేలేదు. ఏడాదైపోయింది. అందుకే యిచ్చేసేను. ఆమాత్రం నాకూ తెల్సు" అన్నాడు తమ్ముడు.

"తెల్సు తెల్సు. లొడితెడులేవు. నీ కన్నీ తెల్సు వెధవకానా. ఎందుకురా ఇచ్చేవు? ఓఘుడియ యింట్లో ఉంచితే మంచిపనే చేసేరు. ఏమేఁ నీ బుద్ధేమిశైందే? ఆవెధవిస్తే చూస్తూ ఊరుకుంటావా? పెద్ద దానివికదా? ఆ మాత్రం తెలియొద్దుం? అని బామ్మ అక్కయ్యమీద లేచింది.

"బాగానే ఉంది. నేనేం చేస్తాను? వాళ్ళు నామాట వింటేనా? ఇయ్యరా తమ్ముడూ అని అదీ, అవునే చిన్నక్కా అని వాడూ యిచ్చేసేరు. నేనొద్దంటే నామీద కయ్యిమన్నారు, అక్కడితో వదిలిందీ? నువ్వు భాగవతంలో పెట్టుకున్న డబ్బుల్లోంచి ఓ రూపాయీ యిచ్చేసేరు." అన్నాదక్కయ్య.

"ఆఁఆఁ మీనెత్తి వాయించా నా డబ్బు లెందుకు ముట్టుకున్నారా? అందులో మూడు రూపాయిల చిల్లరుండాలి. గుంటలూ గుంటందాలూ లేవు. ఆ డబ్బుతో సహస్రాభిషేకం చేయిద్దా మనుకున్నాను. ఎవత్తరా ఆ ముసిలి ముండ? దాని ఎదాన్ని పోసీసేరా?" బామ్మ తమ్ముడిమీదకీ నామీదకి వచ్చి చేతులాడిస్తూ దెబ్బలాడ్డం మొదలెట్టింది.

"ఆవిణ్ణి ముండని తిడుతున్నావేమిటి? నీ స్నేహితురాలే. మూడు కోవిళ్ళలో మీ యిద్దరూ ఒక దగ్గిరే కూర్చుని పురాణం వింటారుటా. ఆవిడే చెప్పింది. నువ్వు పెద్ద జ్ఞానివనికూడా చెప్పింది"; అన్నాను.

"ఒక్క రూపాయే యిచ్చేం కావలిస్తే చూసుకో. నువ్వే ఉంటే ఆ మూడు రూపాయిలూ యిచ్చేదానివే. మేం యిచ్చేం కాబట్టి యిలా అంటున్నావు". అన్నాడు తమ్ముడు.

"ఏడిసినట్టేఉంది ఆ ముండ నా స్నేహితురాలేవిఁటి? ఏదో కోవిల్లో కనపడి దాని గోడూ అదీ చెప్పుకుని ఏడ్చింది. అలాగా పాపం అన్నాను అంతే. అలా అని దానికి దానం చేస్తానా? ఇస్తే జేడో పావలో యిస్తాం కాని రూపాయిలూ బట్టలూ యిచ్చేసుకుంటామా? దిక్కుమాలిన వాళ్ళెంతమందిలేరు? అయినా మీ కిలాంటి బుద్ధులు పుడుతున్నా యేమరా? మీ నాన్న రానీ. తొక్క వొలిపించేస్తాను నా డబ్బు తీసీసేరు. మళ్ళా వాడు నాకిస్తాడా?" బామ్మ పెద్ద గొంతుకతో అరవడం మొదలెట్టింది.

"ఈపిల్లలతో నేవేగలేకుండా ఉన్నానమ్మా ఒక్క క్షణం గడప దాటితే యిల్లుతీసి పందిరేస్తారు. వెళ్ళేటప్పుడు జాగ్రత్తరోయి అని చెప్పే వెళ్లేను. అన్నీ వెధవపనులే. ఆయన రానీండి. వెధవలని ఉతికింపించేస్తాను" అన్నాదమ్మ.

"పాపం ఆ ముసలమ్మ మంచిదే. తప్పమ్మా పెద్దవాళ్ళకి తెలీకుండా యివ్వకూడదు, మళ్ళా వస్తాంలే అని వదిలేసి వెళ్ళిపోయింది. ఈ వెధవ కుర్రాడి చేతిలోపెట్టి తీసుకుపో. మావాళ్ళేమీ అనను అని యిచ్చి మరీ పంపించేడు" చెప్పిందక్కయ్య.

"అదోటా? ఆవిడ పుచ్చుకోకపోయినా యిచ్చేసేడు!" అని నోశెళ్ళబెట్టింది అమ్మ.

"వాడిపేరు తాతయ్యదిటా నువ్వేమీ అనవుట. అంచేత మరేం ఫర్వాలేదన్నాడు."

"పేరు తాతయ్యదైతే ఆ గుణాలు వీడికెక్కడున్నాయి? ఈ వెధవ ఆయన పేరూ ప్రతిష్టా నిలబెట్టి అంతటివాడైతే యిహనేం కావాలి" అన్నాది బామ్మ,

"నన్ను తిట్టినప్పుడల్లా తాతయ్యని తిట్టినట్టేలే" అన్నాడు తమ్ముడు.

"ఓరి చచ్చినాడా, నీగూడు బద్దలు కొడతానుండు. మీ అమ్మ అడ్డుపడుతుం దనుకుంటున్నావు కాబోలు". అని తమ్ముణ్ణి పట్టుకోబోయింది బామ్మ. తమ్ముడు ఆవిడకి అందకుండా మండువాలోకి పరిగెత్తేడు.

"నీ గుడ్డలంటే యిచ్చుకున్నావు. ఆవిడ రూపాయెందుకు తీసేవురా? నీ కెన్నిసార్లు చెప్పేను? ఆవిడ జోలికెళ్లొద్దనీ. ఆవిడ వస్తువులు ముట్టుకోవద్దనీ. ఎంత చెప్పినా బుద్ధిలేదు వెధవకి" అని గబగబా లోపలికెళ్ళి భాగవతం తీసుకొచ్చిందమ్మ.

"చూసుకోండి ఎంత తీసేసేడో?" అన్నాది.

"చూసుకోండి మేమేం ఎక్కువ తీసుకోలేదు" అన్నాను.

"వాడురానీ అంతా చెప్పి వెధవని చీరింపించేస్తాను" అని చిందులు తొక్కింది బామ్మ.

"శివరాత్రిపూటా ఓరూపాయి బీదకుర్రాడికిస్తే నన్నడ్డమైన తిట్లూ తిట్టేరని నేనూ నాన్నతో చెప్తాను" అన్నాడు తమ్ముడు,

"నోరుముయ్యి వెధవా దేనికైనా ఒక సబబూ సందర్భమూ ఉండాలి" అన్నాది అమ్మ. అమ్మ అంటున్నాది, ఇంతట్లో నాన్నొచ్చేసేడు.

"త్వరగా వడ్డించెయ్యండి ఆఫీసుకు పోవాలి" అని గబగబా గదిలోకి పోయేడు.

"అదేం వెధవాఫీసో శివరాత్రిపూటా ఆఫీసే" అన్నాదమ్మ.

"నువ్వింట్లో లేకపోతే నీపిల్లల ఆగడం యింతాఅంతా కాదు. నారూపాయి నా కిచ్చేసి నీపిల్లలకేం బుద్ధి చెప్పుకుంటావో చెప్పుకో" అని గది గుమ్మంలోకెళ్ళి పెద్ద గొంతుకతో చెప్పింది బామ్మ.

"దాని రూపాయి యెందుకు తీసేరా? దాంది దాని కిచ్చేయండి" అని తాపీగా అన్నాడు నాన్న.

"ఇహా నెక్కడ రూపాయి? నీకొడుకు ప్రయోజకత్వం. నీ చిన్న కూతురు ప్రయోజకత్వం" అని మొదలెటింది బామ్మ;

"నువ్వేం చెప్పనక్కర్లేదు. నేనే చెపుతాను" అని బామ్మ కడ్డం పడి తమ్ముడే అంతా చెప్పేసేడు.

"అయితే యింతకీ వీడు బట్టలూ రూపాయీ యిచ్చేసేడంటావా?" అంతా విని తాపీగా అడిగేడు నాన్న.

"ఏం బాగుందిరా? ఇచ్చేసేడంటావా అని మెల్లిగా అడుగుతున్నావా? వెధవని పట్టుకు తన్నక. పోనీ వాడి గుడ్డలంటే యిచ్చుకున్నాడు. నా రూపాయెందుకుతీసేడో గట్టిగా అడుగు పైపెచ్చు ఆ ముండ నా స్నేహితురాలంటాడు" అంది బామ్మ.

"నిక్షేపంలాంటి బట్టలు, ఆ వెధవకిచ్చేసేడు. వీడికి మా దగ్గిర బొత్తిగా భయంలేదు" అంది అమ్మ.

"రెండూ పొట్లైపోయేయని చెప్పేనా? ఎన్నిసార్లు చెప్పాలి?" అన్నాడు తమ్ముడు.

"మావాళ్లులేరు. వచ్చేకరండి అని చెప్పవలసింది పోయింది వాళ్ళకి దానాలుచేసేరు దానాలు. చేస్తే చేసేరనుకోడానికి అణావా బేడా? రూపాయికి రూపాయి యిచ్చేసేరు." అన్నాది బామ్మ!

"ఇస్తే ఏం ? నువ్వుకోవిల్లో ఖర్చుపెట్టలేదూ ?" అన్నాడు తమ్ముడు.

"ఒరేయి నువ్విలా ఊరుకోడంనించే నీ పిల్లలిలా నెత్తెక్కుతున్నారు. నా కదంతా తెలీదు నా రూపాయి నా కిచ్చెయ్యి" అన్నాది బామ్మ.

"నీ డబ్బులు నువ్వు భాగవతంలో పెట్టుకున్నావా? అందులోది వాడు రూపాయి తేసీసేడూ? వాడితో చదువుకుంటున్న కుర్రాడైనా కాదూ? హైస్కూల్లో చదువుతున్నాడా?" అని నాన్న యిచ్చినందుకు కోపం వచ్చిందో రాలేదో తెలీకుండా అన్నాడు.

ఆ కంఠస్వరాన్నిబట్టి "వీళ్ళకి బాగాపెళ్ళి కావాలి"అని అక్కయ్య మరో వుల్ల ఎగసన దోసింది.

"రామ రామ ఆ కుర్రాడికి తల్లీ తండ్రి చచ్చిపోయేరు. వాళ్ల

బామ్మ అడుక్కొని చదువు చెప్పిస్తున్నాది. నేనా కుర్రాణ్ణి బాగా ఎరుగుదును నాన్నా. వాళ్ళకో రూపాయీనూ పాతైపోయిన గుడ్డలూ యిస్తే తప్పా? మొన్న పుట్టినరోజుకి కాక అంతకుముందు పుట్టిన రోజుకి నువ్వు కుట్టించేవు. చిరుగుపట్టలేదు కాని ఇరుకైపోయేయి. శివరాత్రిపూటా దేవాలయానికెళ్ళి వాళ్లు డబ్బు తగలెయ్యొచ్చు కాని నేనో రూపాయి దానంచేస్తే తప్పా?" అన్నాడు తమ్ముడు.

'అయ్యో అయ్యో! దేవాలయంలో తగలెయ్యడం ఏమిటా? నోటికొచ్చినట్టు పేల్తున్నావ్, దైవభక్తీ పాపభీతీ లేకపోతే పశువ్వావు తావు' అన్నాదమ్మ.

'బాగానే ఉంది. యిన్నేళ్ళొచ్చేక నీ కొడుకు నాకు నీతులు చెపుతున్నాడు' అన్నాది బామ్మ. నన్నేమిటంటాడో అని నాన్నొచ్చిం దగ్గర్నించి ఓ మూల నాకు భయంగానే ఉంది.

'పెద్దవాళ్ళకి చెప్పకుండా చెయ్యకుండా అలా యివ్వొచ్చునా' అని మందలిస్తూ అన్నాడు నాన్న. టక్కూ టక్కూ కర్ర చప్పుడు చేసుకుంటూ సమయానికి మళ్ళా దిగబడ్డాది ముసలమ్మ. రామారావు మాత్రం ముసలమ్మ వెనక రాలేదు.

'ఈ ముసలమ్మే. మళ్ళా వస్తున్నాది. పుచ్చుకున్నది చాల్లేదు కాబోలు' అన్నాదక్కయ్య.

'ఓసారి దయతలిస్తే యిల్లు గుల్లచేసేస్తారు' అన్నాదమ్మ.

'అక్కగారూ. గుడినుండి వచ్చి సేరూ దేవుడిదర్శనం అయిందా? చిన్న పొరపాటు జరిగింది. పసిపిల్లల కేం తెలుస్తుందీ? మీరు లేనప్పుడొచ్చేను. మీ పిల్లలు మావాడికి బట్టలూ రూపాయీ యిచ్చేరు నేను మళ్ళా వస్తానని చెప్పి వెళ్ళిపోతే మా గుంటవెధవ యిచ్చేరని సంబరంతో నా వెనకాతలే పుచ్చీసుకున్నాడు. మీ చేతుల్తో పుచ్చుకోవాలి కాని పిల్లలిస్తే ఎలాగా? ఇవాళైంది రేపు యింకోటన్న

తుంది' అని ముసలమ్మ గుడ్డలూ రూపాయి పదిలంగా అరుగుమీద పెట్టేసింది.

'అక్కగారూ నా స్థితిగతులన్నీ మీరు బాగా ఎరుగుదురు. మీకు దేవుడు ఏంతోపిస్తే అది మీచేత్తో యిప్పించండి' అని బొమ్మని ప్రార్థ యంగా అడిగింది. మా బొమ్మ గొంతుకలో పచ్చి వెలక్కాయ పడ్డాది. మా అమ్మ గుడ్డప్పగించి అదేపనిగా ముసలమ్మని చూసింది. ఇద్దరూ పల్లెత్తుమాటాడలేదు.

ముసలమ్మ చాలీ చాలని కొంగుని భుజంమీద చిన్న మూట పెట్టుకుంది. ఆ మూటని చూపించి 'ఇదిగో మీ పొరుగింటి మాలక్ష్మ మ్మగారు బియ్యం పట్టుకెళ్ళమన్నారు. ఆవిడ కాబుద్ధి దేవుడు పుట్టిం చేడు. మాకు మూణ్ణాలుగు రోజులుదాకా కడుపునిండా తిండానికి సరిపోతాయి' అని చెప్పింది.

'మీ మనవడేడీ?' అడిగేడు నాన్న

'లోపలికి రారా అంటే మొహం చెల్లక వీధిలో నిల్చుండి పోయేడు' అంది ముసలమ్మ. వీధిగుమ్మం పక్కనుంచీ దొంగలాగ తొంగిచూసేడు రామారావు.

'ఇలారా అబ్బాయి' అని నాన్న పిల్చేడు. వాడు జంకుతూ లోపలి కొచ్చేడు.

'ఇదిగో నీ చొక్కా నిక్కరూ' అని నాన్నే వాడి చేతిలో పెట్టేసేడు. దాగరంత మొహంతో వాడు వాటిని తీసుకున్నాడు.

'అవ్వగారూ ఇదిగో మీరూపాయి'అని ముసలమ్మకి రూపాయి యిచ్చేసేడు.

"మీయిల్లు వెయ్యిమొదళ్లై తండ్రీ ఎప్పటికీ వృద్ధిలోకి రావాలి. పాత్రెరిగి దానం చెయ్యమన్నారు పెద్దలు. నాలాంటి దానికియిస్తే కోటిగుణింతం అవుతుంది అని" ముసలమ్మ ఆశీర్వదిస్తూ రూపాయి పుచ్చుకుంది.

'దీనికోసమని మళ్ళా వచ్చేరా? మంచివారే. ఇవ్వడానికి పిల్లలైతేనేం? మేం అయితేనేం!' అన్నాది బామ్మ.

'ఏగూటి చిలక ఆ పలుకు పలుకుతుంది. మీ బుద్ధే మీ పిల్లల కొచ్చింది' అన్నాది ముసలమ్మ.

'వాళ్ళ తాతగారిపోలికే . దానం ధర్మం వాడికి పుట్టుకతోనే వచ్చేయి' అన్నాదమ్మ. తమ్ముడు ఫకాల్న నవ్వేడు.

పళ్ళు కొరుక్కుంటూ, "ఏవిఁటా వెధవ నవ్వు? నోరుమూసుకు ఉండు" అన్నాది బామ్మ.

'ఇవాళ శివుడు నాలో ఉండి మీకూ మీ పిల్లలకీ మామీద యింత దయ చూపించేడు. మీరుచేసిన సాయం ఎన్ని జన్మలకీ మర్చిపోను. ఇహ నింటికెళ్ళి కుర్రనాగమ్మ కుడ కేసిపెట్టాలి. అక్కగారూ వెళ్ళొస్తాను' అని చెప్పి ముసలమ్మ వెళ్ళిపోతానంది.

'మంచిది వెళ్ళిరండి' అన్నాది బామ్మ.

'మీదయవల్ల సంవత్సరంపాటు మావాడికి గుడ్డముక్కక్కరువు లేదు. మీరు రూపాయిచ్చేరా; మరి రెండు రూపాయిలుంటే ఈ వెల వాడి జీతానికి ఇబ్బందిరాదు. ఏదో మీ అందరూ తలో పిడికెడూ యిస్తూ ఉంటే ఎలాగో ఈడ్చుకొస్తున్నాను. చెట్టంత కొడుకుని పొట్టని పెట్టుకుని ఈ రాత తెచ్చుకున్నాను. వెళ్ళొస్తాను తల్లీ వెళ్ళొస్తాను. బాబూ వెళ్ళొస్తాను. మీమేలు మరిచిపోలేను' అని చెప్పుతూ కళ్ళనిండా నీళ్ళు పెట్టుకొని 'వెళ్ళొస్తాను అక్కగారూ' అని బామ్మతో ఆఖర్నే ఏడుస్తూ చెప్పి చచ్చిపోయిన కొడుకోసం ఏడుస్తూ వెళ్ళిపోయింది.

'ఇచ్చేసేనని అంత హంగామా చేసేరు తిరిగి పుచ్చుకోలేక పోయేరూ?' అన్నాడు తమ్ముడు,

'అదొకటి తక్కువైంది' అన్నాదమ్మ.

'నువ్వూ నీ కొడుకూ కలిసి రూపాయే యిచ్చుకోండి. పది రూపాయిలే యిచ్చుకోండి నా రూపాయి మాత్రం నాకిచ్చీకపోతే ఒప్పుకోను' అంది బొమ్మ.

''నేనిస్తేనేమిటి నా పిల్లలిస్తేనేమిటి అని యిప్పుడే అన్నావు కదులే అమ్మా'' అన్నాడు నాన్న.

'అద్దిగదీ అద్దిగదీ' అని గెంతేడు తమ్ముడు.

'ఎలా తయారవాలో అలా తయారౌతారులే నీ పిల్లలు' అన్నాది బొమ్మ.

'రేపు నేనూ యింకేదన్నా యిచ్చేస్తా నుండండి' అంది అక్కయ్య,

'అలా యిచ్చీడానికి అందరికీ చేతులురావు' అన్నాడు నాన్న.

●

—●—

# విజయ

ముప్పాళ రంగనాయకమ్మ.

4150.

కల్యాణి పెళ్ళి నిర్ణయమైంది. అమ్మకూ నాయనమ్మకుం ఎంతో సంతోషం కలిగింది. "ఖర్చులు కలిసివస్తాయి. విజయ పెళ్ళికూడా ఇందులోనే చెయ్యాలి" అంటూ ప్రారంభించింది నాయనమ్మ.

"నిజమే ఈడేరి ఇంటఉన్న పిల్లకు ఇంకా చదువులేమిటి? దానికీ ఏదో సంబంధంచూసి రెండు పెళ్ళిళ్ళూ కానిస్తేసరి" అంటూ వంతపాడింది అమ్మ. మనస్ఫూర్తిగా ఇష్టం లేకపోయినా విజయ తండ్రి రామారావుగారు ఆడవాళ్ళ మాటలు వినివినీ మనసును సరి పెట్టుకొని విజయకు కూడా సంబంధం చూడటం ప్రారంభించారు. వరుడి ఫోటో తెచ్చి చదువుకొంటూన్న విజయ కళ్ళముందు పెట్టి అభిప్రాయం అడిగేవరకూ తనకు పెళ్ళి ప్రయత్నాలు జరుగుతున్నా యన్న సంగతే తెలీలేదు విజయకు. తెలిసిన క్షణం నిప్పుకణికలా మండిపడింది. ఇప్పట్లో తన చదువు ఆగటానికి వీల్లేదని మొరాయిం చింది. "నాకిప్పుడు పెళ్ళీ గిళ్ళీ ఏం అక్కర్లేదు. చదువుకుంటాను." అని ఖచ్చితంగా చెప్పేసింది. తన విషయాలలో తనకే ఇష్టంలేని పనులు జరగటం విజయ సహించదు. తిరస్కరిస్తే కలగబోయే విషమ పరిస్థితి నెదుర్కోవటానికి ఈషన్మాత్రం భయపడదు. మనసు అంగీక రించని వ్యవహారాలకు ససేమిరా తల వంచదు. పదిహేనేళ్ళ విజయ, అయిదవ ఫారం చదువుతూన్న విజయ ప్రతీ విషయం స్వయంగా ఆలోచించగలదు. సమంజసమైన నిర్ణయాలు చేసుకోగలదు. ప్రతి వ్యక్తికీ స్వంత భావాలూ, ఒక నిర్దిష్టమైన వ్యక్తిత్వమూ ఉండితీరా లంటుంది విజయ. తన భవిష్యత్తు తను మెలకువగా నిర్ణయించుకో గలననే ఆత్మ విశ్వాసం ఉంది విజయలో.

రామారావుగారి రెండో అమ్మాయి విజయ. పెద్దది కళ్యాణి. లక్షణంగా కుదురుగా నాయనమ్మా అమ్మా చెప్పినట్టే విని, "గుణవంతురాలవే కళ్యాణీ" అనే బిరుదు తెచ్చుకొని, ఏడేళ్ళ క్రిందటే ఐదో తరగతితో బడికీ పుస్తకాలకూ వీడ్కోలు చెప్పి. ఈనాటికి కొత్త కొత్త అందాలతో పదిహేడేళ్ళ రాచ చిన్నదానిలా కళ్యాణానికి సిద్ధంగా కూర్చుంది. ఇక మూడోది శారద పదేళ్ళది. అమ్మ దగ్గర అల్లరిచేస్తూ, నాన్నదగ్గర గారాంకుడుస్తూ, నాయనమ్మదగ్గర మారాం పెడుతూ, విజయక్కయ్యదగ్గర భయపడుతూ, పెద్దక్కయ్యతో కబుర్లు చెబుతూ, అన్నయ్యతో బజారుకెడుతూ, అన్నిటి మధ్యా మొక్కుబడిగా నాలుగో తరగతి పావనం చేస్తూంది.

నలుగురి సంతానంలోనూ విజయమైన తండ్రికి ప్రత్యేకమైన అభిమానం! అనురాగం! విజయ వంటి కూతుర్ని కన్నందుకు ఆయన ఎన్నోసార్లు గర్వించిన సమయాలున్నాయి. విజయను చూస్తూంటేనే ఆయనకు ఏదో తృప్తితో మనసు పరవశమౌతుంది. కూతురికి ఏ విషయమైనా నయాన్నేగానీ భయానచెప్పటం ఆయనకు చేతకాదు. తండ్రి హోదాతో బిడ్డలను హడలగొట్టటం, ఆజ్ఞాపించటం ఆయన అభిమతం కాదు. "పిల్లల మనస్తత్వాలు అర్థం చేసుకోగలిగిన తల్లి తండ్రు లుండటం సామాన్యంకాదు" అంటుంది విజయ స్నేహితు రాండ్రతో. చిన్నతనంనుంచీ విజయ భావాలకూ ఇంటి వాతావరణానికీ చుక్కెదురు. తండ్రి చేయూతే విజయ ఒక వ్యక్తిత్వం ఏర్పరుచుకోవటానికి కారణమైంది. కూతురు తెలివైందనీ. చక్కగా చదువుతుందనీ అనుకున్నప్పుడు తల్లి సంతోషిస్తుంది గానీ ఆడపిల్ల అంత గడుగ్గాయిగా తయారుకావటం ఆవిడ ఆమోదించదు. ఇక నాయనమ్మ సనాతనత్వానికీ మనవరాలి అధునాతనత్వానికీ తరుచూ ఘర్షణ జరుగుతూనే ఉంటుంది. శరవేగంతో మారిపోతూన్న కాలానికి విజయను ప్రతిబింబంగా ఊహిస్తూ -"ఎంత తేడా! ఎంత తేడా!" అంటూ ఆశ్చర్యంతో రాయిలా అయిపోతూ ఉంటుంది నాయనమ్మ.

విజయ తేలిగ్గా నవ్వేసి నాయనమ్మ బుజాలు పట్టుకు ఊపి- "నాయనమ్మా! నువ్వు ఉత్త చాదస్తం మనిషివి" అంటూ పకపకా నవ్వేస్తుంది.

ఎంతటి గడ్డు సమస్యకానీ విజయముందు చిల్లిగవ్వ! గడ్డిపరక! పెళ్ళి ప్రయత్నం మేరువులా వచ్చి మీదపడ్డా నిర్లక్ష్యంగా తోసిపారేసింది. విజయ తిరస్కారంతో మరోసారి వాతావరణం వేడెక్కింది. అమ్మా నాయనమ్మా ఉమ్మడిగా యుద్ధానికి సిద్ధమయ్యారు.

"నీ ఇష్టం నీదేగానీ మంచీచెడ్డా, పెద్దాచిన్నా ఏం లేదన్న మాట? ఈ డేరిన దానివి ఇంట ఉన్నావనీ, ఖర్చులో ఖర్చు కలిసివస్తుందనీ లక్షణంగా పెళ్ళిచేసుకోమంటే..."

"అమ్మా! నీలక్షణాలకో నమస్కారం. నువ్వు లక్షణంగా పెళ్ళి చేసేదానికన్నా సలక్షణంగా చదువుకొంటున్నాను. నాకేమీ ఇరవైలూ ముప్పైలూ దాటలేదు. అక్కయ్య పెళ్ళి నా పెళ్ళీ ఒక్కసారి జరిగి నీఖర్చులు తగ్గడానికి మే మిద్దరం ఒక్కసారే పుట్టలేదు. ఇంతకన్నా నేనేం చెప్పను? నాకు ఎంతో చదువుకోవాలనీ, ఏదో కావాలనీ ఉంది, నా కోరిక నీతో కాకపోతే ఎవరితో చెప్పుకోను? నా చదువు మానిపించి ఏదో చేస్తానంటావు. నీ మనస్సెలా ఒప్పిందమ్మా!"

"పోనీ అలాగే చదువుకో. పెళ్ళిచేసుకొని చదువుకొంటున్న వాళ్ళు ఎంతమందిలేరు? ఈమాత్రానికే పెళ్ళి వద్దనటం దేనికేవిజీ?"

"పెళ్ళి చేసుకున్నాక చదువు చదువే నాయనమ్మా! నాకు అది ఇషం లేదు. అయినా నాకేమంత వయసు మించిపోయిందని మీ పట్టుదల? పదిహేనేళ్ళకు పెళ్ళీ - పదహారేళ్ళకు తల్లీనా? నాకేం నచ్చలేదు నాయనమ్మా!"

"ఇదేం విడ్డూరమే పదిహేనేళ్ళుంటే ఇంకా చిన్నతనమా? నా పెళ్ళి తొమ్మిదోఏట జరిగింది. అప్పుడు మీ తాతకు పాతిక నిండాయట. ఈడూ జోడూ సరిపోయిందని నలుగురూ ఎంతో ముచ్చట పడ్డారు." నాయనమ్మ కించిత్తు సిగ్గుపడుతూంటే విజయ సగంలో అడ్డు తగిలి-"నాకు తెలీక అడుగుతానూ, మీ ఇద్దరికీ ఈడూ జోడూ సరిపోతే పైవాళ్ళ కెందుకూ ముచ్చట" అంది చెంపకు చెయ్యి చేర్చుకుంటూ.

"ముచ్చట కాదులే? చూడ లక్షణంగా పదిజరిగినాముచ్చటే. నువ్వు చిన్నతనం చిన్నతనం అంటూ గొడవ చేస్తూంటేనూ చెప్పుకొస్తున్నా... ఆ పెళ్ళి అయిందా ? పన్నెండో ఏట కాబోలు మీ నాన్న కడుపులో పడ్డాడు,"

"అవునవును. నువ్వు వెళ్ళి ఆస్పత్రిలో పడ్డావు. సమయానికి వైద్య సౌకర్యం లేకపోతే పన్నెండేళ్ళ పసితల్లీ బిడ్డా హారోంహారా! ఎందుకు నాయనమ్మా తాతలనాటి చాదస్తాలు చెపుతావు? నీకూ నాకూ రెండుతరాల అంతరం ఉంది. తెలుసా? నీపెళ్ళి తొమ్మిదోఏట జరిగితే నా పెళ్లి పందొమ్మిదోఏట జరగాలి. అంతే!" విజయ లేచి వెళ్ళిపోయింది.

నాయనమ్మ లబో లబోమని మొత్తుకొంది. "చదవ నేర్చిన ఆడదీ, వంట నేర్చిన మగవాడూ ఎందుకు పనికి వచ్చినట్టు? గుంట వెధవ దగ్గర్నుంచీ వాళ్ళ నాన్నే దాన్ని పాడుచేశాడు. కొమ్ము లిచ్చాడు. పొడవటానికి సిద్ధంగాఉంది. ఎన్ని చెప్తుందీ! ఎన్నిచెప్తుందీ! దీని చదువుమండా! ఏం ఉద్యోగం వెలగబెడుతుంది ? దీనికి గుణం గుట్టూ ఎలా వస్తాయి?" అంటూ లక్ష తిటిపోసింది. కాని ఏమీ లక్ష్య పెట్టకుండా విజయ బాత్‌రూంలో నీళ్ళు తోడుకోసాగింది. నాయనమ్మ గబగబా దొడ్లోకెళ్లి-"నీఅగడం మీనాన్నకు చెప్పమంటావులే?" అంటూ అరిచింది కోపం కొద్దీ.

"అక్కర్లేదు నేనే చెప్తాను" అనేసి దభాలున బాత్‌రూం తలుపులు వేసుకొంది విజయ. నాయనమ్మ హతాశురాలై వెనక్కు తగ్గింది. విజయ నెగ్గింది. కూతురి ఉద్దేశ్యం తెలుసుకున్న రామారావుగారు వెంటనే తన ఉద్దేశ్యం మార్చుకున్నారు. మాట మాత్రం కూడా కూతుర్ని మందలించలేదు. విజయ పెళ్లి రద్దయిపోయింది.

కళ్యాణి పెళ్ళి లక్షణంగా జరిగిపోయింది.

♦ ♦ ♦ ♦

పెళ్ళి సంగడిలో కొత్త అల్లుడి సంతోషంలో అంతా విజయ మీద కోపం మరిచిపోయారు. పరిస్థితి చల్లబడిపోయింది. విజయ శారదను మొదటి ఫారంలో చేర్పించింది. ఆఖరి సంవత్సరం అంతా భవిష్యత్తుమీద ఏవో కోరికలతో ఎన్నో ఆశలతో శ్రద్ధగా చదివింది విజయ. లాంఛనంగా తను ప్యాసయ్యాననే ఋజువుకోసం పరీక్షా ఫలితాలు చూసుకోవలసిందే గానీ అంతకు ముందే తాను మంచి మార్కులతో పాసౌతానని విజయకు బాగా తెలుసు.

పరీక్షాఫలితాలు తెలిసినరోజు ఇంటినిండా సంతోషం అవరించుకొంది. నాయనమ్మకూడా విజ్జిని మెచ్చుకొంది. అమ్మ గర్వపడింది. అన్నయ్య ఏవో బహుమతి ఇచ్చాడు. అన్నిటికీ విజయ చిరునవ్వుతో సమాధానాలు చెప్పింది. విజయ మనసు ఎన్నో ఊహలతో నిండిపోయింది-ఇక తనేంచెయ్యాలి? ఇప్పటికి ఒకఘట్టం గడిచింది. స్కూలు చదువు ముగిసిపోయింది. కాలేజీలో చేరటమా? నాన్నగారు ఏమంటారు? తనకు చదువు చెప్పిస్తే వృథాఎప్పుడూ కాదు. ఎంత కష్టమైన చదువు కానీ తను చదవలేదనే జంకులేదు. తను చదవాలి. ఎంతో చదవాలి. అంతులేకుండా చదవాలి. చదివి చదివి చదువు అంటే విజయ అన్నట్టు కావాలి కాలేజీలో చేరాలి. డాక్టర్ కావాలి. ఏం కాలేదా? ఈ డాక్టర్లంతా ఒకప్పుడు తనలా స్కూల్ ఫైనల్ వాళ్లు

కారా?... విజయ ఎన్నో ఆలోచనలు చేసింది. ఆ పగలంతా చాలా ముభావంగా తిరిగింది. రాత్రి నాన్నగారు భోజనంచేసి వెళ్ళి వీధి గదిలో చదువుకొంటూ కూర్చుంటే విజయ కొంతసేపు తటపటాయించి వెళ్ళి తండ్రి దగ్గర కూర్చుంది.

"అన్నం తిన్నావా అమ్మా"

"తిన్నాను నాన్నా!"

కొంత విరామం... "నీ స్నేహితురాళ్ళు అంతా పాసయ్యారా?"

"పాపం సుశీల ఫెయిలయ్యింది."

"............"

"నాన్నా విమల కాలేజీలో చేరుతుందట" విజయ తండ్రి మొహంలోకి సూటిగా చూడలేకపోయింది. తలదించుకునే అంది. కాని ఆ తండ్రి మొహం ఎంత చిన్నబోయిందో కూతురు చూసి ఉంటే ఆపైన సంభాషణ పెంచగలిగేది కాదేమో! నాన్నగారి మౌనం విజయను ప్రోత్సహించింది. నాన్నా! కాలేజి సీటుకు దరఖాస్తు పెట్టనా?" ప్రతి మాటలోనూ ప్రతి అక్షరంలోనూ శతవిధాలా తన కోరిక తెలియజేస్తూ తల ఎత్తి తండ్రి కళ్ళలోకి చూస్తూ మనసు బయటపెట్టింది విజయ. నాన్నగారి మొహం మరీ కాంతి విహీనమై పోయింది. విజయ హృదయం కొట్టుకులాడింది. ఆశ నిరాశలమధ్య ఊగిపోయింది. కళ్ళు ఎత్తి అలాగేచూస్తూ ఉండిపోయింది!

"అమ్మా! విజయా! నువ్వు చిన్నదానివేగాని నన్ను క్షమించు తల్లీ!"

"నాన్నా!" ఆశ్చర్యంతో అతి నెమ్మదిగా అంది విజయ.

"అవునమ్మా! నువ్వు ఇలా అడగటానికి వస్తావని నాకు తెలుసు. నువ్వు పరీక్షలు రాసింది మొదలు నేను ఆలోచించని రోజులేదు. నీ

అభివృద్ధికీ నీమేధాసంపత్తికీ మనసారా సంతోషించేవాళ్ళు ఎవరైనా ఉంటే మొదటి వ్యక్తిని నేనే. నీలో అపారమైన తెలివితేటలు ఉన్నాయి. అంతులేని శక్తిసామర్థ్యాలు ఉన్నాయి. అన్నీ నేను అర్థం చేసుకున్నా నమ్మా! కానీ తల్లీ..." నాన్నగారు క్షణకాలం ఆగారు. విజయ జరగబోయేదంతా సున్నితంగా అర్థం చేసుకొంది. గుండెలు బద్దలైపోకుండా పట్టుకొంది.

"చూడమ్మా విజయా! మన ఆర్థికస్థితి నీకు తెలీదా? అన్నయ్యకు కాలేజీ చదువులు చదివించలేక కదా కోర్సుకు పంపాము? ఇంతకన్నా నీకు నేను ఏమీ చెప్పలేను. నువ్వు ఆలోచించి చూడు విజయా! ఎంతమాత్రం అవకాశాలు ఉన్నా నీ అభివృద్ధిని ఆటంక పరుస్తాననుకుంటున్నావా తల్లీ! నీవంటి కూతుర్నిపొంది కూడా సలక్షణంగా పెంచుకోలేని దౌర్భాగ్యుణ్ణి విజయా!" నాన్నగారు అరచేతిలో నుదురుపెట్టుకొని బాధగా రాసుకొంటూ మరి మాటలాడలేనట్టు మౌనం వహించారు, నాన్న అన్న ప్రతీ మాటనూ శ్రద్ధగా గంభీరంగా వింది విజయ. అర్థం చేసుకోటానికి ప్రయత్నించసాగింది. పేకముక్కలమేడ చెదిరిపోతూంటే చూడగలిగింది.

నాన్నగారు విజయ తల నిమురుతూ-"విజయా నీకు బాధగా ఉంది కదూ? నన్ను ఏం చెయ్యమంటావు తల్లీ?" అంటూంటే విజయ సహించలేకపోయింది. నాన్నా! అంతా నీయిష్టం నాన్నా! నేను వెళ్తాను" అనేసి లేచి చరచరా వెళ్ళిపోయింది. తండ్రి కళ్ళు మూసుకొంటే నీటి బొట్లు రాలిపడ్డాయి.

విజయ ఏడిచింది. ఊహ తెలిశాక తొలిసారిగా ఏడిచింది. ఎన్ని ఆశలు! ఎన్ని ఆశయాలు! ఎన్ని ఆలోచనలు! ఎంతవిద్యాకాంక్ష! ఎన్ని నమ్మకాలు!...అన్నీ ఏంకావాలి? ఎలాతీరాలి? భగవాన్! ఏమిటీ దౌర్భాగ్యం? ఏదికావాలని దేవిరిస్తే అదేకరువుచేస్తావు? అక్కరలేదని అసహ్యపడితే అంటకడతావు? ఇదా న్యాయం? ఈ కాంక్ష ఎలా తీరాలి? ఈ

బాధ ఎలా పోవాలి?... విజయ ఎంతోసేపు ఏడ్చింది. ఏడిచాననీ ఏడుస్తున్నాననీ - అర్థమైనప్పుడు అదిరి పడింది. పిరికిగా ఏడవట మనేది విజయ దృష్టిలో హీనం. మనిషికి కన్నీళ్లు రానివ్వని మనో ధైర్యం కావాలి ...... మనిషికి కన్నీళ్ళను ఆపుకోగలిగే అంత శక్తి పెరగాలి. ఆ క్షణంవరకూ విజయ అలానే అనుకొనేది. ఏడిచే వాళ్ళనుచూస్తే చిరాకుపడేది. ఈ ఆడవాళ్ళు అస్తమానూ ఎందుకు ఏడుస్తూ ఉంటారు? ఆడవాళ్ళం సుమా అని ఋజువు చేసు కోటానికా? ఏడవకుండా భరించగలిగే సామర్థ్యంలేకనా? అందుకే ఆడదంటే అందరికీ తేలిక అభిప్రాయం. ఏడవటం మహా చెడ్డగా భావించే విజయ-కన్నీళ్ళను అసహ్యించుకొనే విజయ-ఏడ్చింది. తనివి దీరా ఏడ్చింది, కాని విజయ స్వానుభవంతో ఒక నగ్నసత్యం తెలుసు కోగలిగింది. జీవితంలో ప్రతిక్షణమూ సిద్ధాంతాల ప్రకారమే గడ వదు. ఏ నిమిషమైనా సహజతలకు లొంగిపోవలసి ఉంటుంది.

విజయ ఆశలకు ఆటంకం కలిగింది. మనసులో రేగిన ఉద్రే కాన్ని కన్నీరు కొంతవరకూ కడిగివేసింది. కళ్ళు మూసుకొని నుదుటిమీద చెయ్యివేసుకు పడుకొంటే నాన్నగారు బాధతో నుదురు రాచుకోవటం కనిపించింది.

"నువ్వు చిన్నదానివేగాని నన్ను క్షమించు తల్లీ" ... నాన్న ఎంత బాధపడ్డారు!- "నాన్నా! నువ్వే నన్ను క్షమించాలి తాహతు తెలుసుకోలేని కోరికలు కోరి నిన్ను క్షోభపెట్టాను. ఇది నా దుర దృష్టంగానీ నువ్వు చెయ్యగలిగిందేమీలేదు. నీమీద నాకు కోపంలేదు" అని వెంటనే వెళ్ళి నాన్నకు చెప్పాలనిపించింది.

అవును నాన్నమాత్రం ఏం చెయ్యగలడు? అన్నయ్య కోర్సు పూర్తి కావాలి. అక్కయ్యకు పురుడూ పుణ్యాం జరుపుతూ ఉండాలి. శారదను స్కూలుఫైనలు వరకేనా చదివించాలి. ఈలోపు ఇంటి ఖర్చులన్నీ సర్దుకురావాలి. చెయ్యబోయే పెళ్ళిళ్ళకు కట్నాలు కూడ బెట్టాలి. వీటి కన్నిటికీ జతగా తన కాలేజీ చదువా? ఎవరికి సాధ్యం?

ఒక్క వ్యక్తి సంపాదన, ఒక గుమస్తా రాబడి-ఎన్ని పనులు జరుపు తుంది? పెద్దవాళ్ళ కష్టసుఖాలు గమనించకుండా గాలిలో మేడలు కట్టుకోవటం, తీర్చుకోలేని కోరికలు పెంచుకోవటం వివేకమా? ఇంత మాత్రం చదువగలిగినందుకు సంతోషించకూడదా?.... విజయ గం టల తరబడీ రోజుల తరబడీ ఆలోచించింది. ఒక్క ఆలోచించటం తప్ప తను చెయ్యగలిగిందేమీ లేదనుకొంది. ఒకనాడు తండ్రి స్వయంగా పిలిచి-"నీ చదువు విషయం ఏమనుకుంటున్నావమ్మా! నీకు బాధగావుంటే చెప్పు. ఎలాగో తంటాలు పడతాను" అన్నారు. "వద్దు నాన్నా నువ్వేమీ బాధపడవద్దు. నేను సంతృప్తి పడటం నేర్చు కుంటాను" అంది నెమ్మదిగా.

నిజంగానే విజయ సంతృప్తి పడింది. కాలేజీ విషయం మరిచి పోయి మనసు నిర్మలం చేసుకోవటానికి ప్రయత్నించింది. మరొక రకమైన బాధ్యతలు మీదపెట్టుకొని సంతోషంగా ఉండాలని నిర్ణ యించింది.

• • • •

మూడు సంవత్సరాలు దాటిపోయాయి. పరికిణీలు వదిలి చీరల్లో ప్రవేశించిన విజయలో అందం హుందాతనం అధికమయ్యా యి. గడిచిపోయిన కాలమంతా విజయ ఎన్నో విధాల సద్వినియోగ పరిచింది. హిందీ పరీక్షలు పాసై ధారాళంగా మాట్లాడటం నేర్చు కొంది. లైబ్రరీ మెంబరై అంతులేనన్ని గ్రంథాలు చదివింది. రేడి యో గాయకురాలుగా ఘనమైన ఖ్యాతి పొందగలిగింది. శాస్త్రీయ సంగీతం అంటే ఏమీ ప్రవేశంలేకపోయినా విజయ ఎప్పుడూ మధుర కంఠంతో గాలిపాటలు పాడుకొంటూ కూనిరాగాలు తీసుకొంటూ ఉండేది. విజయ రేడియో నాటకాల్లో నటిస్తానంటే నాయనమ్మ తిట్టి పోసింది. కాని మొదటిసారి మనమరాలుపాడిన పాట రేడియోలో వింటూ సంభ్రమాశ్చర్యాలతో ముక్కుమీద వేలువేసుకొంది. "ఎం

తైనా విజ్జి తెలివైంది సుమీ" అంటూ గుసగుసలాడింది కోడలు చెవిలో. విజయ తను సంపాదించిన డబ్బుతో స్వయంగా రేడియో కొన్నప్పుడు నాయనమ్మ తనను తనే తిట్టిపోసుకుంది. మనవరాలి బుగ్గలు నిమిరి ముద్దుపెట్టుకొంది.

విజయ ఏదో కుతూహలంకొద్దీ చిన్నచిన్న కథలు రాయటం కూడా ప్రారంభించి పేరు తెచ్చుకుంది. అక్కడితో కొంత నమ్మకం కుదుర్చుకొని తన రచనాశక్తిని అభివృద్ధి చేసుకోవాలని సంకల్పించుకొంది. అన్నిటితోపాటు నాయనమ్మ దగ్గర మడికట్టుకొని పచ్చళ్లు నూరటం, అన్నాలు వార్చటం, దేవుడిముందు నైవేద్యం పెట్టడం కూడా తెలుసుకొంది. విజయకు తన బాధ్యతలన్నీ చాలాతృప్తి కలిగిస్తున్నాయి. ఎప్పుడూ ఆనందంగా హడావిడిగాఉండే విజయ అంటే ఇంట్లో అందరికీ ప్రాణమే.

ఒకనాడు నాయనమ్మకు తటాలున ఏదోగుర్తువచ్చింది. 'అవుతే విజ్జీ, నీకింకా పందొమ్మిదోఏడు రాలేదటే?' అంటూ ఆరా తీసింది. విజయ ఏదో గ్రహించినట్లు చిరునవ్వు నవ్వి-"వెళ్ళిపోతున్నదికూడా. ఆ సంగతి ఇప్పుడెందుకు నాయనమ్మా;'' అంది.

"ఎందుకేమిటే? ఇంకా ఎన్నాళ్ళిలా ఉంటావు? ఎన్ని అందాలు ఉన్నా ఆలోటు లోటేతల్లీ! ఈడు వచ్చిన ఆడదానికి ఆ మూడు ముళ్లూ పడితేగానీ...

"అబ్బబ్బ! నాయనమ్మా! మూడుముళ్ళు వేయిస్తావో. ముప్పై ముళ్ళువేయిస్తావో ఇక అంతా నీఇష్టం. నా అభ్యంతరం ఏమీలేదు" అంటూ నవ్వింది విజయ.

నాయనమ్మ గంపెడు సంతోషంతో పెళ్ళి పెద్దరికం స్వీకరించింది. ఆ క్షణంనుంచీ ఎన్ని సంబంధాలు చూసినా విజ్జీకి తగ్గవిగా నాయనమ్మకే సంతృప్తి కలగటంలేదు. "దీని పెళ్ళి ఒక సమస్యావుతుందా ఏమిటే?" అనుకొంది నాయనమ్మ

* * * *

ఓనాడు రామం రేడియో స్టేషన్‌లో విజయకు తనవెంట వచ్చిన స్నేహితుడు శ్రీనివాస్‌ను పరిచయం చేశాడు. విజయ చిరునవ్వుతో 'నమస్తే' చెప్పింది. శ్రీనివాస్ ప్రతినమస్కార ఋణం తీర్చుకున్నాడు.

"విజయా! ఇంతవరకూ ఇటు మనమిద్దరం అటు మేమిద్దరం విడివిడిగా స్నేహితులం. ఇప్పట్నుంచీముగ్గురం ఉమ్మడిగా స్నేహితులం. అవునా"! అంటూ నవ్వాడు రామం.

"అవునన్నయ్యా!" అంది విజయకూడా నవ్వుతూ.

ఆరోజు విజయ రామం కలిసి పాడుతుంటే శ్రీనివాస్ ఆశ్చర్యంగా విన్నాడు. ప్రోగ్రాంకాగానే సెలవుతీసుకొని వెళ్ళిపోయాడు. విజయ ఇంటికి బయల్దేరుతూంటే "విజయా, నేనూ అలే వస్తాను. నీతో కొన్ని విషయాలు మాట్లాడాలి." అంటూ విజయను అనుసరించాడు రామం.

"ఏమిటి చెప్తానన్నావ్?" అంది విజయ దారిలో

"ఇలా నడుస్తూ కాదు. చాలామాట్లాడాలి. కాస్సేపు పార్కులో కూర్చుందాం పద" అన్నాడు రామం.

"అంత గొప్ప విషయమేమిటి బాబూ? సరే పద" అంటూ చెట్లలోకి దారితీసింది విజయ. "ఇక ఇప్పుడు చెప్పు వింటాను" అంది పచ్చగడ్డిలో చతికిలబడుతూ, రామం ప్రక్కన కూర్చున్నాడు.

"ఇందాక పరిచయం చేశాను. శ్రీనివాస్‌ని... అతణ్ణిగురించి నీ ఉద్దేశ్యం?"

"బావుంది. మధ్య అతన్ని గురించి నా ఉద్దేశ్యం ఏమిటి?"

"అతని కింకా పెళ్ళికాలేదు. ప్రస్తుతం అదే సమస్యలో ఉన్నాడు."

"ఉండనీ నాకెందుకు?"

"నీ గడుసుదనం తెలుసులెద్దూ. ప్రస్తుతం నువ్వూ అదే పరిస్థితిలో ఉన్నావు. అందుకే నిన్ను వాడికి చూపించాను."

"అలాగా? ఎవరినడిగి నన్ను చూపించావు?"

"నీకు చక్కటి పెళ్ళికొడుకును చూడమని మీ నాయనమ్మ నెల్లాళ్ళక్రిదంటే చెప్పిందే!"

"ఓహో! అయితే పెళ్ళిపెత్తనమంతా మీరిద్దరేచెలాయిస్తున్నారన్నమాట" అంటూ నవ్వింది విజయ.

"నేను హాస్యానికి చెప్పటంలేదు విజయా? నిజంగా మీ ఇద్దరికీ ఇష్టమైతే ఈ పెళ్ళి జరిపించాలని నా ఉద్దేశ్యం. శ్రీనివాస్ ఎం. ఏ. పాసయ్యాడు. లైఫ్ ఇన్స్యూరెన్స్ డిపార్ట్ మెంట్‌లో పనిచేస్తున్నాడు. సభ్యత, సంస్కారాలు తెలిసినవాడు. 'ఊ'అంటే కోటిమంది అమ్మాయిలు, వేలకొద్దీ కట్నాలు! కాని వాడికాదృషిలేదు. ఎంతమందిని చూసినా వాడికి సంతృప్తి కలగడంలేదు. ఇంటా బయటా వాడి పెళ్ళి గురించి గొడవే వాడికీ వయస్సు వచ్చింది కాబట్టి పెళ్ళిచేసుకోవాలని, పెళ్ళాంతో హాయిగా సినీమాలూ-పికార్లూ-జల్సాలూ-ఝామ్మని తిరగాలని ఉంది. కాని అసలు పెళ్ళికూతురుదగ్గరే వచ్చిపడింది చిక్కు. తొందరపడి ఏనిర్ణయమూ చేసుకోలేకపోతున్నాడు. తను పెళ్ళిచేసుకుంటే అది సుఖమయం అవుతుందో కాదో అనేదే వాడి భయం" రామం ఆగాడు.

విజయ నవ్వింది "బావుంది. అయితే ఏంచేస్తాడట?"

"మరి విను. అదేకదా నీకు చెప్పేది. మొన్న నొకనాడు మా యింట్లో కూర్చుని నేనూ, వాడూ మీ వదినా ఏవేవో కబుర్లు చెప్పుకొంటున్నాం. అందులోనే వాడి పెళ్ళి ప్రసక్తి వచ్చింది. వాడు తన మనసులోని విషయం ఏదోచెప్పాడు. దానికి మీవదిన నీలాగే నవ్వ

తూ 'బావుంది అన్నయ్యా అంతా నీలా భవిష్యత్తు తలచుకొని భయ పడతారా? నీకంత భయమైతే పెళ్ళికూతురుతో నీ మనసులో విష యాలన్నీ ముఖాముఖి మాట్లాడి నీకు నచ్చితేనే పెళ్ళిచేసుకోరాదూ?' అంది హాస్యంగా.

"అమ్మో! శ్రీనివాసులుగారికి స్వయంవరం కూడానా? జాగ్ర త్తరోయ్! ఈ రోజుల్లో అమ్మాయిలు మరీ గడ్డుగా ఉంటున్నారు" అంటూ నవ్వాను నేను. మాతోపాటు వాడుకూడా నవ్వాడు. ఆ తర్వాత వాడేం ఆలోచించుకున్నాడోగానీ అదే పట్టుపట్టి కూర్చు న్నాడు. "పెళ్ళిచూపులంటూ ఓ నిమిషంపాటు మొహాలు చూసు కున్నంతమాత్రం ఏం తెలిసిపోతుంది? నేను స్వయంగా వధువుతో మాట్లాడి పెళ్ళిచేసుకుంటాను. అంతే" అంటూ చెప్పుకొచ్చాడు. వాడి సమస్య గురించి ఆలోచిస్తే చటుక్కున నువ్వుగుర్తుకొచ్చావు విజయా! ఇన్నాళ్లూ నిన్ను తెలిసిఉండి కూడా వాడికీ సంగతి చెప్పనందుకు నన్ను నేనే తిట్టుకున్నా ననుకో. వెంటనే నాఊహ మీ వదినకుకూడా చెప్పాను. "నిజంగా ఈ పెళ్ళి జరిగితే ఎంతో అందంగా ఉంటుంది" అంది. అందుకే వాణ్ణి ఏదోమిషమీద తీసుకొచ్చి నిన్ను చూపించాను ఇంతవరకూ వాడికి ఈ సంగతి చెప్పలేదు. ముందు నీ ఉద్దేశ్యం తెలుసుకొని వాడికి చెప్పాలనుకుంటున్నాను. ఏమంటావు? అసలు వింటున్నావా నేను చెప్పింది?" అన్నాడు రాము ముగిస్తూ.

"ఆ.ఆ. వినకేం? అప్పుడే అంతపరధ్యాన్నంరాలేదులే" అంటూ నవ్వి-"ఇంతకూ నన్నేం చెప్పమంటావ్?" అంది.

"శ్రీనివాస్ నీకు నచ్చాడా?"

"ఛ పోదూ!"

"చెప్పు విజయా! అన్నయ్య దగ్గర చెల్లి సిగ్గుపడుతుంతా?"

"నచ్చితే నన్నేం చెయ్యమంటావ్?"

"అతనితో మాట్లాడుతావా?"

"ఏమిటి మాట్లాడేది?"

"అతనే అడుగుతాడు. నువ్వుచెప్పు నీకు కావలసింది అడుగు. అతను చెప్తాడు. దాదాపు ఇంటర్వ్యూ అన్నమాట"

"బావుందిలే."

"చెప్పు మరి"

"ఎక్కడ మాట్లాడేది?"

'మీ ఇష్టం. మా ఇంట్లో అయినాసరే! ఈపార్కులోనైనా సరే!'

'నాకు సిగ్గు బాబూ! వదిన హాస్యం చేస్తుంది!'

'ఛ! దానికి మాత్రం తెలీదేమిటి? నీకా భయం ఏమీ వద్దు.'

'అయితే ఈ సంగతి నాన్నకు చెప్పవద్దా?'

'ముందే వద్దు. ఇంటర్వ్యూ కానీ! మీరు పరస్పరం ఇష్టపడితే తర్వాత నేను చెప్తాను, పెద్దవాళ్ళద్వారా నిశ్చయంచేద్దాం. ముందే చెప్పేస్తాం అనుకో. ఒకవేళ ఏకారణంచేతనైనా మీ ఇద్దరికీ ఇష్టం లేకపోతే అప్పుడేం బావుంటుంది?'

'అవునులే. ఈ సంగతి నాయనమ్మ వింటంటే తిట్టిపోస్తుంది."

'అయితే. నువ్వు సిద్ధం అన్నమాట. ఈ రాత్రే వాడికి అంతా చెప్తాను. రేపు ఏ కబురూ నీకు చెప్తాను."

'సరేలే. ఇక పోదాం. గొప్ప కబురు అందజేశావు.'

'కాదేమిటి మరి?' అంటూ లేచాడు రామం.

• • • •

విజయ దాదాపు ఆరాత్రంతా ఆలోచనలతో జాగారంచేసింది. శ్రీనివాస్‌తో ఇంటర్వ్యూ! తలచుకొంటూన్నకొద్దీ ఆశ్చర్యం కలుగు

తూంది. విచిత్రం అనిపిస్తోంది. శ్రీనివాస్! అందమైన పేరుకదూ? తగినట్లే సుందరమైన రూపం! కుడిచేతి పర్సుమడతలమీద ఎడంచేయి దండకట్టుకుని నించుంటే వాచీగ్లాస్ తళతళా మెరుస్తూ ఠీవిగా-దర్జాగా-అబ్బా! ఏం హుందాతనం! సూటిగా నిశితంగాచూసే చురుకైన కళ్ళూ! పాపిడిలేకుండా మేడమెట్లమాదిరి పైకి-పైపైకి-పోయే కారు నల్లటి జుట్టు!-ఎంతైనా నిజమైన సౌందర్యం మగవాడిదే-శ్రీనివాస్! అతురాలా శ్రీనివాస్! వధువుతో ఇంటర్వ్యూ కోరుతున్నాడా? ఏం అడుగుతాడటా? అంత దర్జాగల వ్యక్తిని ఏం సమస్యలు బాధిస్తున్నాయి? ఈఇంటర్వ్యూతో అవి అన్నీ పరిష్కారంచేసుకుంటాడా?.. తను అతనితో- ఏకాంతంగా మాట్లాడుతుందా?... అసలు మాట్లాడగలదా? అతనికి నచ్చితే...?పెళ్ళి చేసుకుంటాడా? ఎంత విడ్డూరంగా ఉందీ విషయం! వివాహం నిర్ణయించుకోవటం ఇంత సులభమా? విజయకు శ్రీనివాస్‌నూ అతని నిర్ణయాలను తలచుకొంటూన్నకొద్దీ సిగ్గుకన్నా సంభ్రమం ఎక్కువ కాసాగింది. పెళ్ళి అంటే అతనికి ఎంతటి పవిత్రభావంఉందీ! అవునుకదూ? పెళ్ళి ప్రతివ్యక్తికీ తప్పనిసరి సంఘటన, దాంపత్యం రెండు జీవితాలకు అపురూపమైన బాంధవ్యం! కష్టసుఖాలను నిర్ణయిస్తూ నిండు జీవితాలను పరిపాలించేది పెళ్ళి! అందుకే అతను ఇంతగాఢంగా నిర్ణయించుకున్నాడేమో! "భగవాన్ చిన్నదాన్ని నేను చేసే ఈ సాహసాన్ని మన్నించి ఆశీర్వదించు!"

♦ ♦ ♦ ♦

విశాలమూ పరిశుభ్రమూ అయిన గదిలో శ్రీనివాస్ ఒంటరిగా సోఫాలో కూర్చుని ఉన్నాడు. మనసంతా ఆలోచనలు అల్లిబిల్లిగా అల్లుకుంటున్నాయి. నిండు జీవితానికి ప్రాతిపదిక వంటి కళ్యాణం నిర్ణయించుకొనే ఈ సమయం-భవిష్యత్తును శాసించే ఈ ఘడియలు... ఏమౌతుంది? విజయ వంటి అమ్మాయినే నేమో తాను కోరుతున్నది.

విజయలో ఏదో విశిష్టత గోచరించింది తనకు- ఈనాటికి తన కోరిక లన్నీ రూపు ధరించి విజయగా....

'నమస్తే!'

ఆలోచనల్లో కలవరపడ్డాడు శ్రీనివాస్! విజయ గుమ్మంలో నిలబడిఉంది. చిరునవ్వుతో లేచి నిలబడి- 'రండి' అంటూ గౌరవపూర్వకంగా ఆహ్వానించాడు. విజయ వచ్చి టేబుల్ ప్రక్కన కుర్చీలో కూర్చుంది. శ్రీనివాస్ విజయ వేషభాషలు చాల సున్నితంగా పరిశీలించసాగాడు. విజయ అందమైంది. నిరాడంబరంగాఉంది. క్రిందట ఘడియవరకూ ముక్కూ మొహం ఎరగని ఒక పరాయి వ్యక్తి ఎదుట తన వివాహ విషయాలు సంప్రదించుకోవటానికి కనీసం కళ్ళలో కలవరపాటైనా కన్పించనీయకుండా గంభీరంగా కూర్చుంది. ఏమైనా అలంకరించుకొందా? అనిపించలేదు. తెల్లటి నుదుట సన్నని కుంకుమ రేఖ దిద్దుకొంది. నల్లటి బారెడు జడలో ఒకేఒక ఎర్రగులాబీ ఉంచుకొంది. మృదువైన చేతులకు నిండుగా గాజులు వేసుకొంది. తెల్లని శరీరంమీద మరీ తెల్లనిచీర ధరించింది. మర్యాద సూచకంకాబోలు- పల్చటి పైటకొంగు కుడిచేతిమీదుగా తీసుకొని మెడకొంచెం పక్కకు వంచి నేలకేసిచూస్తూ కూర్చుంది. విశేషమేమంటే విజయ అలంకరించుకున్నట్టుగాక అవి అన్నీ తనకు సహజమే అన్నట్టు కన్పించింది. విజయలో ఎక్కడా వెర్రితలలువేసిన నవనాగరికత తాలూకు లక్షణాలు మచ్చుకైనా కానరాలేదు. చంద్రబింబంవంటి ఆమొహంలో ఏదో కళ.... అద్దాలవంటి ఆచెక్కిళ్ళలో ఏదో అందం...శ్రీనివాస్ తృప్తిగా ఫీలయ్యాడు. ఇటువంటి రూపురేఖలే తను కోరేది. విజయతో ఎన్నో విషయాలు మాట్లాడాలి. మంచి చెడ్డలన్నీ విపులంగా తెలియపరచాలి. ముఖ్యంగా విజయకు తాను అర్థంకావాలి విజయి కూడా ఇలాగే ఆలోచిస్తూందా?

'విజయా!'

విజయ తలఎత్తి చూసింది చాల మంచిగా "చెప్పండి" అన్నట్టు. విజయ శ్రీనివాస్‌తో మాట్లాడటానికి సిద్ధంగా ఉంది.

'రామం నాగురించి మీకు చెప్పి ఉంటాడు.'

'చెప్పారు.' విజయ కంఠధ్వనిలో సరళత గోచరించింది. శ్రీనివాస్ క్షణం ఆగాడు 'ఈ ప్రసంగంలో నా కెంత బాధ్యత ఉందో మీకూ అంతే ఉంటుంది విజయా! ఈ క్షణం వరకూ మనలో ఎటువంటి నిర్ణయాలూ లేవు. కాబట్టి ప్రతి విషయం చాల లోతుగా ఆలోచించి మీ మనసుకు నచ్చిన విధంగా నిర్భయంగా నిర్మొహమాటంగా మాట్లాడండి అదే నేను కోరేది. ఇది మన జీవితాలకు సంబంధించిన ఘట్టం. ఎవ ర్నెవరు మోసగించినా తర్వాత మనమే అశాంతి పాల వాల్సి ఉంటుంది.'

విజయ శ్రద్ధగా వింది.

'ఈఇంటర్వ్యూకు మీరు మనస్ఫూర్తిగా అంగీకరించారా? లేక మీవాళ్ళెవరైనా...'

'లేదు నన్నెవరూ ఒత్తిడి చెయ్యలేదు. నేను మనస్ఫూర్తిగా అంగీకరించాను'

'ఎందుకు అంగీకరించారో కారణం చెపుతారా?'

'మీకోరిక నాకు నచ్చి అంగీకరించాను. ఒట్టి చూపులకంటే పరస్పరం మాట్లాడుకోవటంలో ఎక్కువ ప్రయోజనం ఉంటుంది. నేనే అలా నిర్ణయించుకొంటే నా కోరిక తీరుతుందనే నమ్మకంలేదు. కాని వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవచ్చు కదా? అందుకే అంగీకరించాను.'

'నాకోరిక మీకు సమంజసంగా తోచటం సంతోషం విజయా! ఈ ప్రసంగానికి ఇద్దరిదృష్టిలోనూ విలువ ఉంటుంది.'

విజయ శ్రీనివాస్ మొహంలోకి చూస్తూ అంది- 'నిజానికి ఇది విన్నప్పుడు కొంత జంకాను. కాని తర్వాత బాగాఆలోచించి ధైర్యం చెప్పుకున్నాను.'

'ఇందులో మీరంత భయపడవలసిందేమీలేదు విజయా! ఇది పరీక్షలకు హాజరవటమేమీ కాదుకదా? మన అభిప్రాయాలు ఒకరివి ఒకరం తెలుసుకొంటాం అంతే. నిండు జీవితాన్ని నిర్ణయించుకొనే ఈ సమయంలో ఈమాత్రం ధైర్యం చేయగలగాలి.' విజయ మంద హాసం చేస్తూ అంది-'దైవప్రేరణ లేకుండా మీ జీవితాన్ని మీరే నిర్ణ యించుకోగల ననుకుంటున్నారా?'

'అది వేరేసంగతి. సుఖమైనా దుఃఖమైనా భగవంతుడు ప్రసా దించాడనుకొనేదానికన్నా నాకు నేను చేసుకున్నా ననుకోవటంలో సంతృప్తి ఉంటుంది. నేను వధువుతో మాట్లాడితీరాలని నిర్ణయించుకో టానికి కారణం నా జీవితాన్ని సుఖమయం చేసుకోవాలనే కోరిక. నా పరిస్థితులు నా మంచిచెడ్డలు వివరంగా వధువుకు తెలియాలి. పర స్పరం ఏకీభవించాలి. ముసుగులో వ్యవహారంగా ముందు పెళ్ళితతం గం జరిగిపోయిన తర్వాత ఒకరి మనసు ఒకరికి పడకపోతే బాధపడి ప్రయోజనంలేదు. జీవితాన్ని నేనంత తేలికగా తీసుకోను-వింటున్నా రనుకొంటాను.' శ్రీనివాస్ విజయ కళ్ళలోకిచూస్తూఅగాడు. విజయ చూపులు దించుకొంది- 'వినటమేకాదు. చెప్పండి. అర్థం చేసుకోటా నికి ప్రయత్నిస్తాను' అంది వినయంగా. విజయప్రవర్తనలో మర్యాద చిహ్నాలేగానీ అవివేకంగా సిగ్గుపడి చిరాకుపెట్టే లక్షణాలేమీలేవు. శ్రీనివాస్ ప్రారంభించాడు- 'మాకు నాన్నగారులేరు. ఇంటికి నేనే పెద్దవాడిని. అమ్మ ఉంది. ఆవిడ కోడలుకావాలని కలవర పడు తూంది తర్వాత విధవ అక్కయ్య ఒకావిడ ఉంది. ఆవిడకు భర్త తరపు కొంత ఆస్తి ఉంది. నాలుగు సంవత్సరాల కూతురు ఉంది అవిడ కొన్ని సంవత్సరాలవరకూ పుట్టింటే ఉండ వలసిన వ్యక్తి. నా తర్వాత చెల్లి కాపురం చేసుకొంటూంది. పుట్టిం

టికి వస్తూ పోతూ ఉంటుంది. తమ్ముడు ఈసంవత్సరమే మెడిసిన్‌లో జాయినయ్యాడు. ఆఖరి చెల్లి నాలుగోఫారం చదువుతూంది. దానికి తగినంత చదువు చెప్పించి పెళ్ళిచెయ్యాలి. ఇదీ మా కుటుంబం. అందర్నీ మీకు పరిచయం చేశాను.'

విజయ మౌనంగా వింది.

'వాళ్ళందరికీ నేనే పెద్దను. అంటే ఆ కుటుంబ బాధ్యతలన్నీ నావే. అమ్మనూ అక్కయ్యనూ చూడాలి తమ్ముణ్ణి ప్రయోజకుణ్ణి చెయ్యాలి. చెల్లెళ్ళను సంతోషపెట్టి పంపుతూండాలి విజయా! ముందు నా బాధ్యతలు మీరు అర్థం చేసుకోండి'.

'అవును. దేనినీ మీరు కాదని తప్పించుకోటానికి వీల్లేదు'

'అలా ఎన్నడూ చెయ్యను. అదే నేను చెప్పబోయే విషయం. రేపు నాకు రాబోయే భార్య, పుట్టబోయే బిడ్డలూ-వీళ్ళేకాదు నాకు కావలసింది. నా కుటుంబం పెద్దది. మా ఇంటికి రాబోయే కోడలు మొట్టమొదట సమిష్టి కుటుంబాన్ని ఇష్టపడి పెద్దల్ని గౌరవించే వ్యక్తి కావాలి. కొంతవరకూ తన స్వార్థం విడిచి ఇంట్లో అందరి అభిమానాన్నీ పొందగలగాలి. ముందు ఈవిషయంలో మీ అభిప్రాయం చెప్పండి విజయా!'

విజయ మౌనంవహించింది. శ్రీనివాస్ తిరిగి అన్నాడు -'మీరు పూర్తిగా ఆలోచించుకోండి. మీ అభిప్రాయం ఏదైనా నిర్మొహమాటంగా బయటపెట్టండి. మా సమిష్టి కుటుంబంలో బాధ్యతలన్నీ ప్రత్యక్షంగా నావిగా కన్పించినా పరోక్షంలో నా జీవితంలో పాలు పంచుకున్న వ్యక్తివే అవుతాయి. ఆవిడ ఆదర్శమూర్తిగా ప్రవర్తించి సంసారాన్ని సుఖమయం చేయవలసి ఉంటుంది. విజయా! మీశక్తి మీరేఅంచనా వేసుకోండి-చాలమంది అమ్మాయిలు అత్తా ఆడబిడ్డలూ అనే ఎటువంటి అడ్డంకులూలేని ఒంటరి కాపురాలను కోరుకుంటారు. అటువంటి వ్యక్తి ఒకావిడను నేను ఎరుగుదును. ఆవిడ

ఉమ్మడి కుటుంబాలలో బాధ్యతలు నిర్వహించేటంతటి శక్తిమంతు రాలు కాదట పెళ్ళి జరిగాక వేరు కాపురం కావాలని బాధపడితే ఏం చేయాలి? ఒక విధంగా అదికూడా ఆవిడ నేరంకాదేమో! సమిష్టి కుటుంబంలో కోడలికి చాల ఓర్పు-సహనం-క్షమా గుణం-స్వార్థత్యాగం... పెద్దమాటలు చెప్తున్నానని అనుకోకండి. నిజానికి అటువంటి భావాలన్నీ ఆమెలో ఉండాలి మీశక్తి సామర్థ్యాలు...'

మాటలలో అడ్డుతగిలి చిన్నగా నవ్వుతూ అంది విజయ-'అంత లేని గొప్ప లక్షణాలు నాకు ఉన్నాయని నేను అనను గానీ సమిష్టి కుటుంబాన్ని గురించి ఏ విధంగానూ నేను అయిష్టపడను. నాకూ కొన్ని లక్షణమైన బాధ్యతలు స్వీకరించవలసిన అవసరం వస్తే మన స్ఫూర్తిగా సంతోషంతో అంగీకరిస్తాను. నేనూ పదిమందిగల కుటుంబంలో పుట్టి పెరుగుతూన్న దానినండీ.' విజయ మాట్లాడుతూన్న ప్రతిమాటా వేయి చెవులతో విన్న శ్రీనివాస్ ముఖంలో సంతోష రేఖలు వెల్లివిరిశాయి.

"విజయా మీరు జాగ్రత్తగా ఆలోచించే మాట్లాడుతున్నారా? కావాలంటే కొంత టైం తీసుకున్నా..."

"అవసరం లేదండీ! కని పెంచిన తల్లినీ- తోడబుట్టిన తోడునూ దూరం చేసుకోమని అడిగే ఆడదాన్ని కానే!" విజయ కన్నుల్లో గర్వం తొణికిసలాడింది.

"విజయా! చాల సంతోషం! నేను భయపడుతున్నది ప్రత్యేకంగా ఈ విషయం గురించే ఇంటి కోడలి మంచితనమే ఆ ఇంటికి సుఖశాంతులు ప్రసాదిస్తుంది!"

విజయ శ్రీనివాస్ మొహంలోకి చూస్తూ నిర్మొహమాటంగా అంది-"ఇంటిని స్వర్గంచేసే బాధ్యతంతా ఒక్క ఇంటికోడలిదే కాదు. ఇంటిలో ప్రతి వ్యక్తికీ సంబంధించి ఉంటుంది" విజయ మాటల్లో

శ్రీనివాస్‌కు ఎన్నో భావాలు అర్థమయ్యాయి. మిగిలిన వాళ్ళంతా చెడుగా ప్రవర్తించి ఒక్క కోడలు మాత్రం గుణవంతురాలైతే ఇల్లు స్వర్గం ఎలా అవుతుంది? ఇదేనా విజయ అనుమానం?

"మీరన్నది అక్షరాలానిజం. కోడలిని ఒకదాసీమనిషిలాచూస్తూ సంతోషపడే సంసారాలను చాలాచూస్తూంటాం. కాని విజయా మా ఇంట్లో వ్యక్తులంతా చదువు సంస్కారం లేనివాళ్ళుకారని గర్వంగా చెప్పగలను. మా యింటికి రాబోయే అమ్మాయిని నా భార్యగా ఇంటి కోడలిగా అభిమానించి గౌరవిస్తారు. కోడలంటే బానిసకాదు విజయా బాధ్యతలు ఉన్నట్టే ఆవిడకు హక్కులూ ఉంటాయి. అమ్మ పర్యవేక్షణలో ఆవిడే ఇంటి యజమానురాలౌతుంది. ఆవిడకు ఆ స్థానం నేను కల్గిస్తాను... ఇప్పుడు మీ అభిప్రాయం చెప్పండి"

విజయ నవ్వి అంది- "నేను చెప్పేశాను"

శ్రీనివాస్ సంతోషమంతా కళ్ళలోవ్యక్తపరుస్తూచూస్తూంటే విజయ ఇబ్బంది పడింది.

శ్రీనివాస్ ముందుకు సాగిపోయాడు- "అయితే తర్వాత విషయం. నెలకు నా జీతం మూడువందలూగాక సంవత్సరానికి భూముల మీద రెండువేలలోపు ఆదాయం వస్తుంది, పేరుకు మాత్రం నేను ఆఫీసరును. కాని మా కుటుంబం చాల నిరాడంబరంగా గడుస్తుంది. ఆఫీసరు భార్యనని ఏమైనా ఆశలు పెట్టుకొంటే మాత్రం నిరాశ పొందవలసివస్తుంది. ఈ విషయంకూడా మీ ఇష్టానికి సరిపోవాలి కదా?"

విజయ ఆ విషయం చాలా తేలికగా తీసుకుంది, "కనీసపు అవసరాలకు లోటు కలగకపోతే సంతోషమే. నేను చిన్నతనంనుంచీ పెద్దపెద్ద హోదాలకు అలవాటుపడి లేను."

ఒక్క బయటి విషయాలే కాదనుకోండి ఇంటి పని పాటల

సంగతి కూడా..." శ్రీనివాస్ ఆగిపోయాడు. కాని విజయ అర్థం చేసుకొని అతని నిర్మొహమాటానికి నవ్వుకొంది. "ఆ విషయంలో మీరేమీ బయపడకండి నాకు ఇంటి పనులన్నీ చేయటం వచ్చు. నేను వెళ్ళినచోట నౌకర్లూ చాకర్లూ ఉండాలని ఎప్పుడూ అనుకోలేదు" అంది నవ్వుతూ. శ్రీనివాస్ కూడా నవ్వి అన్నాడు- "సంతోషం విజయా! నేను అడగాలనుకున్న విషయాలు పూర్తయ్యాయి. ఇక మీ అభిప్రాయాలు తెలుసుకోవాలి. నన్ను ఏది అడగాలని ఉన్నా అడగండి అన్యథా భావించను."

విజయ ఏమీ మాట్లాడలేదు.

శ్రీనివాస కొంతసేపు చూసి-"నన్నేమీ అడగాలని అనుకోలేదా? మీకు కొన్ని ఉద్దేశ్యాలు ఉంటాయి. అని నేను అంగీకరించాలి కదా? పోనీ కొంతవరకూ నే నడుగుతాను. చెప్పండి, మీరు ఎక్కువ సమయం ఎలా వినియోగిస్తూ ఉంటారు? మీకు ఏప పనులంటే ఎక్కువ ఇష్టం?" అంటూ విజయను గురించిన సమాచారం ప్రారంభించాడు.

"నేను ఎక్కువ పుస్తకాలతోనే కాలక్షేపం చేస్తూ ఉంటాను. ఇంటి పనులు చెయ్యటం కూడా నాకు ఇష్టమే"

"సినిమాలూ-షికార్లూ?"

"మితంగా. అటువంటి విషయాల్లో మితిమీరిన మోజులు మా ఇంట్లో ఎవరికీ లేవు"

"మీకు మీ భవిష్యత్ గురించి కొన్ని ఆలోచనలు లేవా?" శ్రీనివాస్ సూటిగా అడిగాడు.

విజయ నవ్వింది. "ఎందుకు లేవు? ఉన్నాయి అవి ఇప్పుడు అడగకపోయినా మీరు అంగీకరిస్తారనే అనుకొంటున్నాను!"

"ఎందుకంత నమ్మకం నామీద మీకు? అలా అనుకొంటే

కాదు. అవేమిటో విపులంగా చెప్పండి. ఇద్దరికీ మంచిది" శ్రీనివాస్ ఒత్తిడిచేస్తున్నట్టు అన్నాడు. విజయ అడిగింది– "రేడియోలో నా పాట లెప్పుడైనా మీరు విన్నారా?"

"వినే వుంటాను కాని మీపాటలనే ప్రత్యేకతతో కాదు. మొన్న రామం మీరూ కలిసి పాడినప్పుడు విన్నానుక దా స్టేషన్‌లో. చాల చక్కగా ఉంది అనుకున్నాను."

"నేను ఎప్పుడూ రేడియోలో పాడినా, నాటికల్లో పాల్గొన్నా మీకు అభ్యంతరం ఉంటుందా?"

శ్రీనివాస్ క్షణం ఆలోచిస్తున్నట్టు ఊరుకున్నాడు. "నాకు వేరే ఏమీ అభ్యంతరం ఉండదు. కాని ఈ దశలో మీకు వీలయినట్టు రేపు శ్రీమతి అయిన తర్వాతకూడా జరుగుతుందని అనుకుంటున్నారా?"

"చాలవరకు ఒక లక్ష్యం పెట్టుకున్నవారికి వీలుగాకపోవటం ఉండదనుకోండి అంత తీరనినాడు నేనేసరిపెట్టుకుంటాను. మరి మీరు అభ్యంతరం పెట్టకపోయినా మీ పెద్దలు..."

"లేదు విజయా! మా అమ్మా అక్కయ్యా అంతా చదువు సంధ్యలను గౌరవిస్తారు. మీరు చక్కని గాయకురాలైతే అందరికీ సంతోషమే కదూ?"

'సంతోషం' అంది ముక్తసరిగా విజయ.

'ఒక్కమాట మీ ఈ అభిప్రాయాన్ని - అంటే ఇక ముందు మీరు రేడియోలో పనిచెయ్యటాన్ని నేను ఇష్టపడనంటే నన్ను తిరస్కరించేవారా?'

"ఎందుకా విషయం"

"కావాలి మీకోరిక ఎంత బలమైనదో తెలియాలి"

"లేదు మీరీ విషయాన్ని అంగీకరించకపోతే బాధపడి ఊరుకొనేదాన్ని గాని మిమ్మల్ని తిరస్కరించేదాన్ని కాను."

"ఎందుకని?"

"మీ వంటి సంస్కారులే ఇంత సామాన్యమైన కోరిక అంగీక రించలేనప్పుడు ఇక అది తీరేమార్గం లేదుకదా? దాన్నే విసర్జిస్తాను" శ్రీనివాస్ నవ్వాడు- "చిత్రంగా మాట్లాడుతున్నారు. మీరు బాధ పడవద్దు విజయా! మీ కోరికలను నేను మనస్ఫూర్తిగా అంగీకరిస్తు న్నాను. సాధ్యమైనంతవరకూ మీ అభివృద్ధికే ప్రయత్నిస్తాను,"

విజయ కన్నుల్లో కృతజ్ఞతాభావం పొడసూపింది. "తర్వాత విషయం-మీరు అన్యధా భావించకపోతే నేను ఒకటి అడుగుతాను. నేను ఏవిధమైన అపవిత్రతనూ సహించలేను. జీవితం కొన్ని సుగుణా లతో ఆదర్శాలతో గడపాలని ఆశపడుతున్నాను. మరేమీ అనుకోకండి. చాలమంది ఆఫీసర్సులో లంచగొండితనం ఉంటుందని విన్నాను. మీరు ..." విజయ మాటలు దొరకనట్టు ఆగిపోయింది. శ్రీనివాస్ గర్వంగా నవ్వాడు.

అంతలోనే విజయ తిరిగి అంది- "ఈనాడు ఏ విషయమైనా మీరు మరుగుపరిస్తే భవిష్యత్తులో మీరు కోరుకునే శాంతి మీకు లభించకపోవచ్చు. నా మనసు గాయపడితే...."

"విజయా!" శ్రీనివాస్ గొంతులో కొంత తీవ్రత ధ్వనించింది. "ముందు నా మనసు మీరు గాయపరుస్తున్నారు. మీ నీతి నియమా లకు సంతోషం కానీ అవి మీకేకాదు. నాకూ ఉన్నాయి. మీ అను మానాలకు నా జవాబు వినండి. లైఫ్ ఇన్స్యూరెన్స్ డిపార్టుమెం టులో లంచాల ప్రసక్తిలేదు. భగవంతుడి దయవల్ల నీతిగా బ్రతక గలిగే ఉద్యోగమే దొరికింది. అంతేకాదు. నా తల్లి మీద ప్రమాణం చేసి చెప్తాను. నన్ను నమ్మండి. నేను సిగరెట్లు కాలుస్తాను ఎక్కువ గానే కాలుస్తాను. తగ్గించుకోవాలనే కోరిక నాకూ ఉంది- తర్వాత పేకాడుతూ ఉంటాను. అప్పుడప్పుడూ స్నేహితులకోసం మాత్రం.

మితిమీరి ఎన్నడూ ప్రవర్తించలేదు. ఇక వ్యభిచారం త్రాగుడూ అనే లక్షణాలు నేను ఎరగను. ఇవన్నీ మీరు నమ్ముతారా?"

విజయ మాట్లాడలేదు. శ్రీనివాస్ విసురుపాటు చూస్తూ కూర్చుంది. కొన్ని క్షణాలు గడిచాయి-"ఇంకేమీ అడగనక్కర్లేదా?" అన్నాడు శ్రీనివాస్. విజయ నవ్వుతూ అంది - "అడగటం అలా ఉంచండి. మీకు కోపం ఎక్కువనుకుంటాను''

శ్రీనివాస్ సిగ్గుపడి నవ్వేస్తూ- ఫర్వాలేదు. "మీరు శాంతపరులుగా?" అన్నాడు.

''తర్వాత విషయం. కుటుంబ నియంత్రణం గురించి మీ అభిప్రాయం?"

"అంటే"

''అంటే ? అది మీ భవిష్యత్తులో ఆచరణలో పెట్టదల్చుకున్నారా?''

''ఎంత ముందుచూపు!'' అప్రయత్నంగా అనేశాడు శ్రీనివాస్. విజయ చాల సిగ్గుపడింది. "క్షమించండి. నేను అడిగిన విషయం సున్నితంగా లేదేమో!"

''ఆదేమీ కాదు కాని మీ కెందుకా అనుమానం వచ్చింది? నేను పూర్వం మనిషిని కానుగా పూర్వం చాదస్తాలు పోవటానికి?''

''అయినా వెనక ఉండే పూర్వపు వ్యక్తుల ఒత్తిడిలో ధైర్యం చెయ్యలేక జీవితాలను నరకం చేసుకుంటున్నవాళ్ళను చాలమందిని చూస్తున్నాం."

''వాళ్ళు తెలివి తక్కువవాళ్ళు విజయా! నే నెంత బరువు మోయగలనో నిర్ణయించుకోవలసింది నేను అంతే-తర్వాత అడగండి."

''మరి లేవు.''

"బాగా ఆలోచించుకున్నారా? అయితే ఏం నిర్ణయించు కున్నట్టు?"

"అది మీకు తెలియాలి"

"అయితే వినండి. నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకొని అర్థాంగిగా చేసుకోటానికి ఇష్టపడుతున్నాను దానికి కారణాలు మీ అందం, గుణం, వివరించాలంటే చాలచెప్తాను. సమయం ఇదికాదు." విజయ మందహాసంలో సిగ్గు తెరలు కదిలాయి.

"మరి మీరు నన్ను ఎందుకు అంగీకరించారో చెపుతారా?"

"ఇవీ మీరు చెప్పిన కారణాలే. మీ అందం, గుణం నాకు నచ్చాయి. మీవంటి సంస్కారులు అరుదు. నేను పెళ్ళిగురించి ఎక్కువగా ఎన్నడూ ఆలోచించలేదు. కాని ఏవో విశిష్టతలుగల వ్యక్తి నా భర్తగా లభించాలని మనసు కోరుతూ ఉంటుంది ఆ వ్యక్తి మీరే కాబోలు" అంది విజయ కొంత హాస్యంగా.

శ్రీనివాస్ పెదవులమీద లాస్యం మెరిసింది-'నాకు చాల సంతోషంగా ఉంది విజయా! నా ప్రయత్నంలో ఇంత దిగ్విజయం లభిస్తుందని అనుకోలేదు. ఆశించినదానికన్నామిన్నగా ఫలితంపొందాను. క్రిందటి గంటవరకూ నా పెళ్ళి ఒక సమస్యలా తయారై నన్ను భయపెట్టింది. అంతా నా పెళ్ళిగురించి అడిగేవాళ్ళే. అంతా హెచ్చరించేవాళ్ళే. నాకూ తెలుసు. నేనుపెళ్ళిచేసుకోవాలి. కాని ఎవరావ్యక్తి? ఎక్కడుంది? నాకుఒకటేకోరిక. ఆవిడరాకతో సంసారంలోఎటువంటి కలతలూతలఎత్తకుండా సుఖమయంగాసాగిపోవాలి. అలాగే జరుగుతుందనిఎవరైనా హామీఇస్తే తప్పకుండాపెళ్ళిచేసుకుంటాను. చిలకా-గోరువంకాలంటారే అలా సినిమాలూపికార్లూ-ఆటలూ-పాటలూ ఎంచక్కా ఉండదూ? నేనేమీ దురాశలకు పోవటంలేదే! అయినా నన్ను అర్థం చేసుకోగలిగే వ్యక్తి లభిస్తుందా? అంతమంచి గుణం, సంస్కా

రం గల అమ్మాయిలు ఉన్నారా ? ఉంటే అటువంటి గుణవతిని భార్యగా పొందగలిగేటంత అదృష్టవంతుడినా? ప్రతిక్షణం ఎన్నో ఆలోచనలతో గడిపేవాడిని. కాని నా నిరీక్షణ వ్యర్థం కాలేదు. నా ఆశ నిరాశ కాలేదు. నాకు ఎంతో సంతోషంగా ఉంది విజయా! ఈ నాటికి పద్మావతి లభించింది.'

'పద్మావతి! ఆవిడెవరు?'

'శ్రీనివాస భార్య'

'ఓ! అదా?' అంటూ నవ్వింది విజయ.

'ఏం? మీకు అసూయ కలిగిందా?'

'కాదా మరి?'

'అంత తొందరగా అభిప్రాయాలు ఏర్పరచుకోకండి విజయా! మీవంటి భార్య-నేను అదృష్టవంతుణ్ణి కదూ?'

'దయచేసి ఇక నన్ను మన్నించకండి- తర్వాత మీ అదృష్టంలో నాకూ వాటా కేటాయించండి.

శ్రీనివాస్ నవ్వాడు- 'చాలా గడుసుదానివి విజయా!'

'మీకంటేనా'

శ్రీనివాస్ చూపుల తూపులు తప్పించుకొంటూ విజయ లేచి నిలబడింది. 'మరి నేను వెళ్తాను నమస్తే.'

'భార్యకు భర్త తిరిగి నమస్కరించకూడదట

'ఎవరన్నారటా?'

'పెద్దలు'.

'ఓహో! పెళ్ళికూతురుతో మాట్లాడి మరీ పెళ్ళిచేసుకోమన్నారా పెద్దలు?'

'మర్చిపోయి ఉంటారు'

'అవునవును. గడుసువాళ్ళకు అనుకూలంగా ప్రవర్తిస్తూ ఉంటారు పెద్దలు. మరి నేను వెళ్తాను.'

'ఎవరూ వెళ్ళనక్కరలేదు కూర్చోండి. రామం ఇందిరా ఇక్కడికే వస్తారు-ఒరేయ్ రామం' అంటూ గట్టిగా పిలిచాడు శ్రీనివాస్. విజయ సిగ్గుపడి తిరిగి కూర్చుండిపోయింది. రామం ఇందిర నవ్వుతూ గదిలో కొచ్చారు. చదరంగం పావుల డబ్బా తీసుకొని.

'నీ ఇంటర్వ్యూ ఏమైందోగానీ మా అయనతో ఆడిన ఆటలలో మాత్రం నేనే గెలిచా నన్నయ్యా!' అంది ఇందిర నవ్వి.

'ఉత్తదిరా. అంతా దగాచేసి గెలిచింది.'

'బావుంది. మీకు కళ్ళు లేవేమిటి?'

'ఉంటే ఏం లాభం. ఆటమీద లేనప్పుడు? బావగారేం తిప్పలు పడుతున్నారో చూడాలన్న ధ్యాసేనయ్యే!'

'ఇంతకూ చూశావా?' శ్రీనివాస్ నవ్వాడు.

'లేదులే అన్నయ్యా! అందుకే ఈ కంగారంతా. ఇంతకూ ఏమైందో చెప్పవేం?''

"ఇంకేమైంది? అదిగో ఆవిడ మీవదినైంది" శ్రీనివాస్ విజయకేసి చూసి నవ్వాడు.

'అయితే మాత్రం అప్పుడే పెళ్ళికూతురులా తల దించుకోం దేమిటి?' అంది ఇందిర విజయను వేళాకోళం చేస్తూ.

'మరి కాస్త ప్రాక్టీసు చేసుకోవద్దా?' శ్రీనివాస్ ఛలోక్తికి ఇందిర ఫక్కుమంది. విజయ లేచి నిలబడి-

'ఏయ్ ఇందిరా! జరగబోయేవన్నీ ముందే ఆలోచించుకోటాలూ-ప్రాక్టీసు చేసుకోటాలూ నీకూ నీ అన్నగారికీ అలవాటు. మాకుగాదు. మేము ఏ టైముకు ఎలా కావాలన్నా మారిపోగలం."

'బాగా చెప్పావ్ చెల్లాయ్! అయితే బావగారూ! మీకు మేము చేసిన ఉపకారానికి మీరు మా కిచ్చే ప్రతిఫలం ఏమిటిటా?' రామం అన్నాడు.

"నా శక్తికి మించని విధంగా మీ ఇష్టమైంది అడగండి. సంతోషంతో ఇస్తాను. అప్పుడైనా మీ ఋణం తీర్చుకోలేనేమో!"

"అయితే అడుగుతున్నాను అన్నయ్యా! మా నానిగాడితో ఆడుకోందుకు చిన్ని ఆడ... బొమ్మ కాదు సుమా.... పాప...సంవత్సరం గడువు."

"హో! అదైతే నన్నుగాదు, మీ వదినను అడగండి. ఆవిడ పెత్తనం."

విజయ ఎంత గంభీరమైనదైనా సిగ్గుపడిపోయింది. ఆ కళ్ళలో సిగ్గు దొంతరలు వెతుక్కొంటూ లేచి నిలబడ్డాడు శ్రీనివాస్.

♦ ♦ ♦ ♦

పెద్దవారి ఇష్టప్రకారం విజయ పెళ్ళి శ్రీనివాస్‌తో నిర్ణయమైంది. నాయనమ్మ విజయ అదృష్టాన్ని వేనోళ్ళ పొగిడింది కాని మరో సమస్య తెచ్చిపెట్టింది. విజయ- పెళ్ళిలోనే శారద పెళ్ళికూడా జరిగిపోవాలట. "విజయేమో గడసరిదీ తెలివైందీ కాబట్టి పెళ్ళి మానేసి చదువు చెప్పించినా ఫలితం కన్పించింది. శారదకు అంత గడుసుదనం లేదు. విజయలాగ అది చదువు సంధ్యల్లో పైకిరాదు. దానికి నోట్లో నాలికేలేదు. పనిలో పని ఓ ఇంటి దాన్ని చేసేస్తే గుట్టుగా కాపురం చేసుకుంటుంది. చదువుమానిపించినా అది పేచీ పెట్టదు "అంటూ చెప్పుకొచ్చింది. "నిజమేను మరి" అంటూ అమ్మ ఎప్పటిలా నాయనమ్మకు వంతపాడింది. శారదను "విజయక్కయ్యతో పాటు నువ్వూ పెళ్ళి చేసుకుంటావులే?" అంటే అది తెలిసీ తెలీనట్టు ఓ నవ్వు నవ్వేసి జారిపోతూన్న ఓణి లాక్కుంటూ పరుగుదీసింది.

నాయనమ్మ ఆలోచన విన్న విజయ అదిరిపడింది. శారదకు పెళ్ళా? పధ్నాలుగేళ్ళ పసిదానికి మూడవ ఫారంలోనే చదువు మానిపించి శారదకు పెళ్ళిచేస్తారా? ఏం ప్రాణంమీదికొచ్చింది? పిచ్చి శారదకు అభమూ శుభమూ తెలీను. దానికి ఇష్టాలూ అయిష్టాలూ లేవు అందుకని దాని చదువు మాన్పిస్తారా? విజయ అమ్మతోనూ, నాయనమ్మతోనూ ఖచ్చితంతా చెప్పింది- శారదకు పెళ్ళి చెయ్యటానికి వీల్లేదని, దాన్ని చదివించాలని నాయనమ్మ ముందు ముందు మంచిగా మాట్లాడినా తర్వాత తగూలోకి దిగింది. తాచెడ్డ కోతి వనమంతా చెరిపిందట. నీకు సాగిపోయిందని అందరికీ సాగిపోతుందంటే? ఆ వెర్రిబాగుల్ది నీలా ఇరవై ఏళ్ళవరకూ ఎదిగి కూర్చుంటే దానికి మొగు డెవడైనా వస్తాడటే? అందర్నీ నువ్వే ఉద్ధరిస్తావులే?" అంటూ పురాణం తెరిచింది.

విజయ నాన్నగారితో సంప్రదించా లనుకొంది. విజయ వెళ్ళి నాన్న గదిలో కూర్చుంది. టేబుల్ మీద పుస్తకం ఒకటితీసి పది నిమిషాలసేపు తిరగవేసింది.

"నాన్నా! శారదకు పెళ్ళి నిశ్చయిస్తున్నారట దాని చదువు మానిపించేస్తావా?" అంది మౌనాన్ని భగ్నం చేస్తూ.

'అవునుమరి. నాయనమ్మా. వాళ్లూ పట్టుపడుతున్నారమ్మా!'

"అదేమిటి నాన్నా? అలా అంటావ్? పూర్వకాలంది నాయనమ్మ చెప్పినట్లే ఈ కాలంలో జరగాలంటే ఎలా? ఏమిశైనా వేసుకోటం రాని పసిదాన్ని చదువు మానిపించి పెళ్ళిచేసి కాపరానికి పంపటం ఎంత అన్యాయం నాన్నా? తల్లి తండ్రుల చాటున ఆడుతూ పాడుతూ కాలం గడపాల్సిన వయసు. అప్పుడే దాని బ్రతుకుమీద బాధ్యతలు మోపటం- పోనీ నీకు సమంజసంగా ఉందా నాన్నా?"

నాన్నగారు ఏమీ మాట్లాడలేదు చాలసేపు. 'శారద ఏమీ అనటంలేదట కదమ్మా! ఇష్టపడిందట కదూ?"

"ఇష్టపడిందినాన్నా! దానికి ఇష్టాలూ అయిష్టాలూ ఉన్నాయా? అసలు దానికి మంచేవిటో చెడ్డేవిటో తెలుసా? ఒక వేళ దానికి అన్నీ తెలిసినా మీ మాట ధిక్కరించే శక్తి లేక ఒప్పుకొందేమో! ఆనాడు ఎదిరించిన నన్ను మీరేం చెయ్యలేకపోయారు. అంతే నాన్నా. మను షుల్లో మంచితనం ఎన్నడూ దక్కదు."

"విజయా! ఏమిటమ్మా నువ్వు అనేది?"

"శారద పెళ్ళి జరగటానికి వీల్లేదు నాన్నా! మాటిమాటికీ మీరు ఖర్చులు భరించలేకపోతే దానికి సరియైన ఈడు వచ్చాక ఏ రిజిష్టరు పెళ్ళో చెయ్యండి. చాలు అది పెళ్ళికాదని ఎవరూ అనరు. నాకు చదువుకోవాలని ఎంతో కోరిక ఉన్నా పరిస్థితులు అర్థం చేసు కొని నా కోరికలను చంపుకున్నాను. కాని ఈనాడు అన్నయ్య కూడా సంపాదిస్తున్నాడు. నేను వెళ్ళిపోతే ఇక ఇంట్లో ఉండేది శారద ఒక్కతే. దాన్ని పెద్ద చదువులు చదివించినా చదివించ వచ్చును. అంత మంచి భవిష్యత్తు పాడుచేసి నాయనమ్మ మాటకోసం శారద బ్రతుకు నాశనం చేస్తావా నాన్నా."

"నువ్వు ఇంతగా చెప్తూంటే అలాగే చేద్దాం విజయా! శారద పెళ్ళి ఆపుచేసి చదివిద్దాం. అంతేనా నువ్వుకోరేది?"

"నీకు సమంజసంగా లేదా నాన్నా?"

"నువ్వు ఏది చెప్పినా చక్కగా ఉంటుంది తల్లీ! నేనే అప్పు డప్పుడూ పొరబడుతూ ఉంటాను."

విజయ సంతోషంగా- "నువ్వు మంచివాడివి నాన్నా! నేను వెళ్తాను. నేను చెప్పానని నాయనమ్మకు చెప్పకు సుమా! నన్ను తిడు తుంది" అంటూ లేచి వెళ్ళిపోతూంటే తండ్రి కూతురువైపే చూస్తూ ఉండిపోయాడు.

విజయ! బంగారు తల్లి! ఏది తలిచినా సాధించి తీరుతుంది. విజయకు పరాజయమే లేదు; విజయ అపరాజిత. ●

# శశి

యస్. యస్. ప్రసూన.

ఉషాబాల ధరించిన తెలిపట్టు వలిపెంలాగ దశదిశలూ కమ్ముకున్న మంచుతెరలతో రమణీయమై అందగించింది ప్రకృతి. పక్షుల కిలకిలారావాలు మృదుల సంగీతంలాగా మానవులకు మేలుకొలుపులు పాడుతున్నాయి. రాత్రి అంతా లోకసంచారంచేసి అలసి సొలసిన రేరాజు ఎర్రనైన ముఖంతో పశ్చిమ కొండల్లో పవళించ బోతున్నాడు. ఉషాబాల మంచు ముసుగు రవ్వంత తొలగించి ఉదయాద్రి మీద దినకరుని రాకని సూచించే అరుణ కాంతులు వీక్షించి ప్రియుని ఆగమనానికి తనువెల్ల ఉత్తేజిత మై పులకించిపోయింది. ఆ మై పులకింపులో వేయిరోజాలు విచ్చుకున్నాయి. లక్షనవ మల్లికలు వికసించాయి. రేకు రేకునా వలపుతలపులు దాచుకున్న నవవధువులాగా చామంతులు చెంగలించాయి. మందారాలు మకరందమాధురితో తూగిపోయాయి. పద్మరాణులు ముఖాల్ని ఇంతింతచేసుకుని దినకరుని రాకను కాంక్షాపూరిత దృక్కుల్తో వీక్షించి, మా హృదయాల్నే నీకు కానుకగా ఇస్తున్నాము ప్రభూ! ఆలసించి వేధించక త్వరగా దయచేయండి స్వామీ! అన్నట్లుగా వికసిత దళములు జాచి బాలభానుని బంగారు కిరణాల్ని స్వాగతించాయి. ఉషాబాల తనువెల్లా కుసుమించిన రకరకాల సుమగుచ్ఛాలతో సౌరభాల్ని వెదజల్లుతూ నవనవోన్మేష మైంది. రేయంతా చీకటి జీమూతాల్లో సొక్కిపోయిన ప్రాణికోటికి నవోదయమైంది.

ఆధునిక మానవులకి కాలాన్ని తెలిపే సాధనం నాకన్నా మించింది లేదన్నట్లు గోడనున్న గడియారం అహంభావంగా అయిదుసార్లు మోగింది. టేబిల్ మీద రెండు చేతుల్లో ముఖాన్ని

దాచుకుని వాలిపోయిన శశి కళ్లెత్తి గడియారంవంకచూసి బరువుగా నిట్టూర్చింది. అరుణిమ దాల్చిన సోగకళ్ళు, పాలిపోయిన చెక్కిళ్ళు, అలసట సూచించే బరువైన కపోలాలు ఆమె నిద్రలేమిని చెప్పక చెప్పుతున్నాయి. తెల్లవార్లూ ఆమె అల్లాగే కూర్చుని తన జీవితంలో పెనుభూతంలాగా ఆవహించిన సమస్యకి పరిష్కార మార్గం కోసం వెతకి వెతకి అలసిపోయింది. మార్గాంతరం తోచక చికాగ్గా లేచి పచారుచేస్తోంది.

పరధ్యాన్నంగా వున్న శశి గండు తుమ్మెద ఝూంకారానికి వులిక్కి పడి కిటికీలోంచి తోటలోకి తొంగిచూసింది. తను ఎంతో ప్రేమతో పెంచుకున్న గులాబీ చెట్లు కొమ్మకొమ్మనా వికసించిన పూలతో పకపకలాడుతూ తనని రారమ్మని ఆహ్వానిస్తున్నాయి. ఆమెకి ఎంతో ఇష్టమైన ఎర్రగులాబీ వంక తదేకంగా చూసింది. నిన్న విచ్చిన అరచేయ్యంత పెద్దదైన ఎర్రగులాబీ రేకులు రాల్చకుండా అలాగే వున్నది. మంచుతో తడిసిన రేకులు అందమైన సోయగాన్ని వెదజల్లుతూ ప్రౌఢత్వాన్ని సంతరించుకున్నవి. దాని పక్కనే అర విచ్చిన చిన్నారి గులాబీ ఆకుల చాటున వొదిగి అమ్మ చాటు కన్నె పిల్లలాగా సిగ్గు దొంతరలు వొలకపోస్తోంది.

పువ్వు పువ్వు వద్దా గిలిగింతాలు తిరుగుతూ ఝూంకార సంగీతాన్ని ఆలపించి మురిపించిమురిసిపోతూ, చిన్నారి గులాబీవద్దకువచ్చి ఆగింది కొదమ తుమ్మెద, తుమ్మెదగంభీరాకృతిచూసి గజగజలాడింది గులాబీ.తుమ్మెద "అమ్మా! వద్దే వెళ్ళిపొమ్మని చెప్పవే"అని గోముగా చూస్తూ బెదురు కళ్ళతో పెద్ద గులాబీ రేకుల క్రింద వొదిగింది.

కన్నె గులాబీ మొగ్గగా వున్నప్పుడే సుకుమారుడూ, సుందర రూపుడూ, ప్రేమాస్పదుడూ అయిన అళికుమారుడి కోసం కలలు కన్నది. తనగుండెల్లో వలపు తలపుల మధువంతా అతడికోసమే దాచుకున్నది. యవ్వనోదయమై ఒక్కొక్క రేకు విచ్చుకుంటుంటే వెడదల

లైన రేకులెత్తి అళికుమారుడి కోసం ఆతురతతో ఎదురుచూడసాగింది. తన మనస్సులో మధువంతా ఒక్కసారి అళిపోదాలముందు వొలకపోయాలని తహతహ లాడింది. తన ప్రియుడితో తననికూర్చమని భగవంతుణ్ణి మనసారా కోరుకున్నది. తన ఆశలు వమ్ముకావన్న ఆశతో నవోదయానికి నమస్కరించింది కానీ...

కానీ, ఇదేమిటి? చూస్తేనే భయం కొల్పేటట్లు వున్న ఈ భృంగరాజు తన పజ్జచేరబోతున్నాడు. భయంతో కళ్ళుమూసుకొని, “వద్దే అమ్మా! వెళ్ళిపొమ్మని చెప్పవే!” అని మళ్ళీ వేడుకున్నది పసి గులాబీ. భృంగరాజు ఇదేమీ లెఖ్ఖలేనట్లు జబర్దస్తీగావచ్చి చిన్నారి గులాబీ మృదువైన రేకలమీద వాలేడు. జుగుప్సతోనూ, అసహ్యంతోనూ రేకులు ముడుచుకుని ఛీత్కారం చేసింది. అయినా భృంగరాజు వదలిపెట్టలేదు. పువ్వు పువ్వునా మధువుగ్రోలటమే తన జన్మహక్కుగా భావించి తొండాన్నిజాచి మధువంతా పుక్కిలింతలుగా జుర్రుకొని రెక్కలు విదుపుకుంటూ ఎగిరిపోయాడు. వంచితురాలైన స్త్రీలాగా మధువంతా కోలుపోయి, నలిగిపోయిన రేకలతో పగిలిన హృదయంతో అమ్మ రెక్కల సందున వాలిపోయి మంచు కన్నీటి ముత్యాలతో అమ్మ వడి అంతా తడిపేసింది, దగాపడిన చిన్నారి రోజా.

జాలితో చిన్నగులాబీ శిరస్సు నిమిరి, “మనకి ఇష్టానిష్టాలేమిటి తల్లీ! వచ్చిన భృంగానికి స్వాగతమివ్వటానికే మనం పుట్టాము. వ్యతిరేకించే శక్తి మనకు లేదమ్మా. అయినా నువ్వు కోరుకున్న అళికుమారుడు నీకోసం రాలేదుగా! రాని వాడికోసం తపించేకన్నా, వచ్చిన వాడికే మనస్సు ఇచ్చుకుంటే సుఖం” వోదార్చింది పెద్ద గులాబీ. జేవురించిన ముఖంతో కస్సుమన్నది కన్నెగులాబీ. “మమతలూ, మమకారాలు వదులుకోటం అంత తేలికా ఏమిటమ్మా! నువ్వలాగే చేశావా? అయినా నా మనస్సు ఇంకోరికి ఇచ్చుకున్నా

నని శృంగరాజుతో నువ్వు చెప్పలేదు. చెప్పితే బలాత్కరించేవాడు కాదేమో. నువ్వు... నువ్వే చేశావు ఇదంతా". ఉక్రోషంతోనూ, బాధతోనూ ఏడిచింది చిన్నారి రోజా. ఫకాల్న నవ్వింది పెద్ద గులాబీ. ఆ నవ్వులో ఎన్నో జీవిత రహస్యాలు దాగి ఉన్నాయి. మరెన్నో స్త్రీ ధర్మాలు మిళితమై ఉన్నాయి.

అదంతా చూస్తూ నిలబడ్డ శశి గులాబీ నవ్వుచూసి విస్తుపోయింది. భంగపడ్డ కన్నెగులాబీని చూసి కన్నీళ్లు కార్చింది. నిజంగా తన పరిస్థితి ఈలానేవున్నది. అందుకే ఆడవాళ్ళని పువ్వులతో సరిపోలుస్తారు గాబోలు. పెద్దగులాబీ చెప్పిన జీవన సత్యమే తనకు ధ్యేయమా? రాత్రినుంచీ తను తల బద్దలు కొట్టుకుని ఆలోచించినా ఏమీతోచలేదు. ఇప్పుడీగులాబీ తనకి కర్తవ్యబోధచేసింది. అయినా...

అయినా ఆపని చేయటానికి తన మనస్సు ఒప్పుకోలేదు. తనను తాను వంచించుకుని కృత్రిమ జీవితాన్ని గడపలేదు. తనవాడు అనుకున్నవాడు తనకి దూరమైపోయాక తన బ్రతుకు ఎందుకు? తన గుండెల్లో గుడికట్టుకుని తనచే ఆరాధింపబడే వాడికి కాక మరొకరికి తనని తాను అర్పించుకోగలదా! అబ్బ! తల్చుకుంటేనే చాలు తన మనస్సు ఆనందపు కెరటాల్తో పువ్వెత్తుగా ఎగసి పడ్తుంది. అతను... అతను ఎవరతను? తనకి వెయ్యి జన్మాల తపః ఫలితం, తన కోరికల పంట, తన ప్రేమ పెన్నిధి. అతను లేకపోతే తనూలేనని అనుకున్నది. మనసా వాచా అతనికే తన జీవితాన్ని అర్పించుకుని ఆరాధించింది. శరీరాలు వేరుగానీ మనస్సులు ఒకటే అన్న భావంతో కలిసితిరిగేరు. భగవంతుడు కూర్చిన జంట అని అందరూ పొగిడారు. తన అదృష్టానికి పొంగిపోయింది. పెళ్ళి కాకపోయినా అందరూ తమని భార్యాభర్తలుగానే భావించారు. చదువుపూర్తి అయి వున్నత పదవి నందుకుంటేనేగానీ పెళ్ళిచేసుకోవటం ఇష్టంలేదనేవాడు. తనూ పెళ్ళికి అట్టే ప్రాధాన్యత ఇవ్వలేదు అతను ఉన్నత విద్య నిమిత్తం విదేశా

లకి వెళ్ళుతూ, "ఒక్క సంవత్సరంలో వస్తాను శశీ. ఎక్కడున్నా నేను నీ వాడిని. నిన్ను ఏనాటికీ మరువను. నామాట నమ్ము. సంవత్సరం తిరిగే సరికి నీపాదాల ముందు వాలుతాను. సంతోషంగా వీడ్కోలుపు శశీ" అని తన నోదార్చి తన కన్నీళ్ళు తుడిచి వెళ్ళేడు. అతడు తన వాడే నన్న నమ్మికతో సంవత్సరం అవలీలగా గడిపింది.

కానీ... సంవత్సరంలో వస్తానన్నవాడు అయిదు సంవత్సరాలు గడిచినా రాలేదు. ఎక్కడున్నాడో ఎలావున్నాడో తెలీదు. అతని ఆరోగ్యంకోసం సదా భగవంతుణ్ణి ప్రార్థించేది. అతను రాలేదన్న బాధతోపాటు యితరులనే మాటలు మరింత బాధ పెట్టేవి. అయినా తను అతణ్ణి గురించి అపోహపడలేదు. నిందావాక్యాలు మనసులోకి జొరనీయలేదు. ఆశతో, ఆవేదనతో అతనికోసం ఎదురు చూడసాగింది.

ప్రకృతి అంతా పండువెన్నెలలో సుస్నాత అయి ఆనందంతో మైమరచి నర్తించేవేళ, తన ప్రేమమూర్తి చిరునవ్వుల వెన్నెల తల్చుకుంటూ తనూ పరవశించింది. ప్రకృతి అమావాశ్య చీకటి కోరల్లో చిక్కుకుని కృశించిపోతే, అనుమానపు పెనుభూతాల చీకటి మనస్సంతా ఆవహించి తనూ భీతావహురాలైంది. ప్రకృతిలో వసంతోదయమై కోయిలకుహురవములతో, కొదమతుమ్మెద ఝూంకారాలతో, పరిమళావృతమైన వాయుసమీరాలతో, చూపరులని దిగ్భ్రాంతులని చేసే సుమ వాటికల సోయగంతో, చివురు జొంపాల నీడల్లో వనలక్ష్మితోకూడి వసంతుడు నాట్యమాడితే తన మనస్సులోనూ వసంతోదయమైంది. కోరికలు మోసులెత్తగా, ఆశాలతలు చివురించి అనురాగపు పూలు వికసించగా ఆమె అందాల నీడల్లో అతనికోసం నిరీక్షించింది.

గున్నమామిడి చివురు మెక్కిమెక్కి బొంగురుపోయిన గళమెత్తి గానం ఆలాపించిన కోయిల అలసిపోయి విశ్రాంతి తీసుకున్నది.

వికసిత పుష్పాలు కొదమ తుమ్మెదల మొరటుతనానికి వసివాడిపో యాయి. కళజారిన ప్రకృతి కాంత కౌగిలినుంచి వసంతుడు తప్పు కున్నాడు.

తన ప్రియతముడు రానేలేదు-

ప్రచండభానుని నిశిత కిరణాలు ఆయుధాలుగా ధరించి గ్రీష్మ రాజు రంగంమీద అవతరించాడు. నిప్పులుమిసే దినకరుని కిరణాల తాపానికి ప్రాణికోటి అల్లాడిపోయింది.

తన గుండెల్లో ఆశాలత వాడిపోయింది. విరహాగ్ని కీలలకి గుండె నెరిరాలు విచ్చింది. నిట్టూర్పు గాడ్పులలో సొక్కి-సోలిపోతూ అతనికోసం వేచివున్నది.

గ్రీష్మరాజు తన ప్రతాపాన్ని చూపి ప్రాణుల్ని త్రాహీ అని పించాననే గర్వంతో ఠీవిగా వెనక్కు తిరిగాడు.

అయినా... అతను రానేలేదు.

కారుమేఘాల గుర్రాలమీద పురుముల పిడుగుల శంఖారావా లతో వర్షరాజు గంభీరంగా దయచేసేడు. ఏనుగు తొండాల్ని బోలిన వర్షధారలతో, పదను కత్తుల్లాంటి తటిల్లతలతో, మహావృక్షాన్ని సహి తం కూకటి వేళ్ళతో పడగొట్టగలిగే ప్రభంజనాలతో ప్రకృతి దద్ద రిల్లిపోయింది.

తన మనస్సులో నిరాశా నిస్పృహల కారుమేఘాలు అలము కుని కన్నీటి జలధారల్లో తడిసిపోతూ అతను తప్పకుండా వస్తా డన్న ఆశా తటిల్లతలు తళుక్కుమంటుంటే హృదయ కవాటాలు తెరుచుకుని అతని కోసం నిరీక్షించింది.

ప్రచండ ప్రభంజనాలతో, వువ్వెత్తుగా ఎగసిపడే నదీనదాల వెల్లువల్లో లోకం అల్లాడిపోతూంటే జాలిపడిన వర్షరాజు చల్లచల్లగా జారుకున్నాడు.

తను ఎదురుచూస్తూనే వున్నది.

అలవోకగా హేమంతుడు వచ్చాడు, మంచు ముత్యాలు కానుకగా యిచ్చాడు. ప్రేయసీ ప్రియులకి ప్రియబాంధవుడైనాడు. విరహుల్ని వేధించాడు. ముదివగ్గులచేత ముచ్చటగా చీవాట్లు తిని వెనక్కు పరిగెత్తేడు.

అతడు రానేలేదు...

ఎదుటివారి పచ్చదనాన్ని చూసి వోర్వలేని పగవాడిలాగా శిశిరం వేంచేసేడు. పసి తీవెలన్నీ వసివాడిపోయాయి. పచ్చటి చెట్లన్నీ మోడులైపోయాయి. వ్యధిత హృదయాలు లాగా పచ్చటి నేలంతా బీడు వారింది. కళజారిన ప్రకృతి పండి రాలిన ఆకుల వంకా, ఎండిమోడులైన చెట్లవంకా జాలిగాచూస్తూ వసంతుడి కోసం ఎదురుచూడసాగింది.

అబ్బ... అతను... రానేలేదు.

తను నిరీక్షించటం మానలేదు. తన మనస్సూ శిశిరంలాగానే కళ తప్పింది ఇంక తన బ్రతుకులో వసంతంలేదు. యుగయుగాలు అతనికోసం యిలా చూస్తూనే వుంటుంది. ఈ రాగజ్వాలలో తను శలభంలాగా మాడిపోయినా తనకు లెఖ్ఖలేదు. కానీ.... లోకం తన బ్రతుకు తనని బ్రతుకనీయటంలేదు. తన రాగవిరాగాలతో లోకానికి పనిలేదు. పైగా అపహాస్యం చేస్తుంది. మనసూ, మమతా విస్మరించి పెద్దలు నిర్దేశించిన వాడితో వన జీవితాన్ని గడపటానికి తను సిద్ధపడాలి. లేకుండా ఎదురిస్తే సంఘం తన మీద కత్తులు విసురుతుంది. అయినా తనకి బాధలేదు. తనవాడే తనకి కాకుండా పోయాడన్న బాధలో సంఘం విసిరే కత్తుల గాయాలు ఏపాటిబాధ?

కానీ, చిన్నతనంలోనే అమ్మా, నాన్నని పోగొట్టుకున్న తనని అన్నయ్య అపరూపంగా పెంచేడు. కంటికి రెప్పలాగా, కంటిలో

పాపలాగా పెంచుకున్న అన్నయ్య, తన కాల్లో ముళ్లుగుచ్చుకుంటే అతని గుండెల్లో గునపాలు గుచ్చుకున్నట్లు బాధపడిన అన్నయ్య గౌరవాన్ని తను నిలపాలి. అపరూపంగా, అతిగారాబంగా, అమ్మని మరపించిన వదిన మాట శిరసావహించాలి. వారి పరువు ప్రతిష్టలు కాపాడే బాధ్యత తనకి ఉన్నది. నిజమే కానీ యీవిషయంలో తను ఏమీ చేయలేకపోతోంది. తన బ్రతుకంతా అతడేనని నమ్మి మనస్సు యిచ్చుకున్న అతడికి కాకుండా మరొకడికి కట్టిపడేస్తానంటే ఎల్లా ఒప్పుకుంటుంది? అన్నయ్య ఎంతో బ్రతిమలాడేడు.

ఎంతకాలం ఎదురుచూసినా నువ్వు కోరుకున్నవాడు రావటం లేదు. అసలు ఏమైపోయాడో తెలీదుగదా! ఎందుకమ్మా ఇంత ఆశ? నిన్ను అతను మర్చిపోయేవుంటాడు. నువ్వే బేలతనంగా నీ బ్రతుకు పాడుచేసుకుంటున్నావు. నామాట విను తల్లీ... నిన్ను పువ్వుల్లో పెట్టి పూజించుకునే వాడిని. పెద్ద హోదాలో ఉండి నిన్ను రాణీ లాగా చేసేవాడిని నీకోసంతెస్తానమ్మా. నువ్వువూ-అంటేచాలు ఎన్ని వేలైనా గుమ్మరించి నీకు తగిన వరుణ్ణి వెతుక్కు వస్తాను అని ఎంతో చెప్పేడు.

అయినా తను - వూ - అనలేకపోయింది.

'అన్నయ్యా-ఆడది ఒక్కసారె మనస్సు యివ్వగలుగుతుంది. ఆ యిచ్చిన మనస్సు మళ్ళీ వెనక్కురాదు. మనసులేని మనువుల్తో సుఖపడేది ఎవరు? ఈ ఒక్క విషయంలో నన్ను మన్నించు ఇంక నువ్వేమి చెప్పినా చేస్తాను." అన్నయ్య చేతులు పుచ్చుకు బ్రతిమలాడింది.

'ఇదంతా నీమంచికోసమేనమ్మా, పెళ్ళికాని ఆడదాన్నిలోకం బ్రతకనీయదు. పిచ్చివాడిమీద రాళ్లు విసరినట్లుగా, అపవాదులరాళ్లు రువ్వి గాయపరుస్తారు.అప్పుడు నీకు సానుభూతి చూపేవాళ్ళయినా వుండరు. నామాటవిను తల్లీ.... నీజీవితాన్ని సరిదిద్దుకోగలిగిన వ్యక్తి

రాలివి అయావు. నీకు వ్యతిరేకంగా ఏమీచేయను. బాగాఆలోచించి నీ బ్రతుకుదిద్దుకో. మన ప్రేమకి అర్హులుకానివారికోసం మన జీవితం త్యాగం చెయ్యటం వెర్రి తనం తల్లీ"

అన్నయ్య మాటలు తను వినలేకపోయింది గబగబా గదిలోకి పరిగెత్తింది. ఆరోజంతా అన్నం తినకుండా గదిలోంచి ఇవతలకి రాకుండా కంటికీ మంటికీ ఏకధారగా ఏడిచింది. వదినవచ్చి పక్కలో కూర్చుని వోదార్చింది.

"ఏమిటమ్మాశశీ మరీ పిచ్చిపిల్లవై పోతున్నావు. ఏమన్నా అంటే కోపంగానీ అతడేమో నిన్నుమర్చిపోయి ఎక్కడో కుషీగాఉం-టాడు! మరినువ్వేమో అతనికోసం ఆరాటపడి జీవితాన్ని వ్యర్థం చేసుకుంటున్నావు! నువ్వు బాధపడి నీవాళ్ళని బాధపెట్టుతున్నావు! మగవాళ్ల మాటలు వట్టి నీటిమూటలు, వాటిని నమ్మినవాళ్ళు గోతిలో పడకతప్పదు. ఇప్పటికయినా మించిందిలేదు. నీకర్తవ్యాన్ని నిర్ణయించుకో!" వదినచెప్పే మాటలకి తనగుండెలు బాధతో గిల గిల్లాడినయ్యి"

"వదినా! నీకుపుణ్యం వుంటుంది అతణ్ణి ఏమీఅనకు నీకు దణ్ణం పెట్టుతాను. వస్తాడు! అతడు తప్పకుండా వస్తాడు! కానీ... కానీ.... అప్పటికి కాలాతీతమైపోతుంది. వదినా, అప్పుడు అతనికి నాకన్నీళ్లు తప్ప మరేవీ ఇవ్వలేను!" వదిన వొడిలో మహాస్రవంతులు పరుగు లెత్తేయి.

తెల్లవార్లూ విలపించింది. ఆలోచించింది. అయినా, ఒక నిర్ణ యానికి రాలేకపోయింది.

ఇపుడీ గులాబీపువ్వు చూసేసరికి తనకర్తవ్యం బోధపడింది. తనవాళ్ళకోసం తనబ్రతుకు త్యాగం చేయక తప్పదు. ఆడది తన కోసం తనేమీ చేయదు. ఇంకొకరి సుఖంకోసమే సర్వశక్తులూ ధారపోస్తుంది. తనమనస్సు వంచించుకుని మమకారాలు తుడిచేసు

కుని ఇతర్లుచూపిన బాటలో గుడ్డిగానడిచి వెళ్ళిపోతుంది. ఆదారిలో అన్నీ ముళ్లూ, గోయలే వుండవచ్చు! లేదా అదృష్టవంతులకి గులాబీ పూలబాటే కావచ్చు. ఏదిఏమైనా! ఈదారి నాకు బాగులేదు. నేను నిర్దేశించుకున్న బాటలో నేను నడిచి వెళ్ళుతాను, అనేశక్తి స్త్రీకి లేదు. అలాటిశక్తి సంపాదించుకున్న స్త్రీని లోకం బ్రతుకనీయదు. నీతి దూరురాలనీ, అహంభావి అనీ, సంఘవిద్రోహి అని మరెన్నో విధాల దూషించి సంఘలో బ్రతకనీయకుండాచేసి మాటల ఈటెల్తో మన స్వంతా తూట్లుపొడస్తుంది. అది ఆమెఒక్కదానికేకాదు. ఆమె ఆత్మీయుల్నికూడ ఆ ఈటెలు బాధిస్తాయి. అందుకే స్త్రీ తనకోసం కన్న తనవారికోసమే త్యాగం చేస్తుంది. అందరు స్త్రీలమాదిరే తనూ ఈ త్యాగం చేయకతప్పదు. ఈ వూహ వచ్చేసరికి మనస్సు విల విల లాడిపోయింది. కన్నీళ్ళతో వక్షోభాగం తడిసిపోయింది. అయినా మనస్సు నిలదొక్కుకొని చిన్న గులాబీని చేతుల్లోకి తీసుకుని-

"మనిద్దరి బ్రతుకులూ ఒకటేనమ్మా! నోరులేని నువ్వు ఏమీ చేయలేకపోతే వుండేనేను అశక్తురాల్ని అయిపోయాను. మన సాంఘిక ధర్మాలపేరిట వంచితుల మవటానికే పుట్టాము. ఎప్పటికయినా ఎన్ని జన్మలకయినా మనతపస్సు ఫలిస్తుంది. భగవంతుడు దయామయుడు చెల్లీ - మనకోరిక నెరవేరే సుఖదినంకోసం ఎదురు చూద్దాము. అంతవరకూ ఈ త్యాగాలజ్వాలలో కాలిపోదాము." అంటూ ఆరోజాపువ్వు చెంపలకి అద్దుకున్నది.

ఇంతలో అటువేపువచ్చిన శశి వదిన ఆమెనుచూసి...

"ఏమిటమ్మో శశీ! పూలకన్నెతో కబుర్లు చెప్పుతున్నావా? ప్రేమోన్మాదంలో బాహ్యాన్ని మరచినవాళ్లుపూలతోనూ, పక్షులతోనూ సల్లాపాలు జరుపుతారుట! నువ్వు అపనే చేస్తున్నావా?" గట్టిగా నవ్వుతూవచ్చి ఆప్యాయంగా శశి బుజాలమీద చేతులువేసింది.

"శశి వదినగారి కళ్ళల్లోకి నిశితంగా చూసి "అవును వదినా మనని అర్థంచేసుకోలేని మానవులకన్నా అవేనయం. అర్థంచేసుకోటం చేతనవాలేగానీ భాషకందని భావాలెన్నో అందిస్తాయి. మన బాధని అర్థంచేసుకుని జాలిచూపుతాయి. అసలు మనమూ పూలజాతికి చెందినవాళ్ళమేగా అందుకే వాటికీ మనకీ అవినాభావ సంబంధం వున్నది. ఇది చూడూ ఈ గులాబీ నాకు ఎన్నో చెప్పింది. ఈ చిన్ని గులాబీ మనస్సు ఒకరికీ తను వొకరికీ ఇచ్చి దగా పడింది. అదే జీవన ధర్మం అని పెద్దగులాబీ వోదార్చింది మరి....మరి నేనూ ఈ పరిస్థితిలోనే వున్నానుగదా! నన్నూ అలాచేయమనే మీరంతా బలవంతం చేస్తున్నారుగదా! ఇంక వాటికీ మనకీ భేదంపమిటి చెప్పు....అందుకే వదినా-వదినా మీరు చెప్పి .. నల్లే." ఇంక మాట్లాడలేక వదిన చేతుల్లో ముఖాన్ని దాచుకున్నది.

వదిన మనస్సంతా అర్థమైపోయింది. శశిని గట్టిగా గుండెలకి అదుముకుని, "ఆడవాళ్ళం తల్లీ! అనురాగాలు, అభిమానాలు అన్నీ దాచుకోవాలి. లేకపోతే లోకం క్షమించదు. ఇంత అస్వతంత్రమైన మనమనసు రాగరంజితమవటమే మనదౌర్భాగ్యం తల్లీ. నీలాటి నాలాటివాళ్ళు ఎందరు కన్నీళ్ళుకార్చినా లోకానికి జాలిలేదు." "ఇంకా ఏమో చెప్పబోయింది. వదినమాటలువినే వోపిక లేకపోయిందిశశికి!. 'వదినా ఇంకేమీ చెప్పకు. వినలేను' అని బోరున విలపించింది. ఆమె ఆక్రిందనలో ఎందరో వ్యధిత స్త్రీలఆవేదన ప్రతిధ్వనించింది.

---

# స్నేహం

తురగా జానకీరాణి.

మోకాళ్ళమీద గడ్డంఆన్చి, క్రిందికిచూస్తూ కూర్చుంది సుమిత్ర. క్రింద గడ్డికొసలమీద తడి మెరుస్తోంది. దూరాన చిన్న నీలంపూలు గాలికివూగుతున్నాయి. గాలికి పైనుంచి కనకాంబరం రంగు గోటం పువ్వొకటి రాలి క్రిందపడింది. బరువుగా నిట్టూర్పువదిలింది సుమిత్ర.

పుస్తకంలోంచి తలెత్తి చూసింది వసుంధర. "ఏమిటది ? ఇందాకణ్ణించి చూస్తున్నాను?" అన్నది.

సుమిత్ర మాట్లాడలేదు. దూరానవున్న చెట్లకొనలమీద స్వర్ణారుణకాంతితో సూర్యునికిరణాలు ప్రసరిస్తున్నాయి. అంతా నిశ్శబ్దంగా వున్నది.

హాస్టల్లోచేరి చదువుకునే ఆడపిల్లలంతా యీ గార్డెన్సులో కూచుని, నిట్టూర్పులు విడవమని కాదు. యింత అందంగా యీ తోట వేసింది-తెలుసా?" అన్నది వసుంధర.

ఎంతో ప్రశాంతంగా వున్నది వాతావరణం. తీయని శోభ గోచరిస్తోంది చుట్టూ ప్రకృతిలో. దూరాన హాస్టలు బ్లాకుల్లోంచి ఏవో యింగ్లీషుపాటలు వినిపిస్తున్నాయి. మధ్యమధ్య కీచుమని కేకలు పకపక నవ్వులు వినిపిస్తున్నాయి.

సుమిత్ర మళ్ళీ నిట్టూర్చింది. వసుంధర పుస్తకం మూసేసి ప్రక్కన పడేసింది. " ఏమిటా వేదన ? చెప్పమంటుంటే ?" అన్నది. సుమిత్ర మనస్థితి విరబూసిన పారిజాత వృక్షంలా ఉన్నది. కదిలిస్తే జలజలా రాలుతాయి పుష్పాలు. ప్రకృతి మాధుర్యానికి మనస్సు

కంపిస్తోంది. తనలోని ఆలోచనలన్నీ ఏదోవిధంగా చెప్పేసుకోవాలనీ, అర్ద్రితని విరజిమ్మాలనీ అనిపిస్తోంది.

"నీ కెప్పుడైనా పెన్‌ఫ్రెండ్స్ అంటూ ఉన్నారా?" అన్నది సుమిత్ర.

"నాకు గిట్టవు అల్లాంటివి. ఏం. నీకు కావాలా యిప్పుడు?" అన్నది వసుంధర.

"ఒక వయస్సులో అది చాలారోమాంటిక్‌గా కనుపిస్తుంది. 16-20 సంవత్సరాల మధ్య కాదూ?"

"కావొచ్చు - యింతకీ దేనికీ ఉపోద్ఘాతం?" సుమిత్ర కళ్లు సగం మూసుకుని చూస్తోంది. "జీవితంలో ప్రతి వ్యక్తికి యితరులకి కొంత ఆనందం, కొంత దుఃఖం కలిగించే అవకాశాలుంటాయి. అవి మనం ఉపయోగించు కోవడంలో వుంటుంది నేర్పు"

వసుంధరకి సుమిత్ర కళ్ళు ఆర్ద్రంగా మెరుస్తున్నాయా అని అనుమానంకలిగింది. క్రిందపడిన పచ్చపూవుని పట్టుకున్న ఆమె వ్రేళ్లు వణుకుతున్నాయా అనిపించింది-వసుంధర మౌనంగా వూరుకున్నది. ఈ ఏణ్ణర్థం పరిచయంలో రెండు మూడు సార్లుకూడా చూడలేదు యీ మూడ్‌లో సుమిత్రని. ఒకే రూములో ఉంటూ, ఒకేసారి కాలేజీకి వెడుతూ రిసెర్చి చేస్తున్నారు. ఇరవైనాలుగ్గంటలూ యిద్దరూ కలిసే వుంటున్నారు కానీ యిల్లాంటి మూడ్స్‌లో సుమిత్ర పడినప్పుడు వసుంధరకి ఆమె అర్థంకాదు. ఏమీ చెప్పదు, బిగ్గరగా ఏడిచేసి బాధనైనా తీర్చుకోదు. ఏదో ఒక పరమసత్యాన్ని లోక సామాన్యంగా చెప్పి, దాన్ని గురించే బాధ పడుతున్నట్లు కనిపిస్తుంది. ఆమె చేత మాట పలికించడం అసంభవం.

కానీ—యీనాటి వాతావరణం భిన్నంగాఉంది. చుట్టూవున్న అందం, తమని అంటకుండా దూరందూరంగా జరుగుతున్న ధ్వనులు, మూగగా అనందాన్ని విరజిమ్ముతూన్న పూలు, పిట్టలు చెట్లు -

వీటన్నిటిమధ్య తామిద్దరే ఏదో ఒక సామీప్యం అనుభవిస్తున్నారు. కుసుమభరితమైన లతలావున్నది సుమిత్ర.

"సుమిత్రా, చెప్పు నేను వినడానికి సిద్ధంగావున్నాను"అన్నది వసుంధర. సుమిత్ర క్రిందికివాలి గడ్డిమీద పడుకుంది. వసుంధర ఆమె తలనుతీసి, తన ఒళ్లో వుంచుకుంది. "చెప్పుమరి" అన్నదామె.

"నేను యింటరులో వుండగా పెన్ ఫ్రెండ్స్ సంఘంలో చేరాను-అంటే ఏడేళ్ళక్రితం అన్నమాట. దూరదూరాల్నించి వచ్చే వుత్తరాలు, కలిగే పరిచయాలు, అవి కొనితెచ్చే స్నేహపరిమళాలు నా మనస్సులో నిత్యం మెదులుతుండేవి. ఎక్కువమంది మగవాళ్ళే వ్రాసేవారు నాకు. లక్నోనుంచి ఒకతను - సంగీతం నేర్చుకునే అబ్బాయి, మద్రాసునుంచి ఒక అయ్యంగార్ల అబ్బాయి, స్పోర్ట్స్ మేన్, హైదరాబాదులో ఒక యం. ఏ స్టూడెంటు-ఎవరో యింకా-తిరుపతినుంచి మరో అమ్మాయి పరిమళ అని-ఇంకాఎవరో వ్రాస్తుండేవారు. అందరికీ ఏదో ఒక పోజ్ యిస్తూ వ్రాయడం అలవాటు. నీ కర్థమౌతుంది కదూ ఆవయస్సు?

సభ్యుల జాబితాలో నా యోగ్యతలు-16 సంవత్సరాలు, కవిత్వం. సంగీతం, ఫోటోగ్రఫీ అంటే యిష్టం- అన్నిట్లో ప్రవేశం, యితర ప్రాంతాల్లోని కాలేజీలను గురించి, విద్యార్థులను గురించీ తెలుసుకోవాలని కుతూహలం- యివీ యితరులకు సంబంధించినంత వరకు యితరులకు తెలిసేవి. బాగున్నాయి యివన్నీ మరి.

గుప్పున వాసనవేసే వుత్తరాలు కొన్ని వస్తే అమ్మచూసి కేక లేసింది రెండు మూడుసార్లు. యీ వ్రాతలన్నీ మానేయమని- కానీ నేను వాళ్ళకి వ్రాయడం మాత్రమే మానేశాను.

రోజువిడిచి రోజు ఉత్తరాలు వచ్చేవి. నేను ఆరాత్రికి రాత్రే కూర్చుని, కొంచెం కాలేజీ ఖబుర్లు, కొన్ని ప్రకృతి వర్ణనలు, మాన

సికావస్థలు-అన్నీ కలిపి వాసేదాన్ని పరిణయాత్మకంగా..."

సుమిత్రి ఆగింది-వసుంధర సుమిత్ర నుదుటిమీద వెంట్రుకలని ఉంగరంగా చుట్టి అల్లా వదిలింది.

"ఇంతకీ పైన చెప్పినవాళ్ళల్లో ఎవరిని ఏరుకోమంటావు నీ కథకి?" అనుకోకుండానే చిన్నగా నవ్వుతూ అడిగింది వసుంధర.

అంత సుఖాంతమైన కథేమీ కాదు వసుంధరా- ఏడాది తిరిగే లోపుగానే అందరికీ వ్రాయడం మానేశాను నేను. మీ ఫోటో పంపండనో, వివాహాన్ని గురించి, వర్ణాంతర, రాష్ట్రేతర వివాహాలను గురించి మీ అభిప్రాయమేమిటనో, మీ వూరు వస్తాము కలుస్తారా అనో" ఇల్లాంటి వాళ్ళకి సమాధానం వ్రాయాలనిపించేది కాదు.

వీళ్ళందరిలోకీ ముందునుంచి ప్రత్యేకంగా కనిపించాడు ఒకతను- ఈవూరి అతనే. బెజవాడలో వున్న నాకు యీ వూరు చాలా గొప్పగా అనిపించడంలో ఆశ్చర్యంలేదు. యం. ఎ. చదువు తున్నానని వ్రాశాడు. సారస్వతంతో బాగా పరిచయమున్నవాడు- అదీకాక, ఏవేవో వర్ణనలు వ్రాసేవాడు అతి రమ్యంగా. పత్రికల్లో కథలు చదివినంత ఉత్సాహంగా చదివేదాన్ని మొదట్లో. అప్పుడప్పుడే వికసిస్తున్న ఆలోచనలు నావి. తీయని మాటలు, రమ్యమైన వర్ణనలు- యిల్లాంటివి ఎక్కడ, ఏ రూపంలో గోచరించినా మనస్సు పులకరించే రోజులవి. ముత్యాల వరుసవంటి అతని అక్షరాలు అంత చక్కని దస్తూరీ ఎక్కడా చూడలేదు నేను. మనస్సుని రంజింపచేసే మాటలతనివి.

అతనితో స్నేహం నాకు అలవాటైంది. మొదట్లో అతన్ని గురించి నిర్వికారంగాఆలోచించినా, తర్వాత త్వరలోఏవోవూహాలు మెదిలేవి. విశాలమైన నుదుటిమీద దీపంకాంతి మెరుస్తుండగా, చక్కని వ్రేళ్ళమధ్య కలం పుచ్చుకుని వ్రాసే అతని మూర్తి కనుపించేది. నవ్వితే చిన్న గుంటపడే అతని కపోలం, చేతులపైకి మడిచి పెట్టిన

అతని షర్టు, ఆ మెడతదగ్గర కనిపించే సౌందర్యం, గుండీ వూడదీసిన అతని లాల్చీ ఇల్లా రకరకాలుగా అప్పుడప్పుడు అతని రూపం కనుపించసాగింది. అతని కళ్లు-ఎంతో ప్రయత్నించివమీదట వూహించ గలిగాను. పొడుగాటి రెప్పల వెంట్రుకలు, సుతిమెత్తగా కనుపించే కనురెప్పలు, నవ్వితేముడుచుకుపోయేకళ్లు-అవిమాత్రం కనుపించేవి"

సుమిత్ర కంఠం వణుకుతోంది. కళ్ళు గట్టిగా మూసుకుని వసుంధర చేతినిపట్టుకుంది. "ఏమిటో రొమాంటిక్ ఫూల్ ననిపిస్తుంది ఇప్పుడు-ఆ వయస్సు, పరిచయాలు, అవన్నీ అనుభవించేసి మర్చిపో యేవి. వాటి మర్చిపోనీని పర్యవసానాలే జీవితంలో జ్ఞాపక ముం టాయి. ఆ పర్యవసానాల నంటి పెట్టుకున్న సంఘటనలు, మమతలు అన్నీ జ్ఞాపకముంటాయి కాబోలు.

ఉత్తరాల్లో ఎప్పుడూ అతను నా రూపాన్నిగురించి ప్రశ్నించ లేదు, అతని రూపాన్ని గురించి వ్రాయలేదు. మూడేళ్ళు వ్రాసినా ఉత్తరాలు-ఎన్నడూ ప్రస్తావించే ధైర్యం కలిగిందికాదు. ఏవిధమైన వ్యక్తిగత విషయాల ప్రసక్తి ఉండేదికాదు. అతను వ్రాసేవాటిల్లో. ఏదో చిన్న చిన్న వ్యాసాలు, చక్కని స్కెచెస్ అతని ఉత్తరాలు. నాకు ఎన్నిసార్లో కుతూహలం కలిగేది ఫోటో పంపండని వ్రాద్దామని మగవాడు అతనే ఉత్సాహం చూపనిదే నేనెందుకు చూపాలి అని, తమాయించుకునేదాన్ని. ఎంత వద్దనుకున్నా, అతని ఉత్తరంరాగానే మనస్సు ఊయలలూగి, ఆనందంతో పులకరించేది. ప్రతి అక్షరం తేనె లొలుకుతూ కనుపించేది. అర్ధరాత్రి నిద్రలేచికూడా చదువుకునేదాన్ని అక్క డక్కడి పంక్తులు.

అతను యం. ఎ. పాస్ అయిపోయాడు. ఒక ఏడాది అవీ ఇవీ ఉద్యోగాలకోసం వెతికి లెక్చరరుగా స్థిరపడ్డాడు. నేను బి.యస్. సి. పూర్తిచేసేసరికి మేము ఒకరినొకరం చూసుకోకుండా, ఆప్యాయత మొలికే మాటలు ఒక్కటికూడా వ్రాసుకోకుండా కూడా అతి సన్ని

హితమైన స్నేహితులమైపోయాము. నేను అంటీఅంటకుండా భిడియ పడుతూ వ్రాయడం నేర్చుకున్నాను. ఊహించుకొన్నకొద్దీ అతని కళ్ళే జ్ఞాపకం వస్తుండేవి. అతన్ని చూడడమే తరువాయి, మా స్నేహం లతలల్లుకుని, పుష్పిస్తుందని వూహించుకునేదాన్ని. మెరుపులు మెరిసే నవ్వు అతని కళ్ళల్లో గోచరిస్తుందని వూహించేదాన్ని. ఇదంతా-దేనికెంత ప్రాముఖ్య మివ్వాలో తెలియకపోవడం వల్లనే అనుకుంటాను. నన్నలముకున్న పరిమళంవంటిది అతని స్నేహం. ఆ నాలుగేళ్ళ నాజీవితంలో ప్రతివారం పోస్టుమేన్ రాకకి, ప్రతిరోజు తెల్లవారడానికీ ఒక ప్రాముఖ్యం ఇచ్చాయి అతనిని గురించిన ఆలోచనలు. పొద్దున ఆలస్యంగా నిద్రలేవగానే సూర్యుని కిరణాలు కళ్ళని తాకితే-అతనే జ్ఞాపకం వచ్చేవాడు.

కాలేజిలో క్లాసులో పాఠాలు జరుగుతుంటే చుట్టూ వున్న మొగపిల్లలవంక తేరిపార చూసేదాన్ని, ఎక్కడైనా అతని పోలికలు కనిపిస్తాయేమోనని-వసూ! మరీ పిచ్చగా ఉందికదూ?''

వసుంధర లేదని తలూపింది. ''లేదు చెప్పు'' అన్నది.

నిజంగా అది పిచ్చే- బి. యస్. సి. పూర్తి కాగానే హైదరాబాదులో యం.యస్.సి. చదువుతున్నాను. మిగిలినచోట్ల దరఖాస్తు చేసినా సీటు రాలేదు కాబట్టి వెంటనే ఒప్పుకున్నాను. ఊరువిడచి మరోచోట ఉండటానికి వెడుతున్నామంటే ఉత్సాహంగా ఉండటం సహజమే కానీ తెపతెపలాడే మనస్సుతో చూడసాగాను అతన్ని కలుసుకోవడంకోసం. నాకు సీటు దొరికిందని వ్రాశాను అతనికి. అతను వేరే ఏదో కాలేజీలో లెక్చరరు అన్న సంగతి మాఅన్నయ్యకి తెలుసు. హైదరాబాదు వెళ్ళిన తరువాత అతన్ని కలుసుకుంటానన్న సంగతి అన్నయ్యకి మాటవరసకి చెప్పినట్లుగా చెప్పాను. వారం వారం వచ్చే అతని ఉత్తరాలని అందరూ గమనిస్తూనే ఉన్నా, అతన్నెందుకనో చాలా మర్యాదస్తుడి క్రింద జమకట్టేసి, పట్టించుకోవడం

మానేశారు. హైదరాబాదుకి బయలుదేరే ముందుకూడా ఎక్కువగా మాట్లాడలేదు. నేను అతన్ని గురించి, ఏమిటో వెనుదీశాను.

నేనూ అన్నయ్యావచ్చి యిక్కడ హోటల్లో దిగాము.

యూనివర్సిటీకి వెళ్ళడం, ఫీజుకట్టడం, యిక్కడికివచ్చి హాస్టల్లో సీటు సంపాదించడం, అవీ యివీ కొనుక్కోవడం అన్నీ ఒకవారంలో పూర్తయినాయి. ఈవారం రోజుల్లో ఎన్నోచోట్లు తిరిగాము. బయటకు రావడం తడవు ఎక్కడో అతను కనిపిస్తాడని వెతికేవి నాకళ్ళు. అతను ఎవరని వెతుకుతాను నేను, గుర్తుపడతాను?

అన్నయ్య వెళ్ళిపోయాడు నన్నీ హాస్టల్లోదింపి. అతనికి వ్రాద్దామని సంకల్పం. రాత్రి వ్రాద్దామని పొద్దున్న, తెల్లారిలేచి వ్రాద్దామని రాత్రి వాయిదా వేసేదాన్ని. ఎందుకనో జాప్యం-వ్రాయగనే అతను వస్తాడు. అందుకేనేమో అర్థంకాని జాప్యం చేశాను. ఒక రాత్రి పడుకున్నాను. ఎంతకీ నిద్ర పట్టలేదు చేయదలచుకున్న పని ఏదో మిగిలిపోయినట్లు. లేచి అతని చిరునామాకి కవరు వ్రాశాను. నేను వచ్చాననీ మళ్ళీ శనివారంనాడు సాయంత్రం నన్ను చూడ్డానికి రమ్మని. తప్పక వస్తానని వ్రాశాడతను. ఆ జవాబు వచ్చినప్పట్నుంచీ నామనస్థితి వర్ణనాతీతం. ఆ సాయంత్రాన్ని తలచుకుంటూనే, ఉరకలువేసే మనస్సుతో కాలం గడిపాను.

-వసూ యిదంతా వింటుంటే నీకు ఆశ్చర్యంగా అనిపిస్తుంది కదూ? ఏవో వింత భావనలు కల్పించుకుని, ఒక ప్రణయాన్ని శాంతిస్తూ, అందుకై ఆరాటపడ్డానంటావు కదూ? కావచ్చు, మూడేళ్ళ క్రితం నాస్థితి అల్లాంటిది. మొదటిసారిగా యిల్లువదలి, ఒంటరిగా వుంటున్నాను. నావంటరితనం, అతనిని గురించిన ఊహల్లోని నవ్యత-నా పరిస్థితికి కారణాలనుకుంటాను.

అతని రాకని, ఆ సమయంలో నా అలంకరణ, సంభాషణ, నన్ను చూసి అతనేవిధంగా ప్రవర్తించేది అతనూహించని సౌంద

ర్యాన్ని అతను నాలో చూసి ఏమనుకునేదీ-అన్నీ వూహించుకున్నాను. నా వేపు ఆశ్చర్యంతో చూసే అతని కళ్ళని, పులకరించే నా హృదయ స్థితిని తలచుకున్నాను.

శనివారం రానేవచ్చింది. సాయంత్రం నాలుగు నుంచీ నేను వద్దనుకుంటూనే అలంకరించుకున్నాను. పరీక్షకు వెళ్ళే విద్యార్థిలాగా వణుకుతున్నాను.

ఐదుగంటలకి విజిటర్సు చీటీలు పట్టుకు వస్తోంది అయా. వరండాలోనే నుంచున్నాను. అతని చీటీ వచ్చింది. చల్లనై పోయిన వ్రేళ్ళలోకి ఆచీటీని తీసుకొన్నాను. అదేదస్తూరీ, గదిలోకి వెళ్ళి చెప్పులువేసుకుని, బయటకువచ్చాను. త్వరత్వరగా వరండాలన్నీ దాటి తోటలోకి వచ్చాను. ఆతోటదాటి, పెద్దమామిడిచెట్ల క్రింద నుంచి పరుగులెత్తాను. ఆ విజిటర్సు కూర్చునేచోటు చేరేసరికి ఆయాసపడుతున్నాను.

ఎంత గుంపులో వున్నా అతన్ని గుర్తుపడతానని ధైర్యం-గుర్తుపట్టలేనేమోనని బెదురు- తెల్లగా పొడుగ్గా ఒకాయన సూట్‌లో కూర్చుని వున్నాడు. అతనే! ఎంత చక్కని విగ్రహం. చీటీచేతిలో నలుపుతూ "నమస్కారమండీ?" అన్నాను. అతను తెల్లబోయినట్లు కనబడి, చేతులు జోడించాడు. "ఎంతసేపైంది వచ్చి?" అతనింకా తెల్లబోయాడు. "మీరు పొరబడుంటారు, మిస్" అన్నాడు ఇంగ్లీషులో. నేను ఒకడుగు వెనక్కి వేశాను. "మాధవరావుగారుకారా?" అన్నాను.

'నేనండీ మాధవరావుని-సుమిత్రగారూ!' వెనక్కి తిరిగిచూశాను

సుమిత్ర ఆగిపోయింది. వసుంధర ఉత్సుకతని రేకెత్తించడానికని ఆగలేదామె. ఆ సన్నివేశాన్ని చెప్పలేక ఆగింది.

"ఎల్లావున్నాడతను?" వసుంధర మృదువుగా అడిగింది.

"బావుండలేదు వసూ, బాగుండలేదు. లోతుకుపోయి, ఎఱ్ఱబారి సన్నగా గీతల్లాగావున్న అతని కళ్ళు, కళ్ళక్రింద నల్లనిగుంటలు,

స్ఫోటకం కాచ్చు. సన్నగా, బాగా నల్లగా, పొడుగ్గా వున్నాడతను. కరుకుగా వుంది అతని ముఖం. వికారంగా వుంది, అతని ముక్కు.

అతని కళ్ళు-అవి చూసి బావురుమని ఏడవాలనిపించిందివసూ.

"నమస్కారమండీ" అన్నాడతను చిరునవ్వుతో. అతను నన్ను చూసి చాలా హర్షపులకితుడైనాడు. అతని ముఖంలో చూపుల్లో కనిపిస్తోంది." ఆవిషయం స్పష్టంగా. నా పెదవులు సన్నగా కదిలాయి. నా చేతిలోని టీ క్రిందికి జారవిడిచి, సిమెంటు బెంచీవేపు చూశాను. మరుక్షణంలో నే క్రింద గడ్డిచూపించి 'ఇల్లా కూర్చోండి' అన్నాను అస్పష్టంగా. అతను జేబులోంచి రుమాలుతీసి పరుచుకొని కూర్చున్నాడు. నేను చెప్పులు విడిచి కూర్చున్నాను. అతనివంక కళ్ళెత్తి చూడలేకపోతున్నాను.

"వచ్చేముందు వ్రాయలేదేం నాకు?" అతని కంఠంగంభీరంగా వుంది. ఏదో వణుకు వినిపిస్తోంది ఆ స్వరంలో.

"వ్రాయలేదు-మీ ఇల్లు ఎంత దూరం ఇక్కడికి?"

"ఏమంత దూరంకాదు." అతను గడియారం చూసుకున్నాడు.

అతని చేతులపై బాగానలుపు అరచేతిలోని తెలుపుకి కాంట్రాస్టుగా వుంది. వేళ్ళకణుపులు బండగా వున్నాయి.

"మీరు బైటికి రావచ్చునా యీ టైములో?" అన్నాడతను. నేను పరధ్యానంగా గడియారం చూసుకున్నాను. 'రావచ్చు... కానీ' అని ఆగిపోయాను. హాస్టల్లోకి వెళ్ళిపోవాలనిపిస్తోంది అప్పటికే.

"పదండి అలా వెడదాం ఎక్కడికైనా" అంటూ అతను లేచి నుంచున్నాడు. నేనుకూడా లేచాను. బయట గేటుదగ్గర చిన్నకారు నిలబడివుంది. ముందు తలుపుతీసి ఎక్కండన్నాడు. వద్దు, వెనక కూర్చుంటానని అననివ్వలేదు నన్ను... "ఎక్కండి" అన్నాడు మళ్ళీ యాంత్రికంగా ఎక్కాను.

నాకు గొంతులో ఏదో వేదనగావుంది. శరీరమంతా నీరసంతో వాలిపోతోంది. నరాలలోని పటుత్వం ఒక్కసారి సడలి, శక్తులన్నీ నీరసించి పోతున్నాయా, అనిపించింది.

కారు బయలుదేరినప్పట్నించీ రోడ్డువంకే చూస్తూ కూర్చున్నాను నేను. "ఇన్ని సంవత్సరాల తర్వాత మనం కలుసుకోవడం చాలా బావుంది నాకు. కాదూ? మీవూరువచ్చి, మిమ్మల్ని చూసేద్దామని ఎన్నోసార్లు అనిపించినా ఎప్పుడూ కుదరలేదు" అన్నాడతను. మధ్య మధ్యను హారన్ మోగిస్తూ అతను కారు సున్నితంగా నడపడం మాత్రమే తెలుస్తోంది నాకు. మెత్తగా జారిపోతుంది. సిమెంటురోడ్డు మీదకారు. గాలికి నా ముంగురులు కదులుతున్నాయి. బజార్లన్నీ దాటి నిర్జనంగా వున్న రోడ్డుమీద పోతోంది కారు.

'మనం ఏమేమి ముఖ్యమైన ప్రదేశాలు దాటివచ్చామో తెలుసా? న్యూ మార్కెట్టు, హాస్పిటలు, హైకోర్టు, కొంచెందూరాన చార్ మినార్ -ఎప్పుడూ రాలేదా మీరీవేపు?' అన్నాడతను.

'లేదు' అన్నాను నేను. మరికొంతసేపు నిశ్శబ్దంగా గడిచింది. ఎక్కడో వూరిబయటకు వెడుతున్నామని తెలుసు నాకు.

'యూనివర్సిటీకి ఒక్కరూ వెళ్ళడం అలవాటైందా?' అన్నాడతను. తలూపాను. 'క్లాసులు జరుగుతున్నాయా?' అన్నాడు. తలూపాను.

పావుగంట తర్వాత బ్రిడ్జి, ఒక చిన్న తోట, పెద్ద చెరువువున్న ఒక ప్రదేశాన్ని చేరాము. బ్రిడ్జి దాటగానే కారుఆపి తలుపు తీశాడతను. కొన్ని మెట్లు కిందికిదిగి, అక్కడున్న తోటనిచేరాము. ఎదురుగా ఎన్నో గులాబీలు, చిన్న చిన్న మామిడిచెట్లు, అశోక వృక్షాలు. ఒక చెట్టుకింద కూర్చున్నాము.

'ఏమిటంత సైలెంట్‌గా ఉన్నారు? మీకింత కొత్త వుంటుందనుకోలేదు నేను- బాగుండలేదా యిట్లారావడం?' అన్నాడతను.

నేను ప్రయత్నపూర్వకంగా నవ్వాను. 'అభ్యంతరం లేదు' అన్నాను. నా వూహాకి, యీ యధార్థానికి సమన్వయపఱచుకుని, ఒక సంబంధ మేర్పఱచడానికి ప్రయత్నిస్తోంది నామనస్సు. చెట్టుకి దొడిగిన మొగ్గ నేడో రేపో దివ్యసుందర సుగంధ పుష్పమై వికసిస్తుందని ఎదురు చూడగా-ఆ మొగ్గ ఎండి రాలిపోయినట్లుంది నాపని.

'మీరు నన్ను గురించి ఏమనుకునేవారు?' ఎందుకింత వ్యక్తిగత మైన ప్రశ్న వేశాననుకుంటూనే అడిగాను. అతను తేలిగ్గా నవ్వాడు. 'ఏమనుకునేవాడినా? ఏమో!... కానీ నేను చాలా 'ప్లీజ్'అయ్యాను మిమ్మల్నిచూసి. మిమ్మల్ని చూడగలిగినందుకు నన్ను నేను అభినందించు కున్నాను. మరి మీరు?'

నేను కొంచెం సిగ్గుపడి నవ్వాను. 'నేనుకూడాను' నా ముఖం నేను చెప్పినమాట వింటుంది. కాని నా హృదయంమాత్రం హాయిగా నవ్వలేదు. అతని ముఖంమాత్రం సంతోషంతో వికసించింది. యూని వర్సిటీ విషయాలు, లెక్చరర్లను గురించి, వూళ్ళో సాహిత్య సంఘా లను గురించి, నేను చూడవలసిన ప్రదేశాలనుగురించి చెప్పాడతను. అతని కంఠం శ్రావ్యంగా వినిపించడం మానేసిందికాస్సేపు గడిచే సరికి. నాలోని వైముఖ్యం అతని కేమీ పట్టినట్లు కనుపించలేదు.

మాట్లాడుతున్నంతసేపూ నా కళ్ళు, నుదురు చూస్తున్నా డతను. తల వంచుకుని కూర్చున్నదాన్ని మళ్ళీ ఒకసారి నిజం చూసి తెల్సుకుందామన్నట్లు, కళ్లెత్తి . అతనివంక చూశాను. ఏమిటో! మార్దవంలేదు అతని కళ్ళల్లో, ఏ మెరుపులూ లేవు... నాకు నచ్చని భావాలేవో వున్నాయి. యీ లోకంలోని విషయాలన్నీ తనకే కావాలన్న దురాశ కనిపిస్తోంది ఆచూపులో. తన స్వంతమైన వస్తువు వంక చూసుకుంటున్న దర్పముకనిపిస్తోంది. నేను తలవంచుకున్నాను.

చీకటి పడేలోపే తిరిగివచ్చేశాము. 'రేపు యింటికి వెడదాము వస్తారా?' అన్నాడతను హాస్టలుగేటుదగ్గర. నేను మాట్లాడలేదు. నాకు

వెళ్ళాలనిలేదు. చికాకు కలుగుతోంది. అతను నాకు వ్రాసిన వుత్తరాలు, నేను అతనికి ఆప్యాయంగా వ్రాసిన ఉత్తరాలు అందంగా తేలికైన పూలలా కనుపించాయి. మరుక్షణమే హోరుగాలి లేచి, పూలన్నీ అల్లా ఎగిరిపోయాయి దూరంగా.

'రేపా'? అన్నాను సందిగ్ధంగా.

'ఏం? ఆదివారమేగా! నాలుగింటికివస్తాను.ఏం?' అన్నాడతను లాలనగా వుంది అతని ప్రశ్న. నేను వప్పుకోనిదీ వీల్లేదన్నట్లుంది అతని వాలకం.

'ఊ' అన్నాను. 'గుడ్ నైట్' అని కారెక్కి తలుపు వేసుకున్నాడు. కారు బయలుదేరి వెళ్ళేవరకు అల్లాగే నుంచున్నాను నేను. హాస్టల్లోకి వస్తుంటే-ఆ పెద్దమామిడిచెట్ల క్రిందనుంచి, గుడ్డిగా వెలిగే దీపాలక్రిందనుంచి వస్తుంటే-నాకు కలలోంచి మేలుకుంటున్నట్లనిపించింది. హఠాత్తుగా ఒక దరిదాపులేని ఎడారిలో పడవేసినట్టుంది నా పరిస్థితి. ఆ రాత్రి-ఎంతసేపో కరువుతీరా నిశ్శబ్దంగా ఏడ్చాను. నాకు కలిగిన నిరాశ, బాధ తగ్గిపోయాయి.

మర్నాడు ఏమీచేయలేదు. మధ్యాహ్నం నుంచి నాకు మళ్ళీ ఆరాటం ప్రారంభమైంది. ఏమిటి నాకతనితో సంబంధం? ఎందుకు నేను వాళ్ళింటికి వెళ్ళాలి? అనిపించింది. మూడున్నరైనా నేను లేచి తయారుకాలేదు. నాలుగు కావస్తున్నకొద్దీ నాకు నీరసం ఎక్కువైంది. ఏమిచేసేందుకు ఓపికలేకుండా అశక్తురాలివలె పడుకున్నాను. ఆయా చీటీ పట్టుకువచ్చింది. నేను బద్ధకంగా లేచి చీటీవెనకాల వ్రాశాను. 'వంట్లో బాగులేదు, మన్నించండి. రాలేను' అని. మరి పావుగంటకి మళ్ళీవచ్చింది ఆయా. 'మళ్ళీ ఎప్పుడు కలవమంటారు?' అన్న ప్రశ్న పట్టుకుని. నేనే ఉత్తరం వ్రాస్తానని సమాధానం వ్రాసి పంపాను. నిర్వికారమైన మనస్సుతో నిద్రపోయాను ఆరాత్రి. వారం రోజుల వరకు ఏమీ వ్రాయలేదు నేను.

ఊళ్ళోనే మరో కాలేజీలో పనిచేసే అతను, ఒక మధ్యాహ్నం యూనివర్సిటీలో కనిపించాడు నాకు. నన్ను చూస్తూనే అతని ముఖం నవ్వుతో వికసించింది. "హల్లో- బాగున్నారా?" అన్నాడు. నేను తలూపాను. "ఏం, యిలా వచ్చారు?" అన్నాను.

"మిమ్మల్ని చూద్దామని"- నవ్వాడు "అబ్బే. మా తమ్ముడికి ఫీజుకట్టాలని వచ్చా... బి.యస్.సి. లో ఉన్నాడు - వ్రాస్తానన్నారు వ్రాయలేదేం?" అన్నాతడను-మళ్ళీ.

'మొన్న మంగళవారం వ్రాశాను, అందలేదా?'

'లేదే! ఏమని వ్రాశారు!' అన్నాడతను.

'ఇవాళ్ళ నన్ను చూడ్డానికి రమ్మని వ్రాశాను' అప్రయత్నంగా ఆడేశాను అబద్ధాలు. పిరికిగా తప్పించుకోడానికని ఆడేశాను కానీ- మనస్సు వీటిని అంగీకరిస్తోంది. ఇతనిపట్ల నీకు బాధ్యత ఏమిటి అని సమర్థించుకో చూస్తోంది, నువ్వెందుకు సంజాయిషీ చెప్పుకోవాలని ఎదురు తిరిగి ప్రశ్నిస్తోంది హృదయం.

'అరె. సారీ' సాయంత్రం కాలేజీలో ఒక మీటింగువున్నది. మీకు ప్రాక్టికల్సు రెండింటికి కదా అలావూళ్ళోకి వెళ్ళి కాఫీ త్రాగేసి వద్దాం రండి' అన్నాడతను. దూరాన అతనికారు నిలబెట్టివుంది. మెట్లు దిగబోతూ ఆగాను నేను... అడ్డంగా తలూపాను. 'వద్దు' అన్నాను కానీ- అతనితోపాటు మెట్లుదిగి క్రిందకివచ్చాను. అతను ఆశ్చర్యపోయాడు ముందు. "ఏం" అన్నాడు. సందేహంగా. అతని ప్రశ్న అంత చొరవగాలేదు. 'ఏంలేదు. వద్దు' అన్నాను అతనివంక చూసి. అతనికళ్ళల్లో ఏమిటిది అన్న సంశయంవున్నదా అనిపించింది నాకు.

'నేను వెడతాను మరి. తలనొప్పిగా వుంది' అని నమస్కారం చేసి, పేలైనంతహాయిగా నవ్వి. వెనక్కి తిరిగి మెట్లుఎక్కి కాలేజీలోకి

వెళ్ళిపోయాను. అతను ఒక్క నిమిషం ఆగి, కారు స్టార్టుచేసి వెళ్ళి పోయాడు...'

సుమిత్ర కంఠం రుద్ధమైంది.

'చీకటిపడుతోంది. లే' అన్నది వసుంధర. సుమిత్ర కదల్లేదు.

'...ఆ తర్వాత వారంరోజులకి ఏదోవూరు వెడుతున్నానని, నెలవరకు రాలేనని ఉత్తరం వ్రాశాడతను. నెలరోజుల తర్వాతనే వ్రాయమన్నాడు నన్ను. ఈలోగా నా కేదయినా సహాయము అవసర ముంటే వాళ్ళ తమ్ముడికి చెప్పమన్నాడు నన్ను ఫోన్‌లో.

నెలదాటినా నేను అతనికి వ్రాయలేదు. ఆ తర్వాత అత నొక్కసారి వచ్చాడుట హాస్టలుకి నేను లేనప్పుడు. వచ్చి వెళ్ళాడని తెలిసి కూడా నేను ఏమిటో సంగతి కనుక్కోలేదు. వసూ, నేను చేసుకున్న వూహాలన్నీ కల్లలైపోయాయన్న బాధ ఒక్కటే కాదు నాకు- తానంత వికారంగా వున్నట్లుకూడ అతనికి తెలియదా అని కూడా నాకే బాధ. ఏమిటో కసిగా నా ఆలోచనల్లోంచి అతన్ని తొలగించుకోడానికి ప్రయత్నించాను. అన్నీ మర్చిపోవడానికి యత్నిం చాను. అటు యిటు ఆనందంతో చూడవలసిన విశేషాలేమీ లేనట్లుగా సూటిగా సాఫీయైన రోడ్డుమీద నడకలాగా అయింది జీవితం. ఏదో అందమైన విషయాలు యింకా ముందు ముందు చూస్తానన్న ఉత్సా హం లేదు ఆ గమనంలో. నన్నలముకొన్న నిరాశ, హతాశ మెల్లిగా విడిపోసాగాయి.

మొదటి టరమ్ సెలవులకి నేను యింటికి బయలుదేరాను. రైలు సికిందరాబాదు చేరింది. బయటకు తలవుంచి, స్టేషనులోకి చూడసాగాను. బిస్కెట్లబండివాణ్ణి పిలచి ఒక పాకెట్టు కొన్నాను. రైలు బయలుదేరే వేళైంది. దూరాన్నుంచి జనం పరుగులుపెడుతూ రైలువేపుకి వస్తున్నారు. ప్లాటుఫారం మీదికి చూశాను. చటుక్కున

అతను కనపడ్డాడు. పుస్తకాల షాపుదగ్గర నిల్చుని ఏదో మేగజీను తిరగవేస్తున్నాడు. అతను తలెత్తి చూశాడు కొద్ది క్షణాల తర్వాత. నన్ను చూడగానే అతని ముఖం ఒక్కసారిగా వికసించింది. నా హృదయం ఝల్లుమన్నది-భయంతో, చీకాకుతో ముడుచుకుపోయింది మనస్సు. నా ముఖంలో నవ్వురాలేదు, ఎందుకితనితో నేనీ పరిచయాన్ని పొడిగించడం? మనస్సు నిగ్గబట్టుకుని నేను ముఖం ప్రక్కకు తిప్పుకున్నాను.

రైలు కూతపెట్టింది. ఒక్కసారి తలత్రిప్పి అతనేమి చేస్తున్నాడో అని చూశానునేను. పదిగజాల దూరంలోనే ఉన్నాడతను. అతని కళ్ళు మెరుస్తున్నాయా అనిపించింది. ఆర్ద్రంగా మిణుకుమంటున్నాయి ఆ కళ్లు-బాధాకరమైన ఒక సత్యాన్ని కనుక్కొని, తీవ్ర వేదన పొందుతున్నట్లుందేమో ఆచూపుఅని యిప్పుడనిపిస్తుంది నాకు.

అతనితో ఉత్తర ప్రత్యుత్తరాలు నా యిష్టం వచ్చినతీరున నడిపి, నన్ను గురించి ఏవో ఆశలు కల్పించుకోనిచ్చి- ఆ స్నేహాన్ని నా యిష్టం వచ్చినట్లు త్రెంపివేసే అధికారం నాకెవరిచ్చారు? 'నీతో స్నేహం నాకిపుడు బాగుండలేదు. ఫో' అని విసరికొట్టేహక్కు నాకు లేదు. వసూ, అవన్నీ ఇప్పుడనుకుంటాను. ఆ ప్లాటుఫారంమీద అతనితో నవ్వుతూ మాట్లాడితే నాసొమ్మేమి పోయింది? నాఘనత ఏమి తగ్గింది? ఒకకీటకాన్ని అవతలకి త్రోసిపారేసి, అది బాధతో గిలగిల లాడుతుంటే, నాకేమీ పట్టనట్టుచూస్తు వూరుకున్నాను. తోటిమానవుణ్ణి అల్లాగే బంధించాను నేను....."

"తర్వాత ఎప్పుడుచూశావుఅతన్ని మళ్ళీ" అన్నది వసుంధర. సుమిత్ర వసుంధర వళ్ళో తలదాచుకుని బిగ్గరగా ఏడ్చింది. ఎంతసేపుగానో ఆపుకున్న దుఃఖం పొంగిపొర్లుకొచ్చింది.

"లేదు. అందుకే వసూ అన్నాను జీవితంలో ఎవరికైనా మరో వ్యక్తికి ఆనందం కలిగించే అవకాశం ఎప్పుడోగాని రాదని, ఆవచ్చిన

అవకాశాన్ని జారవిడుచుకోవడమే కాదు-అతి క్రూరంగా వేదన కలిగించి, వెనుతిరిగి సవరించుకోలేని అపచారం చేసాను నేను. ఎంతసేపూ నా ఆశలు తల్లక్రిందులవడం, నన్ను గురించిన ఆలోచనలే నాకుతోచాయిగానీ-అతనిలో నేనేమి వూహాల రేకెత్తించాను, అతను నన్ను చూసి ఏమనుకున్నాడు, నేను ఆతృతగా అతన్ని చూడ్డానికి పరుగెత్తుకొనివచ్చి, నీవా అన్నట్లు చూసినప్పుడు అతనెంత అవమానభారంతో క్రుంగిపోయినాడు,-వసూ, నేను చేసినపని ఎంత తప్పు!" సుమిత్ర ఏడుస్తూనే వుంది. వసుంధర కొంచెం ఆగింది. "ఎందుకు సుమిత్రా ఆ యేడుపు? నువ్వేంచేశావని తప్పు? మళ్ళీ ఎప్పుడు చూశావు అతన్ని?" అన్నది ఆమె సుమిత్ర తలనిమిరి.

సుమిత్ర మరొక్కసారి బిగ్గరగా ఏడ్చింది "ఎప్పుడు చూస్తాను? నేను సెలవులంతా అతన్ని గురించి ఆలోచించలేదు. ఇక్కడికి తిరిగివచ్చిన మూడోనాడు పేపరులోపడింది-అతను రెండురోజులు జ్వరంతో తీసుకుని చనిపోయినట్లు...వసూ, నేను నిజంగా పాపం చెయ్యలేదూ? ఆఖరుసారిగానైనా అతన్ని చిరునవ్వుతో పలకరించి ఆ ఆనందాన్ని యిస్తే నిజంగా ఎంతమధురంగా వుండేవి అతని స్మృతులు? నన్ను అహోరాత్రులు వెన్నాడే బాధ మాత్రమే మిగిలిందినాకు."

బాగా చీకటి పడేవరకు అల్లాగే కూర్చున్నారిద్దరూ. చుట్టూ ప్రకృతి అంతా కనులకు స్పష్టంగా కనిపించడం మానేసింది. అక్కడొకటీ, యిక్కడొకటీ పక్షులు ఆతృతగా అరుస్తూ, ఎగురుకుంటూ వెళ్ళాయి.

"లే సుమిత్రా-లోపలికి పోదాంపద." అన్నది, వసుంధర. సుమిత్ర లేచి, కళ్ళు తుడుచుకుంది కొంగుతో. వసుంధరమీద ఆనుకుని రూము చేరింది ఆమె. రూములోకి వెడుతూనే మంచంమీదపడి వెక్కి వెక్కి ఏడ్చింది ఆమె.

అప్పుడుగానీ, ఆతర్వాత ఎన్నోసార్లు దిగాలుగావుండే సాయంత్రాల్లోగానీ సుమిత్ర ఏడ్చినప్పుడు-వసుంధరకి ఏమని ఆమెను అనునయించాలో తోచలేదు.

భూమి త్రవ్వినకొద్దీ వూరుతుంది నీరు-ఎవరేమి చేయగలరు? ఎవరూ తీర్చలేని, ఎవరికివారు తీర్చుకోలేని వ్యథలు కొన్ని వుంటాయి. అవి అంతే.

# రచయిత్రుల గురించి....

1. కొమ్మూరి ఉషారాణి:

అక్టోబర్ 1932లో మద్రాసులో జననం. బి. ఎ. బి. ఎల్ పట్టభద్రులు. కేంద్రసాంఘిక సంక్షేమ సంస్థలో ఉద్యోగం. 'ప్రతీకారం' 'తండ్రీకూతురు' అను పుస్తకాలు ప్రచురింపబడ్డాయి.

2. నిడదవోలు మాలతి:

1938లో విశాఖపట్నంలో జననం. బి. ఎ. (ఆనర్స్) పట్టభద్రులు. ఆంధ్ర విశ్వవిద్యాలయ గ్రంథాలయంలో ఉద్యోగం. 1951 నుండి కథానికా రచన.

3. మందరపు పద్మ, లలిత:

పద్మ, లలిత అక్కచెల్లెళ్లు. విజయవాడలో జననం. పట్టభద్రులు. జంటగా, విడిగా కథలు, వ్యాసాలు వ్రాస్తుంటారు. లలిత ప్రస్తుతము ఆంధ్రపత్రిక సంపాదకవర్గంలో పనిచేస్తున్నారు.

4. కె. రామలక్ష్మి:

జననం 1930 డిసెంబర్ 31 వ తేదీన తుని దగ్గర కోటనందూరు గ్రామంలో. విద్యాభ్యాసం కాకినాడ, మద్రాసులలో. పట్టభద్రులు. 'అవతలిగట్టు' 'మెరుపుతీగె', 'విడదీసే రైలుబళ్ళు', 'దారిచూపిన దీపకళికలు', 'స్త్రీ సంక్షేమం', 'ఆణిముత్యం', "తొణికిన స్వర్గం" ప్రచురింపబడిన పుస్తకాలు.

5. ఇల్లిందల సరస్వతీదేవి:

జననం 1915లో. స్వస్థలం హైదరాబాదు. జర్నలిజమ్‌లో డిప్లొమా పొందియున్నారు. ఆంధ్రప్రదేశ్ శాసనమండలి సభ్యురాలు. "పండుగ బహుమానం" "ముత్యాలమనసు" "అక్కరకువచ్చిన

చుట్టం" "జాతిరత్నాలు" ప్రచురితాలు. "రాగములో రంగులు" "బాలవీరులు" "జీవన సామరస్యం" "వెలుగుబాటలు" "నారీజగత్తు" త్వరలో రానున్న పుస్తకాలు.

6. చాగంటి తులసి:

జననం 1940లో. విజయనగరంలో. 'బంగారపు ఉంగరం' "మాంజాదారం" మొదలైన కథలు ప్రచురింపబడ్డాయి.

7. ముప్పాళ రంగనాయకమ్మ:

జననం 1938లో పశ్చిమగోదావరిజిల్లా బొమ్మిడి గ్రామంలో. తాడేపల్లి గూడెం హైస్కూలులో విద్యాభ్యాసం. వీరి "కృష్ణవేణి" "అండాలమ్మగారు" ఆంధ్రపత్రికలో సీరియల్‌గా ప్రచురింపబడి పాఠకుల అభిమానం చూరగొన్నాయి.

8. యస్. యస్. ప్రసూన:

జననం 1934లో. పుట్టింది విజయవాడ మెట్టింది నూజివీడు. ప్రస్తుత నివాసం తణుకు. వీరికథలు అనేకం వారపత్రికలలో ప్రచురితం.

9. తురగా జానకీరాణి:

జననం ఆగస్టు 31, 1936లో మచిలీపట్నలో. మచిలీపట్నంలో బి ఎ. తర్వాత ఉస్మానియా విశ్వవిద్యాలయం యమ్ ఏ. పట్టభద్రులు. మద్రాసు ఇండియన్ ఇనిస్టూట్ ఆఫ్ ఫైన్ ఆర్ట్సులో భరతనాట్యం అభ్యసించారు. ప్రస్తుతం రాష్ట్ర సాంఘిక సంక్షేమ సలహా సంఘ కార్యాలయంలో పనిచేస్తున్నారు. ప్రత్యూష ప్రచురణలను స్వంత సంస్థ దారా త్వరలో వీరి కథలసంకలనం రానున్నది.

—◎—

